నృసింహామహాకవి, సంకుసాల

కవికర్ణ రసాయనము

చెన్నపురి, 1916.

Record no. 162

## Bibliographic Record Target

నృసింహమహాకవి, సంకుసాల, 126th cent.

కవికర్ణ రసాయనము / సంకుసాల నృసింహమహాకవి ప్రణీతము ; ఉత్పల వేంకటనరసింహాచార్య.- చెన్నపురి : వావిళ్ల నరసింహశాస్త్రులు అండ్ సన్స్, 1916.

160 p. ; 21 cm.

Record no. 162

Nṛsiṃhamahākavi, Saṅkusāla, 126th cent.

Kavikarṇa Rasāyanamu / Saṅkusāla Nṛsiṃhamahākavi praṇītamu ; Utpala Vēṅkaṭanarasiṃhācārya.- Cennapuri : Vāviḷla Narasiṃhaśāstrulu aṃḍ Sans, 1916.

160 p. ; 21 cm.

Record no. 162

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB    Date filming began:

శ్రీ రస్తు.

# కవికర్ణరసాయనము.

సంకుసాల. శ్రీనృసింహమహాకవిప్రణీతము.



ఉత్పల. వేంకటనరసింహాచార్య

పరిష్కృతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1916.

PRINTED BY
V. RAMASWAMY SASTRULU & SONS,
AT THE AUDI SARASWATY NILAYA PRESS,
69, MALAYAPERUMALL STREET, MADRAS.—1916.



శ్రీ ర స్తు.

# క వి కర్ణ ర సా య న ము.

## పీ ఠి క.

### శ్రీరంగనాథస్తుతి.



రామావసుధాపయోధరములం జేదోయి రెంట న్నను
ప్రారంభంబునఁ జిత్రభంగి మకరీపత్త్రాంకము ల్వ్రాసి ని
ర్వైరప్రేమల నిద్దఱందు సమసారస్యంబునం దేలు నా
శ్రీరంగేశుఁడు మమ్ము నిర్మలసుఖశ్రీయుక్తులం జేయుతన్ 1

### బ్రహ్మస్తుతి.

చ. పొలయలుకన్ జపంబునకుఁ బూనుకనుంగవ లెల్ల మోడ్చియుం
దలఁపున మంత్రవర్ణమయతం గనుపట్టినవాణిఁ జూచి న
వ్వొలయఁ గవుంగిలించి సుసుఖోన్నతిఁ జెందెడువిశ్వతోముఖుం
డెలమి దలిర్ప మత్కృతికి నీవుత విశ్వజనాభిముఖ్యమున్. 2

### శివస్తుతి.

మ. ముకుటాగ్రస్థితచంద్రచంద్రిక సదా ముంపం బ్రభావం బెలుం
గక శశ్వత్పరిరంభణావితతసౌఖ్యస్నిగ్ధుఁ డై జాయఁ బా
యక లీలాపరుఁ డైనశంకరుఁడు నిత్యప్రీతి సంధించుతన్
సకలాహ్లాదము గా మదీయకృతికి న్శబ్దార్థదాంపత్యమున్. 3

### విఘ్నేశ్వరస్తుతి.

మ. నను మన్నింపుము నీకు మామ యగు మైనాకంబు నాకాధినా
థునిమోలిం బడు నంచుఁ బార్వతి వియద్ధూత్కారము న్మాన్పినం
దనతుండంబునఁ బీల్చియున్నజలధిం బాఁ గ్రమ్మఱం గ్రుమ్మరిం
చినశుండాలముఖుండు మామకకృతిశ్రీ కిచ్చు నిర్విఘ్నతన్. 4

### సరస్వతీస్తుతి.

శా. కాసారంబులు పాహిణంబులు సరిత్కాంతుండు పూఁదోఁట వి
ద్యాసీమంబులు రచ్చపట్లు సురకాంతాలోకసీమంతభూ
షాసిందూరము పాదలాక్ష యగుభాషాదేవి మత్ప్రౌఢజి
హ్వాసింహాసన మూనుఁ గాతఁ గృతియుక్తాలంక్రియాహంక్రియన్. 5

వ. అని యభీష్టఫలప్రదపరమపురుషప్రార్థనంబును గావ్యసాధారణలక్షణోపస్థాపనాభి
ప్రాయంబున నితరోచితదేవతానిరూపణంబును గావించి. 6

### కృతికర్తృజ్ఞాపనము.

క. గురువరభట్టపరాశర, చరణసరోరుహసముల్లసన్మానసుఁడన్
నరసింహనామధేయుఁడఁ, బరిచితసత్కృతిరసానుభవహేతువునన్. 7

### సత్కవిప్రశంస.

చ. మనమునఁ గొన్ని నెవ్వగలు మాన్పి ఘటింతురు కావ్యసమ్మదం
బనఘకథాముఖంబున హితాహితబోధ మొనర్తు రింపుగాఁ
గనుఁగొనుకంటె నద్భుతముగా నెఱిఁగింతు రతీంద్రియార్థముల్
ఘనమతు లెల్లవారికి నకారణబంధులు గారె సత్కవుల్. 8

వ. అందున. 9

### మిశ్రకావ్యప్రశంస.

గీ. కావ్య ముత్పాద్య మైన సత్కావ్య మింక, నుక్తకావ్యంబ యే పునరుక్తిఁ దెచ్చుఁ
గానఁ గవితాభిముఖుఁ డైనకవివరునకు, మిశ్రకావ్యంబె కావ్యమై మెఱుఁగు దెచ్చు.

### కాకవినిరాకృతి.

క. నేరిచిన సుకవి కృతిచేఁ, బే రెఱిఁగించుకొని జగతిఁ బెంపగు టొప్పున్
నేరకకృతిఁ జెప్పుట దన, నేరమి యపకీర్తి జగతి నిలుపుట గాదే. 11

క. ఏరసముఁ జెప్పఁ బూనిన, నారస మాలించువారి కడరింపనియా
నీరసపుఁగావ్యశవముల, దూరమున న పరిహరింపుదురు నీతిజ్ఞుల్. 12

చ. ఫణితులు రెంట మూఁట నొకపద్యము గూరుచువారు లక్ష్యల
క్షణసహకావ్యనిర్వహత గల్గుట చిత్రము గాని యట్లపో
ఫణిమణిమాత్రధారు లగుపాము లసంఖ్యము గాక తత్ఫణా
మణివిధవిశ్వభూభృతిసమర్థుఁడు శేషుఁడు గాక కల్గునే. 13

క. అసులనె యుండుకవితా, పాకములనె మొదలు చెడినప్రాఁదప్పులయా
లోకము జిహ్వాంచలముల, యాకులు గాకుండు నెవ్వి యవివో కవితల్. 14



క. పరభుక్తము లైనయలం, కరణముల జుగుప్స లేక కైకొని పదవి
స్ఫురణంబు చూపుకుకవిత, పరికింపఁగ లజ్జలేనిబానిస గాదే ? 15

ఉ. సొంతము గాఁగ శబ్దహృదయజ్ఞులు గా రుచితప్రయోక్త లై
వింతలుగాఁ బ్రబంధములవీథులు ద్రొక్కఁగ లేరు శక్తు లై
దొంతరజల్లిబొంతవెడదూర్చి గతార్థము కూర్చుదుష్కవి
భ్రాంతులసందడిం దడవఁ బాసె రసజ్ఞులకుం గవిత్వముల్. 16

క. కలకంఠకలన చూపక, కలకంఠం బూరకున్నఁ గాకము కాదే ?
కలితనిజవాగ్విలాసం, బలరింపనితజ్ఞుఁ డైన నజ్ఞుం డగుటన్. 17

### కవిప్రతిజ్ఞ.

చ. హృదయగతిం బురాతనకవీశ్వరు లేగనివీథి లేదు నేఁ
దదనుమతిన్ రచించుకృతి తాత్త్వికులం గరఁగింపకుండునే
మదగజరాజము ల్చనినమార్గములం గడుసింపు నింపవే?
మదగజరాజయానమదమంథరబంధురయానమానముల్. 18

### పురోభాగిదూషణము.

చ. ఖలుఁ డిలఁ దప్పులే వెదకుఁ గావ్యరసానుభవంబు సేయ లేఁ
డొలుకులు కోరుఁ గాక మధ మూనఁగ గర్దభ మొంద నేర్చునే?
మలయమరుద్విధూతమధుమాసవికస్వరకేసరావళీ
గళితపరాగయోగపరికల్పితపేశలతల్పసౌఖ్యముల్. 19

క. ఎల్లరు మెచ్చనిమత్కృతి, నుల్లంబున మెచ్చుఁగాక యొకఁ డుష్ట్రికులం
బొల్లనిపల్లవితామ్రిము, గొల్లలుగాఁ బొగడ నొక్కకోయిలలేదే ?. 20

### రసజ్ఞభూషణము.

ఆ. తప్పు గల్గె నేనితార తీర్చి రసజ్ఞు, లస్మదీయకవిత ననుమతింతు
రించుటలుక గలిగెనేఁ దీర్చి ప్రేయసి, నుల్లమున వరింప కోర్తు రెట్లు ? 21

### కృతిప్రశంస.

గీ. యతి విటుఁడు గాకపోవు టె ట్లస్మదీయ, కావ్యశృంగారవర్ణనాకర్ణనమున
విటుఁడు యతిగాక పోరాదు వెస మదీయ, కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున. 22

వ. అని వితర్కపూర్వకంబుగా నపూర్వవిరచనాచాతుర్యంబు నెఱయ మెఱయ నన్వర్థ
నామంబుగాఁ గవికర్ణరసాయనం బన నొక్కకావ్యంబు రచియింప నున్ముఖుండ నై
యనుకూలనాయకాన్వేషణపరాయణాయత్తం బైనచిత్తంబున. 23

### నరకృతిప్శతిత్వగర్హణము.

సీ. ఆందోళికలయందు నంతరచరు లైన, సవికృతాకృతుల పిశాచజనులు
పరకరాళంబు లై ప్రార్థింపఁ గనుఁగోక, వాయె త్తకుండుజీవచ్ఛవములు
వాలవీజనములఁ గ్రాలుచు నీఁగకు, నంటీవిఖరవర్తులాండసములు
వేత్రపరంపరావిలకంటకాకృతిఁ, జేరఁబోరానిబర్బూరతరులు
గీ. శంఖనాగస్వరస్వరశ్రవణసమద, విస్ఫుటచ్ఛత్రవిస్ఫారితస్ఫటాక
విష్టవిషవైద్యవశవర్తిదుష్టఫణులు, ప్రభుదురాత్ముల నెవ్వాఁడు ప్రస్తుతించు. 24
వ. అదియునుంగాక. 25
గీ. నరగుణాంకితమయ్యె నే సరసకృతియు, దూష్య మగు శునిధృతగతదుగ్ధమట్లు
హరిగుణాంకిత మయ్యె నే నసదుకృతియు, హారసూత్రంబుగతి హృదయంగమంబు.

### కృతినాథరంగనాథప్రశంస.

సీ. జగదేకపతి యయ్యు సకలాభిగమ్యుండు, సర్వశాసకుఁ డయ్యు సదయహృదయుఁ
డభిమతప్రదుఁ డయ్యు నంజలిసాధ్యుండు, పరిపూర్ణుఁ డయ్యును బ్రణతికాముఁ
డతిగతేంద్రియుఁ డయ్యు ననిమిషదృగ్దృశ్యుఁ, డనియోజ్యుఁ డయ్యుభక్తానుయాయి
సాక్షి యయ్యు సుతాపచారానభిజ్ఞుండు, సముఁ డయ్యు నార్తరక్షాపరుండు
తే. భద్రగుణనిధి దుర్గుణప్రతిభటుండు, సముఁడు నధికుండు లేనియుత్తమపురుషుఁడు
వెదకి చూచిన శ్రీరంగవిభునివంటి, ప్రభువు నత్యంతసులభుండు ప్రభువు గలఁడె. 27
శా. జ్ఞానప్రౌఢమహాకవీశ్వరవచస్సంస్తూయమానుండు ల
క్ష్మీనాథుండు మదల్పవాక్యరచనాస్వీకర్త గాకుండు నే?
నానాభూపతు లెల్లఁ గానుకలు రత్నశ్రేణు లర్పింపఁగా
దానాముష్టిముచుం గుచేలుఁ గరుణన్ ధన్యాత్ముఁ గాఁ జూడఁడే. 28
వ. అని సకలలోకనాయకుం డైన శ్రీరంగనాయకుం డాకృతినాయకుండుగా నిశ్చయించి మొదలం గృతిముఖాలంకారంబుగాఁ గృతినాయకుదివ్యావతారక్రమం బభివర్ణించెద.

### శ్రీరంగనాథదివ్యావతారవైభవము.

సీ. మున్ను కల్పాది నంభోజనాభునినాభి, నలినగర్భంబున నలువ పుట్టి
యఖిలైకమూలంబు లైనవేదంబుల, నతనికృపాలబ్ధి నధిగమించి
శబ్దానుసారి యై జగ మెల్ల సృజియించి, పరికించి యింద్రాదిపదములెల్ల
నాత్మాధికారంబు నస్థిరం బని కాంచి, నిర్విణ్ణుఁ డై మోక్షనిత్యసుఖము
గీ. పరమపురుషప్రసాదసంప్రాప్య మనియుఁ, దత్ప్రసాదంబు తత్పదద్వంద్వభజన
సాధ్య మగుటయు వేదాంతసరణి నెఱిఁగి, తపము గావించె దుగ్ధాబ్ధితటమునందు. 30



ఉ. మెచ్చి రమావిభుండును సమీపమునం దొకకచ్ఛపాకృతిన్
వచ్చి వరంబు వేఁడు మన వారిజగర్భుఁడు మ్రొక్కి కోర్కి నా
కిచ్చెద వేనిఁ జూపు పరమేశ్వర! నీదగుదివ్యవిగ్రహం
బచ్చుగ మత్స్యకచ్ఛపముఖాకృతు లన్నియు భూతపూర్వముల్. 31
గీ. ఎద్ది నైసర్గికము నీకు నెద్ది పరమ, మెద్ది గోప్యంబు శాశ్వతం బెద్ది యెద్ది
దివ్య మఖిలేశ! యుపనిష ద్వేద్య మెద్ది, యట్టిరూపంబు చూపి కృతార్థుఁ జేయు. 32
చ. అన విని కంజగర్భ! భవదర్థితరూపము ముక్తలోకజీ
వన మదిచూడఁ జెల్లదు భవాదృశబద్ధులకుం గృపానిబం
ధనమతిఁ జూపువాఁడ నవతారముఖంబున నట్టిదీనిఁ గ
న్గొన నధికారి వీ వగుటకుం గొను మిచ్చెద మూలమంత్రమున్. 33
వ. అని యనుగ్రహాతిశయంబున నపవర్గఘంటాపథం బగు శ్రీమదష్టాక్షరీమంత్రంబును దదనుష్ఠానంబునుం దదర్థస్వరూపంబును దదనుభావంబును దద్విషయనిజనిరతిశయప్రియభావంబునుం దేటపడ నానతియిచ్చి కపటకచ్ఛపంబంతర్ధానంబు నొందినం బరమేష్ఠియు నుక్తమంత్రానుష్ఠాననిష్ఠాపటిష్ఠుం డై చిరకాలంబు తపంబు సేయం దత్తపఃఫలరూపం బై సకలజగదద్భుతావహంబుగా దుగ్ధమహార్ణవమధ్యంబున. 34
సీ. భుజగాధిపతిధృతస్ఫురదాతపత్రంబు, చంద్రార్కకరచలచ్చామరంబు
సూత్రవతీభర్తృవేత్రపాణియుతంబు, విహగరాజస్కంధవిలసితంబు
నందసునందాదినానాభుజిష్యంబు, గంధర్వకిన్నరీగాయకంబు
సనకసనందాదిజయశబ్దముఖరంబు, సిద్ధసాధ్యగణాధిసేవితంబు
గీ. విశ్వతఃకల్పతరుపుష్పవృష్టికంబు, దేవదుందుభిరవదళద్దిక్తటంబు
భూరితేజోమయంబు నై పొడమి పొలిచె, రంగధామంబు జగదేకమంగళంబు 35
క. అపుడు భయాద్భుతహర్ష, స్థపుటితమతి కిచ్చపడినచతురాననుపైఁ
గృపదగ్గఱి వచ్చి రమా, ధిపభటుఁడు సునందుఁ డతనిఁ దెలుపుచుఁ బలికెన్. 36
గీ. నలినసంభవ! శ్రీరంగనామకలిత, మీవిమానంబు ప్రణవంబు నూవె యిందుఁ
బ్రణవవాచ్యార్థ మిందిరారమణుఁ డున్న; వాఁడు నినుఁ బ్రీతుఁ జేయంగవచ్చె నిట్లు.
క. నలుదెసలఁ జాఁగి మ్రొక్కుచు, నలుమాఱు ప్రదక్షిణము లొనర్చి చిరతపః
ఫల మగు శ్రీరంగేశ్వరు, జలజజ! సేవింపు మోక్షసాత్మ్యతి గలుగున్. 38
వ. అని యాదేశింపం బ్రమోదంబు నలుమడింపఁ జతుర్ముఖుండును జతుర్ముఖప్రణామసలక్షణంబు లగుచతుఃప్రదక్షిణంబులు నాచరించి శ్రీరంగదివ్యవిమానగర్భంబున. 39
సీ. దక్షిణహస్తోపధానవిధానుఁ డై, వలప్రక్కగా నొత్తగిలినవాని
నాజానుదీర్ఘత్వ మఖిలవేద్యంబు గా, నెడమబాహువు సాఁగ నిడినవాని

నాకుంచితోత్కుంచితాగ్రజానుకము లై, యుండ నంఘ్రులు సాఁచి యున్నవాని
నాకస్మికస్మితవ్యాకోచలోచన, యుగకోణములఁ గృప యొలుకువాని
గీ. జలధినిశ్శేషభూషణశ్రమహిమాచ, లాగ్రవిశ్రాంతనవమేఘ మనఁగ శేష
శయనశయుఁ డైనకోమలశ్యామలాంగు, రంగపతిఁ గాంచె భారతీరమణుఁ డపుడు.

క. ఘనతరహర్షాంబుధిలో, మునిఁగిమునిఁగి తేలుచందమున భక్తిఁ బునః
పునరానతుఁ డైచతురా, ననముల నుతియింప రంగనాయకుఁ డనియెన్. 41

గీ. పద్మసద్మ! భవత్తపఃఫలమ నగుచు, నవతరించితి నిట్లు నీ స్తవమువలనఁ
దుష్టహృదయుండ నైతి నభీష్ట మెద్ది, వేఁడుకొనుమన్న భారతీవిభుఁడు పొంగి. 42

క. అవలోకనార్హ మగునీ, యవతారంబునను నాకు ననుదినము బ్ర
త్యవసరపూజావిషయత, నివసింపు గృహార్చ నగుచు నిత్యము ననుడున్. 43

సీ. ఎలన వ్వేలర్ప నీతలఁ బెఱింగియు దివ్య, భవనంబుతోడ ని ట్లవతరించి
నాఁడ నిం కిటమీఁద నవతరింపఁగఁ బూను, నర్చాకృతుల కెల్ల నాద్య మిదియ
యర్థింపుమీ స్వయంవ్యక్తవిగ్రహ నన్ను, గృహదైవతంబ కా నహరహంబు
పాంచరాత్రవిధానపరుఁడ వై ద్విపరార్థ, కాలాంతమున ముక్తిఁ గాంతు వనిన
గీ. ధాత చరితార్థుఁ డై రంగధాము నాత్మ, భువనమునయందు విరజాఖ్యఁ బొలుచునేటి
తీరభూమిఁ బ్రతిష్ఠించి దినదినంబు, యుక్తవిధిఁ బూజ సేయుచు నుండునంత. 44

క. ధరపై నిక్ష్వాకునరే, శ్వరుఁ డనఁగా వైష్ణవాగ్రసరుఁ డఖిలశ్రీ
విరతమతి మోక్షసాధన, పరుఁ డై చింతించు నాత్మభావములోనన్. 45

గీ. తండ్రి వైవస్వతుండు మాతాత రవియు, ఘనులు గావున బ్రహ్మలోకమున కేగి
యచట రంగేశుఁ గొలిచి మోక్షార్హు లైరి, మందసుకృతికి నా కంత మహిమ గలదె.

క. నాదుతపంబునఁ గలిగెం, గాదే? యని రంగపతి నొకండయ విధికిం
గా దనుభవింప 'నేక, స్స్వాదు న భుంజీత' యనెడుసామెత వినఁడే! 47

మ. అపవర్గప్రద మైనరంగము మహాయాసంబుచేఁ గాంచియుం
గృప తే కేరికిఁ గానియాత్మ పురి నిక్షేపించుకొన్నాఁ డహో!
కపటాత్ముండు విధాత నే నఖిలలోకప్రాప్తుఁ డైమర్త్యవి
ష్టపసంస్థుండుగ రంగవల్లభుఁ దపస్సంప్రీతునిం జేసెదన్. 48

క. అని నిష్ఠురనిష్ఠఁ దపం, బొనరింప నజుం డెఱింగి యులుకున దీనా
ననుఁ డై తనసన్నిధి నది, వినుపించినఁ జూచి రంగవిభుఁ డి ట్లనియెన్. 49

సీ. కల దిల కేగుసంకల్పంబు మా కిందుఁ, బరితపింపక వినుపద్మగర్భ!
సాకేతనగరి నైక్ష్వాకులచే మహా, యుగచతుష్కము పూజ నొంది పిదపఁ



గా వేరిఁ జంద్రపుష్కరిణీతటంబున, సప్తమన్వంతరస్థాయి నగుదుఁ
దావకవాసరాంతమునఁ గ్రమ్మఱ వచ్చి, పొందుదు నీచేతఁ బూజ లిచట
గీ. నహరహంబును నిట్లు గతాగతములఁ, జేసి రెండుపరార్థముల్ చెల్లినపుడు
నీకు నపవర్గ మేఁ గరుణించి పోదు, ధామమును నేను నాపరవ్యోమమునకు. 50

ఉ. నీకుఁ ద్రికాలపూజనము నిచ్చలు దప్పక చొప్పడు న్మహీ
లోకజనంబున న్మదవలోకనగోచర మై కృతార్థతన్
గైకొనుఁ గాన మాతలఁపు గా దన కిప్పుడ యిమ్ము నన్ను ని
క్ష్వాకున కన్న నొం డనఁగ వారిజగర్భుఁడు నోడి ప్రీతుఁ డై. 51

వ. హంసవాహనారూఢుం డై యింద్రాదిబృందారకవర్గంబునుం దానును దుందుభీరవము
లు గ్రందుకొన గరుడస్యందనబంధురం బైన శ్రీరంగదివ్యవిమానంబు భూలోకంబున
కుం గొనివచ్చి యిక్ష్వాకుమహీనాథున కర్పించినం గృతార్థుం డై యమ్మహాభుజుండును
నిజతపఃఫలంబును జగజ్జనభాగధేయంబు నగునమ్మహాదివ్యభవనంబు మకుటాలంకారంబు
గా మస్తకాగ్రంబున వహించి మహోత్సవోత్సేకం బై పౌరలోకం బెదురుకొన
నయోధ్యాపట్టణోత్తరదిశ నర్ధక్రోశంబునఁ దమసాసరయూమధ్య మనోహరప్రదే
శంబున నయోధ్యాముఖంబుగా నుక్తవిధిం బ్రతిష్ఠించి కాంచనమణిమయగోపురప్రసా
దమండపాదినిర్మాణంబుల గ్రామగజతురంగదాసదాసీరథఛత్రచామరాద్యుచితోపకరణస
మర్పణంబుల నిత్యనైమిత్తికాదిమహోత్సవాచరణంబుల యావజ్జీవంబు నసాధారణం
బుగా భగవదారాధనం బొనరించెఁ దదనంతరంబునఁ దద్వంశసంభవు లగుకకుత్స్థ
రఘుదిలీపప్రముఖమహీపాలకోత్తములు నుత్తమోత్తమభావంబుల రంగధామసమర్చ
నంబు గావింపం గ్రమంబున మహాయుగచతుష్టయంబు చనం బంచమత్రేతాయుగ
కాలంబున. 52

సీ. దశరథధారుణీధవుఁడు పుత్రార్థి యై, యశ్వమేధము సేయునవసరమున
నిలఁగలనృపలోక మెల్ల నేతెంచుట, నందులోఁ జోళదేశాధిభర్త
ధర్మవర్మాఖ్యుఁ డాదశరథైశ్వర్యంబు, రంగధామార్చనక్రమముఁ జూచి
యిక్ష్వాకుకులమున కిహపరైశ్వర్యంబు, లెపుడు రంగేశునికృపనె కాదె!
గీ. ధాతసంగతి నిక్ష్వాకురీతిఁ గాంతుఁ, దపముచే నేను శ్రీరంగధామ మనుచుఁ
దలఁచి యజ్ఞాంతమున ధరాధవుల యట్ల, పూజితుండయి యాత్మీయపురికి నరిగి. 53

గీ. చంద్రపుష్కరిణీతీరసంస్థుఁ డగుచుఁ, దపమునకుఁ బూన నచ్చటితపసు లతని
తపము వారించి శ్రీరంగధామ మిటకుఁ, దాన చనుదెంచు వినుము తత్కారణమును.

క. ఇటకును దద్దిశ నేత, త్తటినీతటియందుఁ గలదు దాల్భ్యాశ్రమ మ
చ్చట ము న్నిష్టకథాలం, పటమతి దాల్భ్యుండు మేము భాషింపంగన్. 55

గీ. ప్రాంతనీపవనీస్థితవ్యాఘ్రదనుజుఁ, గూర్చి భగవంతుఁ డనుచులు గొలువ నచటి
కరుగుదేరఁ బ్రణామార్చనాభినుతులఁ, బ్రీతుఁ గావించి వరము గోరితిమి నేము. 56

గీ. అహరహంబు నిచట నర్చనాదులచేత, నిను భజింపవలయు నిత్యసన్ని
ధాన మిచట మాకు దయ సేయు మనిన ద, యార్ద్రుఁ డగుచు నిట్టు లానతిచ్చె. 57

మ. హరిదశ్వాన్వయమందు దాశరథినై యస్మత్పదాంభోజత
త్పరుఁ డై యుండువిభీషణాఖ్యునకు మద్ధామంబు శ్రీరంగమే
కరుణాధీనత నీ నతండు గొని రాఁ గావేరిలోఁ జంద్రపు
ష్కరిణీతీరమునందుఁ గైకొనియెదం గల్పావధిస్థైర్యమున్. 58

గీ. రంగదివ్యవిమానగర్భమున శేష, శయనశయు నన్ భజింపుఁడు సంతతంబు
నని యెఱింగించి చన నేము నసురమథనుఁ, గొలిచి యేగితి మర్కమండలముదనుక. 59

క. చని క్రమ్మఱియెడునపుడుఁ గనుఁ,గొని మీకులకంద మైనకోకనదాప్తుం
డనియె మునులార! యుందఱు, వినుఁ డే నెఱిఁగింతుఁ బూర్వవృత్తాంతంబున్. 60

సీ. బ్రహ్మలోకమున శ్రీరంగేశు నే నుపా,సించి వేఁడితిని నాచేతియట్ల
మద్వంశభవు లైనమనుజనాయకులచే, నర్చితుండుగ విభుఁ డట్ల యియ్యఁ
గొని వచ్చి యిక్ష్వాకుకులులచే నిన్నా ళ్ల,యోధ్యయందు సపర్య నొందె నింక
నస్మత్కులీనుల యని ధర్మవర్మాదు, లగుచోళనృపులచే నర్చితుఁడుగఁ

గీ బోవుఁ గావేరిలోఁ జంద్రపుష్కరిణికిఁ, గానఁ జనునది మోక్షార్థు లైనజనము
లచట శ్రీరంగపతిఁ గొల్వ ననిన వచ్చి, నాఁటనుండియు నేము నున్నార మిచట.61

చ. దశరథరాముఁ డై పొడమె దైత్యవిభేదియు రంగధామముం
దశవదనానుజుం డటకుఁ దథ్యము కాఁ గొని వచ్చి వచ్చినన్
భృశముగ నీకు మేము వినుపించినదాఁకఁ దపంబుచే వృథా
కృశుఁడవు గాక నెమ్మది సుఖింపు మహీపరిపాలకుండ వై. 62

వ. అని యాదేశించినం బ్రహృష్టహృదయుండై ధర్మవర్మయుం గ్రమ్మఱి తదుపాంతకా
వేరీదక్షిణతీరస్థితం బైననిచుళానామనిజపురంబునకుం జని రంగధామసమాగమప్రతీ
క్షాపరుం డై రాజ్యంబు సేయుచుండఁ గొండొకకాలంబున. 63

ఉ. రావణుఁ గూల్చి వచ్చి రఘురాముఁడు దా హయమేధదీక్షితుం
డై వసుధేశులం బిలువ నంపినఁ దాను నయోధ్య కేగి చో
ళావనిభర్త రాజసభయందు విభీషణుఁ గాంచి సమ్మదం
బానహిల న్మఖాంతమున నర్చితుఁ డై చనుదెంచెఁ గ్రమ్మఱన్. 64

క. వచ్చి విభీషణుఁ డిదిగో, తెచ్చున్ శ్రీరంగధామదివ్యవిమానం
బిచ్చటి కనునిశ్చయమున, హెచ్చినహర్షమునఁ గృతసమీహితబుద్ధిన్. 65



వ. రాక్షసేశ్వరుం డైనవిభీషణు నాతిథ్యంబున నఖిలలోకేశ్వరుం డైన శ్రీరంగపతిసమర్చ
నంబునకుం దగినట్లుగా నుచితవివిధప్రశస్తవస్తూపకరణసామగ్రీసంపత్సంపాతనంబు
చేసికొని విభీషణాగమనంబునకు నెదురెదురు చూచుచుండు నంత. 66

సీ. అట నయోధ్యాపురియందు శ్రీరఘురాముఁ, డాత్మోపకర్తయు నతిహితుండు
నగువిభీషణు లంక కనుపునప్పు డనుగ్ర,హాతిరేకమున నిజాన్వయైక
జీవధనం బైనశ్రీరంగధామంబు, సపరిచ్ఛదంబును సపరిజనము
గా నొసంగుటయు నాదానవాధిపుఁడు కృ,తార్థుఁ డై ధరణి సాష్టాంగ మెఱఁగి

తే. మస్తకంబున ధరియించి మంత్రివరులఁ, దా నభోవీథి లంకకు దక్షిణాభి
ముఖముగాఁ గడు ముదమున మోచి తెచ్చు, వేళ నడుమన మధ్యాహ్నకాల మైన. 67

గీ. తత్సమయపూజనము సేయఁ దలఁపు వొడమి, మహికి డిగ్గి మరుద్వృతామధ్యమహిత
చంద్రపుష్కరిణీసరస్తటమునందు, దనుజపతి నిల్పె శ్రీరంగధామ మప్పుడు. • 68

మ. కని యచ్చో మును లద్భుతప్రమదమగ్నస్వాంతు లై చోళభూ
జనభర్తన్ వినుపింప వచ్చి సలిపెన్ సంప్రీతి నాతిథ్యమున్
దనుజేంద్రుండును రంగధామునకు నుక్తప్రక్రియం జేసె న
మ్మనుజాధీశకృతోపచారములచే మధ్యాహ్నకాలార్చనల్. 69

గీ. తాను మునులును శ్రీరంగధాముఁ గాంచి, చిరమనోరథసిద్ధికిఁ జిత్త మలరఁ
జోళభూభర్త యొకకొంతకాల మిచట, దనుజవర! నిల్వు మని వేఁడుకొన నతండు.

ఉ. నైకటికంబు ఫాల్గునమున న్నరనాయక! రంగభర్తకి
క్ష్వాకుకృతోత్సవం బగుటఁ జయ్యన లంకకుఁ బోవు టొప్పు నా
నీ కిది లంక గాదె శుభనిష్ఠఁ దదుత్సవలక్ష్మి నిచ్చటం
జేకొని రంగభర్తఁ గృప సేయు కృతార్థత మాకు నీదయన్. 71

క. అని వేఁడి యమ్మహాత్ముని, యనుమతిఁ గొనిహృష్టహృదయుఁ డైచిరకాలో
పనతనిజయత్నఫలముగ, నొనరించెం దన్మహోత్సవోపక్రియలన్. 72

సీ. నవ్యనైకసమగ్రదివ్యభోగములచే, రాగమగ్నుం డయ్యె రంగభర్త
సవినయపరవస్తుసత్కారములచేతఁ, బ్రీతాత్ముఁ డయ్యె విభీషణుండు
అర్ఘ్యపాద్య ప్రభృత్యర్హార్పణములచేఁ, బ్రముదితం బయ్యెఁ దపస్వికులము
మృష్టాన్నవస్త్రాద్యభీష్టదానములచే, సంతుష్టిఁ బొందిరి సకలజనులు

తే. నవభృథము సేయ జగము కృతార్థమయ్యెఁ, బూతమతి ఫాల్గునంబునం బుబ్బతొడఁగి
ధర్మవర్మాఖ్యుఁ డగుచోళధరణిధవుఁడు, తగ నొనర్చునవాహ్నికోత్సవమునపుడు. 73

క. ఈగతిఁ బ్రతిదిననవనవ, భోగమునఁ బదేనునాళ్లు వోవఁ బ్రయాణో
ద్యోగమున నృపుని నిలిపి మ, నోగతిఁ బోలుచు విభీషణుఁడు గృతనతియై. 74

తే. ఎత్తఁజూచిన శ్రీరంగ మెగసిరాక, యచలమునుబోలె నిశ్చలం బైన నతఁడు
బాష్పనిష్పీడితాక్షుఁ డై పరితపింప, సదయహృదయుండు శ్రీరంగశాయి పలికె. 75

క. లేలెమ్ము వత్స! యీగతి, నేల పరితపింప మాకు నిచ్చట విడువం
జాలమికిఁ గలదు కారణ, జాలము వినుపింతు వినుము సర్వము దెలియన్. 76

మ. పరితః ప్రాంతపరీతసహ్యతనయాబాలానిలాసేవ్యముల్
పరిమాణప్రథమానపూగకుహళీప్రాదుర్భవామోదముల్
సరసాభ్రంకషనారికేళనిబిడచ్ఛాయంబు లీచంద్రపు
ష్కరిణీపుణ్యసమీపదేశములు శక్యంబే విసర్జింపఁగన్. 77

సీ. సరిలేదు చంద్రపుష్కరిణీసమీపంబు,నకు నెందు నని మెచ్చినాఁడఁ గాన
నవ్వయభవులచే నర్చితుండుగ సూర్య,నకు శపథం బిచ్చినాఁడఁ గాన
మునులు వీరికి నిత్యముగ సేవఁ గృపసేయుఁ, నాడ నైవర మిచ్చినాఁడఁ గాన
ననపాయు లగుమహీజనులకు మోక్ష మీ,నామదిఁ గరుణించినాఁడఁ గాన

ఆ. నిచటు విడిచి నాకు నెచటికి నేగరా, దిదియె కాదు వేఱె హేతు వొకటి
గలుగు నీకవేరకన్యాప్రవాహమ, ధ్యంబు విడువరామి కదియు వినుము. 78

వ. మున్ను విశ్వావసునామధేయుం డైన గంధర్వవరుం డనంతపద్మనాభదేవుం బ్రబోధితుం జేయుటకు దక్షిణసముద్రతీరంబునకుం జనుచు నడుమ వింధ్యపాదప్రశస్త లగుసమస్త నదులం గనుంగొని యందఱికి నేకనమస్కారంబు గావించుచుం గడచి చన నమ్మహాత్ముం డొనరించిన నమస్కారంబు తనక తనక యని యహంకరించుట నమ్మహానదుల కందఱకుం దమలో వివాదంబు పుట్టి జరుగుచుండం గొండొకకాలంబున. 79

గీ. తిరిగి యతఁడు నాటితెరువు గానఁగ వచ్చి, తొంటియట్ల మ్రొక్కె నొంటిమ్రొక్కు
మ్రొక్క నీవు మ్రొక్కు మ్రొక్కిందు నెవ్వరి, కనుచు నెల్లనదులు నడుగుటయును.

క. వినుఁ డెల్లనదులు మీలో, ఘన మగునది నాదుమ్రొక్కు గైకొనునది పొం
డని చనుటయుఁ దమలో గుణ, ఘనతకు నై తొంటికంటెఁ గలహం బయ్యెన్. 81

గీ. పోరిపోరి పరిశ్రాంతిఁ బొంది గర్వ, మెడలి క్రమమున శాంతు లై రెల్లనదులు
నత్యహంకృతి జహ్నుకన్యకుఁ గవేర, కన్యకును బోక చిరకాలకలహ మయ్యె. 82

క. ఇరువురును జతుర్ముఖుసభ, కరుగ నతఁడు గంగ యధిక మనుటయు దుఃఖా
తుర లై కవేరకన్యక, సరసిజభవుఁ గూర్చి తపము సలుపఁగ నరుఁడున్. 83

క. గంగానది భగవత్పద, సంగతి గల దగుట నొసఁగఁ జన దధికతఁ ద
ద్గంగాసామ్య మొసంగితి, గంగాసమ వనఁగ వేరకన్యయు నలుకన్. 84

చ. నలువఁ దొఱంగి ఘోరముగ నన్ను గుఱించి తపం బొనర్పఁగా
వల దని గంగకంటె గుణవత్త్వసుసిద్ధికిఁ దావకోదర



స్థలమున రంగధామసహితంబు వసించెద నంటిఁ గావునన్
నిలిచెద నీకవేరసుతనిర్ఝరమధ్యమునన్ విభీషణా! 85

క. కావున గతశోకుఁడ వై, నీ విప్పుడు లంక కరిగి నెమ్మది రాజ్య
శ్రీవిభవ మనుభవింపుము, నావుడుఁ గడుదైన్యమునఁ బునఃప్రణతుం డై. 86

గీ. పుండరీకాక్ష! యిచట నీ వుండు దేని, లంక యేటికి? సామ్రాజ్యలక్ష్మి యేల?
నాకు సర్వంబు నీపాదనలినయుగమె, యుండఁ గలవాఁడ నేను నీయొద్దఁ గొలిచి. 87

శా. కల్పాంతావధికంబు నాకు మును లంకారాజ్య మాయుష్యముం
గల్పించె న్రఘుభర్త మోక్షపద మాకాంక్షింప శేషాహిరా
ట్తల్పా న్నిన్నిటు లిచ్చినాఁడు కృపతోడ న్వేదశాఖాశిఖా
కల్పత్వత్పదపల్లవంబులకు నేఁ గాఁజాల దూరస్థుఁడన్. 88

సీ. అనవుడు వత్స! యి ట్లగు నైన నాయాజ్ఞ, సేయంగవలయుటఁ జింత యుడిగి
లంకాధిరాజ్యపాలకుఁడ వై యుండుము, వలువ దినావసానముల నెల్ల
జనుదెమ్ము ననుఁ గూడి సత్యలోకమునకు, రెండుపరార్థముల్ నిండినపుడు
కొనిపోదు నాతోన నిను నిత్యపదమున, కట్లొట లంక కీ వరుగు మిచట

తే. నుండునట్లుగ నినుఁ జూచుచుండువాఁడ, నెపుడు లంకాభిముఖుఁడ నై యీవు నరులు
గూడి యిచ్చోట నుండుట గూడ దనిన, దనుజకులనాయకుండు నొం డనఁగ నోడి.

వ. ప్రదక్షిణపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామం బాచరించి శ్రీరంగవల్లభుపదారవిందంబులు నిజశిరోభాగంబున దృఢంబుగాఁ జేర్చుకొని బాష్పధారాళలోచనంబుల నంతంత మరలిమరలి సేవించుచు నెట్టకేనియు విభీషణుండు మంత్రిసమేతుం డై లంకకుం జనియె ననంతరంబ ధర్మవర్మాదిచోళరాజపరంపరాపూజితుం డై యనాలోచితవిశేషాశేషజగజ్జనంబులకు మోక్షసత్రప్రదానం బొనరించుచు నుభయకావేరీమధ్యంబునఁ జంద్రపుష్కరిణీతీరంబున శ్రీరంగనామధేయదివ్యగృహస్థుం డై యుండుటం జేసి.

సీ. అపవర్గకాంక్షచే నాఁకొన్నవానికిఁ, దంగేటిజున్ను శ్రీరంగశాయి
నిర్వాణదారిద్ర్యనిర్విణ్ణుఁ డగువాని, ముంగిటిశేవధి రంగశాయి
సంసారమలవిమోచనము నాకాంక్షించు, పంగువుపై గంగ రంగశాయి
పరమార్థలాభతత్పరుఁ డైనవానికి, ముంగొంగుపసిఁడి శ్రీరంగశాయి

తే. బెదర కాఁకటియమృతంబుఁ బిదికికొనఁగ, శృంగములు లేనిమొదవు శ్రీరంగశాయి
కోరువారలకోర్కు లీఁగోరివచ్చు, జంగమామరతరువు శ్రీరంగశాయి. 91

## ⟶ షష్ఠ్యంతములు. ⟵

క. ఈదృశగుణనిధికి మహా, హ్లాదసుఖాకారసంవిదమృతాంబుధికిన్
వేదాంతనేతినేతిస, మాదిష్టనిషేధవిషయితాత్మానధికిన్. 92

క. ఖ్యాతతరచంద్రపుష్కరి, ణీతటగృహమేధికాత్మనిరతేక్ష్వాకు
వ్రాతకులదైవతమునకు, ధాతృశతాహరహరార్చితపదాబ్జునకున్. 93

క. పంగూపరిపరినిపత, ద్గంగాసమమాదృశాక్షిగతగోచరభా
వాంగీకర్తకుఁ జోళ, ప్రాంగణపరిదృశ్యమానబహుసేవధికిన్. 94

క. ద్వివిధోభయదిక్ప్రవహ, త్కావేరకన్యాతటోపగతపూగవనీ
నవకుహాళీపరిమళవహ, పవనోపాస్యునకు వికచపద్మాస్యునకున్. 95

క. శారదచంద్రాతపవి, స్తారాస్తరణాభిరామతల్పితయమునా
చారుతరపులినసాక్షికి, జారగ్రామణికి ధూర్తజనతామణికిన్. 96

క. ఆసమసమసమరసమయ, ప్రసభమదప్రసృతివిస్మరదురసురసమి
త్యసువిసరగ్రసనరసో, ల్లసదసిరసనాలభుజచలద్భుజగునకున్. 97

క. భాషాధిపశేషాదిమ, నీషాపదగోచరగుణనిస్సామ్యునకున్
దోషాచరయోషాజన, భూషామోషాచరణనిపుణశౌర్యునకున్. 98

క. హేయప్రతిభటున కసం, ఖ్యేయప్రథమానగుణమహిష్ఠునకు ముని
ధ్యేయస్వరూపి కనుసం, ధేయప్రియదివ్యనామధేయాఢ్యునకున్. 99

క. కారుణ్యఖనికి నజహ, త్తారుణ్యనవాభిరూపతాప్రకటితశృం
గారరసాధీశ్వరునకు, శ్రీరంగేశ్వరున కర్థిచింతామణికిన్. 100




# ప్రథమాశ్వాసము.

## కథాప్రారంభము.

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనినమాంధాతృచరిత్రం బనుకావ్యకథాకల్పవల్లికి
ఆలవాలం బైనపురవరం బెట్టిదనిన.

## సాకేతపురవర్ణనము.

సీ. జాతరోపమనోజ్ఞజాతరూపం బైన, కోటచే వలయాద్రి నోటువఱచి
మధుసుధారసపూరమధురనీరం బైన, పరిఖచే వారాశి భంగపఱచి
నవరత్నచిత్రాభినవయత్నకము లైన, యిండ్లచేఁ గనకాద్రి యేపు గఱచి
కాంతనిర్మలచంద్రకాంతబద్ధము లైన, కుట్టిమంబుల ధాత్రిఁ గొంచపఱచి
గీ. కమలగర్భుండు దనసృష్టి గానిభువన, కోశగర్వంబు నణఁగింపఁ గోరి దీని
వేడ్కఁ నిర్మించె ననఁ బొల్చు వినుతహృదయ, ఘట్టనం బైనసాకేతపట్టణంబు. 2

క. పట్టణరమ బిరుదునకై, పట్టినపగలింటిదివియబాగునఁ గోటం
జుట్టును దన్మణిగణరుచి, ఘట్టితతేజుం డయి తిరుగు ఖరకరుఁ డెపుడున్. 3

క. పరిఘాకమఠము పైఁ దన, భరియించినధరణి నిలిపి ప్రాక్కమఠము త
చ్చిరవహనశ్రమహతికా, పరిఘాజలఖేలనంబు పలుమఱు సలుపున్. 4

గీ. అతిసమున్నతకనకహర్మ్యములతుదలఁ, జెలువమొలికెడుసాలభంజికలు వొలుచుఁ
బురవిశేషవిలోకనాద్భుతముకతనఁ, జేష్ట లెడలినఖేచరస్త్రీలఁ వోలె. 5

ఉ. కన్నులపండువై పొలుచుఁ గన్గొన నప్పురలక్ష్మి సారెకు
న్విన్ననువొప్ప విచ్చునెఱివేణి తెఱంగున మందమారుతో
ద్యన్నిజకేతనాంచలకరాగ్రములం బ్రవిసారితంబు లై
యున్నతసౌధశైలశిఖరోపరిలంబితమేఘలేఖికల్. 6

శా. ఏణీలోచన లాత్మవక్త్రరుచిచే నేణాంకసౌభాగ్య మ
క్షీణప్రౌఢి హరింప సౌధపరిసంకీర్ణేంద్రనీలోపల

శ్రేణీనిర్మలకుట్టిమంబులపయిన్ శీతాంశుఁడున్ జేర నై
ప్రాణాచారము వడ్డయట్లు ప్రతిబింబవ్యాప్తి చూడం దగున్.

చ. అహరహముం బ్రభాతముల హర్మ్యతలోపరిచంద్రశాలికా
గృహములఁ గామినీసురతకేలివిసూత్రితహారమౌక్తిక
గ్రహణపరాయణంబు లగుఁ గావునఁ దన్మతిభ్రాంతతారకా
గ్రహములఁ జంచులం గమిచి క్రాయుఁ బురిం జిలుకప్రోదిపావ్రముల్. 8

## ద్విజాదివర్ణనము.

క. క్రతుభుజులను గృహపాచకు, లతిగూఢ బ్రహ్మనిధికి నాజనికులు భా
రతికిం జేరోలగములు, ప్రతిలే కలరుదురు పురము బ్రాహ్మణవర్యుల్. 9

శా. పౌనఃపుణ్యముచేతఁ గాని రిపులన్ భంజింప లేఁ డయ్యె భూ
దానం బొక్కటి గాని షోడశమహాదానంబులుం జేయ లేఁ
డేనీతిన్ జమదగ్నిరాముఁడు సముం డిద్ధప్రసిద్ధోన్నమ
ద్దానక్షాత్రగుణంబులం బురవరాంతఃక్షత్రియశ్రేణికిన్. 10

ఉ. లేకి నిధివ్రజంబు లవలేశము కాంచనభూధరంబు ర
త్నాకరరత్నరాసు లడిగంట్ల మరున్మణికామధుక్సురా
నోకహముల్ క్రయోచితవినూతనవస్తువు లిట్టి వట్టి వ
స్వాముల కందరానిపురవైశ్యులసంపద లెన్ని చూపుచోన్. 11

క. ప్రతివర్షంబును ధర ను, ద్ధతిఁ బడియెడు పిడుగు లెల్లఁ దగఁ గూర్చి నరా
కృతులుగ నొనఁగూర్చె నొకో, శతధృతి యన వీట సుభటసంఘము వొలుచున్. 12

సీ. అవలీలమై నెట్టియవనీరుహము లైనఁ, బెఱుకుట యెలదూండ్లు వెఱికినట్ల
కొమ్ములతుదఁ గ్రొచ్చి కులశైలతటు లైనఁ, గూల్చుట నదిదరుల్ గూల్చినట్ల
యున్మత్తవృత్తిమై నుదధిసప్తక మైనఁ, గలఁచుట మడుగులు గలఁచునట్ల
బలిమి నెంతటి యనిఁ బరసైన్యతతుల మ, ట్టాడుట తుంగలో నాడునట్ల

గీ. కాఁ జరించుచుఁ దమయందుఁ గలుగురౌద్ర, రసము లుత్కటమై వెలి నెసఁగుమాడ్కిఁ
గోపనుదభార లనిశంబు గురియుచుండ, వఱలుఁ బురివారణము లనివారణములు. 13

సీ. కట్టడిఁ జెలియలికట్టయె కట్టగా, బిగువుమైఁ బేరెంబు వెట్టకుండ
లంఘనలాఘవోల్లసనంబుమై మొక్క, లించి వార్ధులు చౌకళింప కుండ
బిట్టుదిగంతముల్ ముట్టఁ జూపినవిధి, పవమానుగడ తెగఁ బాఱ కుండ
భరతాభినయముల నిరపేక్షగా లోక, దృష్టులు దనియ నర్తింపకుండ

గీ. రయముచేఁ జిత్తగతుల గెల్చియును బతుల, మతులలోనన వర్తింప మాకు వలసె
ననుచు సిగ్గునఁ దలవంచుకొనినవిటులొ, యనఁగఁ దగి యొప్పుఁ బురి నుత్తమాశ్వతతులు.



క. క్షితిసుర్త లొనర్పుసతత, క్రతువుల నాహుతులు గొనుచుఁ గాఁపున్న సుర
వ్రతతులవిమానములయా, కృతులం బొలుపారు వీటఁ గ్రీడాగృహముల్. 15

క. వేడుకఁ బతులుం దాము న, గ్రీడాగేహములు చొచ్చి కెలనం దెలిరా
గోడలఁ గనుపట్టెడుతమ, నీడలు సవతు లని మానినీజన మలుగున్. 16

శా. దర్పం బేర్పడ ముగ్ధలం బతులు నూత్నక్రీడకుం దార్చి కం
దర్పం డార్వఁగ నీవిబంధనములం దప్పింప నవ్వేటిలో
నర్పించుం బునరంశుకస్థితిఁ ద్రపాహైన్యం బభావంబుగాఁ
గర్పూరాగరుధూపధూమపటలీగాఢాకృతిప్రక్రియల్. 17

శా కేలీగేహసరోమరాళమిథునక్రేంకారముం గన్యకా
డోలాకాంచనకింకిణీఘనరవాటోపంబు నృత్యన్నటీ
హేలానూపురశింజితంబుఁ బురి నింపేపారఁగా లోఁగొనుం
గాలోద్యత్పురపాయమానగణికాకాంచీకలక్వాణముల్. 18

ఆ. ఉచితసమయ మగుటయును రత్నగర్భప్ర, సూతి నొందియున్న చొప్పు మెఱయ
వివిధమణిసమృద్ధి వీక్షింపఁగా నొప్పు, నప్పురంబులోన నాపణములు. 19

## వేశ్యావర్ణనము.

సీ. గమనంబులేచాలుఁ గన్నులు దనియింప, నృత్తంబు లేలకో నేర్చి రిట్లు
పలుకులే చాలు వీనులకుఁ బండువు సేయ, నెఱపాట లేలొకో నేర్చి రిట్లు
సౌందర్యములె చాలు సమ్మోహనమునకు, నేపథ్య మేలకో నేర్చి రిట్లు
తారుణ్యములె చాలుఁ దలఁపులు గరఁగింప, నెఱతనం బేలకో నేర్చి రిట్లు

ఆ. లిది ప్రియాతిరేక మిది గదా నఖముఖ, సాధ్యమునకుఁ బరశుసంగ్రహంబు
వీరు గలుగ మరుఁడు విజయగాఁ డెట్లన, వఱలుదురు పురంబువారసతులు. 20

## పుష్పలావికావర్ణనము.

సీ. కరముల కందిచ్చువిరులబంతులకంటె, వెడఁదోఁచుచన్నులు వేడ్కఁ బెనుప
మవ్వంపుగొననెత్తుపువ్వుటెత్తులకంటెఁ, గరమూలరుచిమాడ్కిఁ గమిచి తిగువఁ
గోరిన నొసఁగెడుకొసరుపువ్వులకంటె, మొలకనవ్వులు డెందములు గరంప
నిండారుసరములనెత్తావిగమికంటె, సుముఖసౌరభములు సొక్కఁ బెనుప

ఆ. జట్టికాండ్రఁ దమదుసరససుందరవిలా, సములచేతఁ దార జట్టిగొనుచుఁ
బురమువీథులకును భూషణప్రాయ మై, క్రాలుఁ బుష్పలావికాజనంబు. 21

## పౌరవిలాసినీవర్ణనము.

గీ. అంగరాగంబు దమవెలయాట నంత, రంగరాగంబు నొసఁగెడునప్పురంబు
గట్టివాలుపడంతులు కంతుచేతి, గట్టివాలున కొప్పింతు రెట్టివారి. 22

మ. అజహచ్చంద్రవిజృంభముల్ శుకపికాధ్యాయాఢనానావిధ
ద్విజమృష్టాన్నయథేష్టసత్త్రగృహముల్ దీవ్యన్మదోత్సేకభా
వజసర్వస్వము లంచితానిలనిజస్వారాజ్యము ల్దంపతీ
వ్రజతారుణ్యసమృద్ధిసాక్షులు పురప్రాంతస్థితారామముల్. 23

చ. అలికులకుంతలంబులు రథాంగకుచంబులు పద్మవక్త్రముల్
గలరవపద్మినుల్ గడువికాసముతోఁ దమయందు సక్తమై
యలర విహారవేళఁ దము నంటినకాంతలమేనికస్తురిన్
జులకన సోఁడుముట్టు సరసుల్సరసుల్వలె నొప్పు నప్పురిన్. 24

## గంధవహవర్ణనము.

సీ. ప్రణయవాదములు దంపతులందు నుదయించి, రంజిల్లు మానాంకురములు మేసి
సురతాంతవిశ్రాంతసుందరీజనముల, వక్షోజతటఘర్మవారిఁ గ్రోలి
వనములు మధుగర్భవతులు గాఁ బూమొగ్గ, మొదవులకౌమారములు హరించి
విషయానుభవకథావిముఖవిరక్తుల, పటుతరధైర్యవప్రములు గూల్చి

గీ. గంధలోభానుబంధిపుష్పంధయముల, ఝుంకృతులచే ఘణిల్లన నంకెలిడుచు
విషమశరుపేర జన్నియవిడిచిరనఁగఁ, గ్రొవ్వి చరియించు నవ్వీటఁ గోడెగాడ్పు. 25

## సాకేతాధీశ యువనాశ్వవర్ణనము.

మ. ఇట్టివిలాసలక్ష్మి దనకీడును జోడును లేనియమ్మహా
పట్టణ మేలు నుద్ధతసపత్ననృపాలకఫాలపట్టికా
పట్టనవాతతస్ఫురితపాదసరోరుహుఁ డప్పదిక్తటీ
హట్టచరత్ప్రతాపహరిదశ్వుఁ డనా యువనాశ్వుఁ డున్నతిన్. 26

సీ. తనభూభరణదక్షతను మెచ్చి ఫణిరాజు, చులుకన యగువేయుఁదలలు నూఁపఁ
దనఖడ్గపుత్త్రి శాత్రవుల నచ్చరలను, జిన్నిబొమ్మలపెండ్లిఁ జేసి యాడఁ
దనమూర్తి సుందరతాగర్వవతులైన, సతులమానసములఁ బ్రతిఫలింపఁ
దనకీర్తివల్లికాతతుల కాశాధిప, కుంభిదంతములు వేఁగొనలు గాఁగఁ

గీ. బ్రస్తుతికి నెక్కె సతతధారాళనైజ, దానచిరవాసనావాసితప్రపంచ
రంజనైకమహారాజకుంజరంబు, విశ్వభూభర్తయై యువనాశ్వవిభుఁడు. 27

## యువనాశ్వునకు మునిశాపము గల్గుట.

శా. ఆరాజోత్తముఁ డొక్కనాఁడు మృగయావ్యాసక్తిఁ గాంతారకాం
తారంబుల్ వెసఁ జొచ్చి వాహముఖఫేనంబుల్ వనీదేవతా
హారప్రాప్తి ఘటింపఁగా జనియె మధ్యాహ్నాతపక్లిష్టసే
నారాహిత్యముఁ బొంది దప్పిఁబడి ఖిన్నస్వాంతుఁడై యొక్కఁడున్. 28



గీ. పోయి పెద్దదూరమున నొకమునియాశ్ర, మంబు చేరి చొచ్చి మౌని నచటఁ
దడవి కానలేక తత్పర్ణశాలికా, భ్యంతరంబు దఱిసి యరసె నందు. 29

క. కందుకముఁ బోని తెల్లని, యండం బొక్కటి మృదుచ్ఛదాచ్ఛాదితమై
యుండఁగ నద్భుతరసము, ప్పొం దగుచుం గదిసి పుచ్చుకొని ముద మొదవన్. 30

శా. ఔరా! యిట్టివిచిత్రమేఖగజమో యండం బిదిమ్మౌనియే
లారక్షించునొ మూల డాఁచి యని లీలాకందుకక్రీడమై
నారాజన్యుఁడు చేతఁ బట్టికొని రా నయ్యండ మయ్యాశ్రమ
ద్వారప్రాంతమునం బ్రమాదమున హస్తప్రస్తమై భూస్థలిన్. 31

గీ. పడినయంతఁ బెక్కుపఱియలై నెఱవుగాఁ, గలల మచట పఱదగట్టుట యును
దలఁకి మౌనిరాకఁ దలపోసి మునుమును, చనియె మునియు వచ్చి చాల నడలి. 32

మ. తనపాణేశ్వరి తొల్లి యంచల వినోదవ్యాప్తి సాకాంక్షుఁ జూ
చినయాకోర్కె నెఱింగి యయ్యతివతోఁ జిత్రప్రభావంబు పొం
దన హంసాకృతులై రమించుటయు సద్యోగర్భజంబైన దాఁ
పినవాఁ డొటఁ దదండభంగమునకుం జింతాతిసంతప్తుఁడై. 33

గీ. చింత దేఱి యిట్లు చేసినయతులపా, పాత్ముకుండు గర్భ మవసిచచ్చుఁ
గాక యని శపించె భూకాంతుఁ డిట ధాత్రి, నేలుచుండఁ గొంతకాలమునకు. 34

## యువనాశ్వుఁడు పుత్త్రులు లేమిఁ బరితపించుట.

గీ. భువనభరిత మగుచుఁ బొదలువిభాతవి, స్ఫురణ నడఁచుమంచువోలె మ్రింగె
విభునిమనసులోని విశ్వభూచక్రాధి, పత్యసమ్మదము నపత్యకాంక్ష. 35

సీ. నందనుఁ జూడ నానందించుమాడ్కల, కెవ్వియుఁ జూడంగ నేవ మయ్యెఁ
దనయానులాపంబు వినఁ గోరువీనుల, కెవ్వియు నాలింప నేవ మయ్యె
సుతుమౌళి మూర్కొనఁ జూచుఘ్రాణంబున, కెవ్వియుఁ బసిగొన నేవ మయ్యెఁ
గొడుకుతియ్యనిపేరు నుడువఁ గోరెడుజిహ్వ, కెవ్వియుఁ జవిగొన నేవ మయ్యెఁ

గీ. బట్టి కౌఁగిటఁ జేర్పంగఁ బరఁగుమేని, కితర మెవ్వియుసోకంగ నేవ మయ్యె
విశ్వభూమీశుఁ డగుయువనాశ్వపతికి, సుతుఁడు వెలియైన బ్రదుకేమి సొంపు దలఁప.

క. సంతతిలేమికి నాభూ, కాంతుం డెంతయును వంత గడలుకొనంగా
సంతతదురంతచింతా, క్రాంతస్వాంతం బొకింత గళవళపడఁగన్. 37

శా. ఏలా యేలితి విశ్వభూవలయ మిట్లేకాతపత్త్రంబుగా?
నేలా తోలితి గర్వితారినృపులన్ హేమాచలం బెక్కఁగా?
నేలా వ్రాలితి యాచకావనకథాహేవాకసంపత్తి? నిం
కేలా బిడ్డలు లేనియీబ్రదుక? గొడ్డేటయ్యెఁ జింతింపఁగన్, 38

సీ. జలక మార్చినఁ జిన్నిశయ్యలో నొయ్యొయ్యఁ, గాలు చేయార్పంగఁ గనుట లేద
కెంగేల లేబొజ్జగిలిగింత లిడి నవ్వు, నెలమోముఁ దమ్మి ముద్దిడుట లేద
తియ్యఁదేనియ లొల్కుతీవనవ్వులతోడి, తొక్కుపల్కులు విని చొక్క లేద
వడఁకుతోఁ జిఱుతప్పటడుగుల నేతేరఁ, జేచాఁచి యక్కునఁ జేర్పలేద
గీ. పుత్త్రకులు లేనిసిరి యేల భోగ మేల, బాలకులు లేనితా నేల బ్రదుక నేల
యాత్మజులు లేనిశయ మేల హర్ష మేల, యిహముఁ బర మెద్ది సంతానహీనులకును.

ఉ. ముంగిట నాడుపుత్త్రుఁ డతిమోదమునం దను దౌలఁ గాంచి వే
డ్కం గరయుగ్మ మెత్తి చిఱుగంతులతో వెడయేడ్పుతోడ డా
యంగఁ జెలంగి యెత్తికొని యక్కునఁ జిక్కఁగఁ జేర్చి ముద్దుమో
ముం గమియార ముద్దిడుట ముజ్జగ మేలుట గాకయుండునే. 40

వ. అదియునుంగాక. 41

ఉ. నారకయాతనాంబుధికి నావ నిబద్ధకవాటగోపుర
ద్వారమునందుఁ గుంచిక భవక్షితిజంబునకున్ ఫలంబు వి
స్ఫారనిజార్థగుప్తి కనపాయనిధిస్థలి వంశవర్ధనాం
కూరము పుత్త్రునిం బడయఁ గోరుట యొప్పదె యెట్టివారికిన్? 42

## యువనాశ్వుఁ డింద్రయాగము సేయుట.

సీ. అని చాలఁ జింతించి యాకోర్కి యాత్మీయ, కులగురుం డగుమానికులగరిష్ఠు
నకు వసిష్ఠునకు విన్నపము సేయుటయు న, య్యుగ్రాంశుకులు నతఁ డూరడించి
తగిననానావిధద్రవ్యముల్ దెప్పించి, హోతల రప్పించి యుక్తవిధుల
శతమఖప్రీతిగా నతులితక్రియ నొక్క, యింద్రయాగంబు సేయించుటయును
గీ. దూర్ణమున నధ్వరక్రియ పూర్ణ మైన, మహిత మగువేదమంత్రాభిమంత్రితాక్ష
తములు చల్లినకలశోదకములు దెచ్చి, భూతలాధీశునకుఁ జూపి హోత లపుడు. 43

క. ఆలింపుమీ జలంబులు, గ్రోలినప్రాణికి నృపాలకులమౌళిమణీ!
వేలావలయితధరణిం, బాలింపం గలుగుసార్వభౌముఁడు పుట్టున్. 44

గీ. అని యెఱిఁగించి దాపించి రవి మహీశ, వరుఁడు నారాత్రి యెల్ల జాగరము చేసి
మౌనివాక్యం బమోఘంబు గానఁ దెలివి, దప్పి డప్పికి నానీరు ద్రాగుటయును. 45

## మాంధాతృజననము.

ఉ. గర్భము నిల్చి కుక్షి యధికంబుగఁ గానఁగ వచ్చి గ్రక్కునన్
దుర్భరతీవ్రవేదనల దూలుచు సోలుచు నేల వ్రాలఁగా
నర్భకుఁ డొక్కఁ డయ్యినకులాగ్రణిగర్భ మగల్చికొంచు నా
విర్భవ మొందె భూజనులు విస్మయమగ్నులు గాఁగ నయ్యెడన్. 46



శా. విస్రస్తాకులవేణిబంధములతో విభ్రష్టసంవాస లై
ఘుస్రాంతంబున వాడుతమ్ములగతిం గై వ్రాలి వక్త్రప్రభా
విస్రంభంబు లడంగ నవ్విభుసతుల్ వే వచ్చి నేత్రాంబుజా
తాస్రాఘాతపయోధరద్వయతటీవ్యాలిప్తకాశ్మీర లై. 47

క. రోదనముతో వసిష్ఠుని, పాదంబులమీఁద వ్రాలి పతిభిక్షము దం
డ్రీ! దయసేయుము నావుడు, నాదర మొప్పంగ మునికులాగ్రణి యాత్మన్. 48

ఉ. ఇంచుక చింతఁ జేసి నృపుఁ డీదశ నేమిట నొందె? నేమి సే
యించిన నేమి పుట్టె? నగు నే? యిఁక నిన్నియు నేల? యేను జే
యించినయిష్టియం దహహ! యీయవకార్యము పుట్టు టెట్లురా?
యంచు నహంకరించి తనయాత్మ గుఱించి తలంచె నింద్రునిన్. 49

శా. ఆకర్షించినదేవభర్తయు జగం బాశ్చర్యహర్షంబు లు
ద్రేకింపం దనుఁ జూడ నాత్మగుణగాత్రప్రౌఢగంధర్వయో
షాకంఠధ్వనితాళవృంతరచనాచాతుర్యహేవాకన
న్నాకశ్రీమణికంకణోల్లసదమందక్రేంకృతుల్ ప్రోవఁగన్. 50

గీ. వచ్చి నపుడ భక్తి నచ్చటివా రెల్ల, నవనియందుఁ జాఁగి యవనతులుగ
నర్హమణిమయాసనాసీనుఁ డై మౌని, తన్నుఁ దలఁచినట్టితలఁపుఁ దెలిసి. 51

ఉ. నన్నుగుఱించి మీరు సవనం బొనరించితి రిందుఁ గల్మషం
బెన్న నొకందునుం గలుగ దివ్విభుఁ డివ్విధి నీల్గునట్లుగా
మున్నొకమౌని దిట్టుటయు మోసము నేఁ డిటఁ గల్గె నైన నే
నిన్నృపుప్రాణము ల్మరల నిచ్చితి నిమ్మునినాథునానతిన్. 52

మ. అని లోకంబుల కెల్ల నద్భుతముగా నాభూవిభుం బ్రాణయు
క్తుని గా దీవన లిచ్చి తా నిజకరాంగుష్ఠంబు తద్బాలవ
క్త్రనివిష్టంబుగఁ జేయ వాఁడును సుధాప్రస్యందముం గ్రోలె నా
తని మాంధాతృసమాఖ్యుఁ జేసి హరి యంతర్ధానముం బొందినన్. 53

గీ. జాతవేదుండు వీజనశక్తిఁ బోలె, నుష్ణకరుఁడు తపర్తుసంయుక్తిఁ బోలె
నక్కుమారుండు జాతకర్మానుషక్తి, సమధికాశ్చర్యధుర్యతేజమునఁ బొలిచె. 54

సీ. కను దెప్ప లిడ నెఱుంగనిచూడ్కిఁ జూచుచు, జిగిపీఁపు దోఁప బోరగిలఁ బడుచుఁ
గరజానువులఁ జతుశ్చరణుఁ డై తిరుగుచు, శిశునిదర్శితదృఢస్నేహుఁ డగుచు
భాసురమితపదన్యాసంబు చూపుచు, హ్రాదవిహారమున దుర్వారుఁ డగుచు
జనకజానందబీజత్వంబు గైకొంచు, గుణములమసలి నాఁ బ్రణుతిఁ గనుచు
గీ. వసననిరపేక్షు నిచ్ఛాప్రవర్తి యగుచు, హయసమారోహణంబు సేయంగఁ గలిగి
రాసుతుఁడు దనశైశవక్రమదశావ, తారములచేతఁ బూరుషోత్తమతఁ దెలిపె. 55

### మాంధాతృఁడు సకలవిద్యల నేర్చుట.

క. కాలోపనీతుఁ డై భూ, పాలతనూభవుఁడు గురునిపాలం బ్రచుర
వ్యాలోలకాకపక్షు, శ్రీలక్షితుఁ డగుచు నభ్యసించెన్ విద్యల్. 56

క. మందానిలుచే నలరుల, కందువఁ గని తావు లెల్లఁ గైకొనునళిమా
ర్గిం దగుగురువశమున నృప, నందనుమతి శాస్త్రవాసనలఁ దూఁకొనియెన్. 57

సీ. తూఁటిబాల్యంబు వోఁ ద్రోచి ప్రాయంబు వె,ట్టినకవాటంబుఁ బాటించె నురము
జయరమాలంబనశాఖ లై బాహువు, లాజానుదైర్ఘ్యంబు నధిగమించె
వదనచంద్రునిఁ జొచ్చి బ్రదికెడుచీఁకట్ల, గతి నవశ్మశ్రురేఖలు జనించె
నర్థిదైన్యములపై నడరుకెంపునుబోలె, నీక్షణాంచలముల నెఱ్ఱ వోఁచె
గీ. సుందరత్వమునకుఁ జోటిచ్చి తాసంకు, చించె నణఁగఁ గడుఁ గృశించె నడుము
జనవరాత్మజునకు సకలలోకోత్సవా, పాది యైనయౌవనోదయమున. 58

### యువనాశ్వుఁడు మాంధాతకుఁ బట్టముఁ గట్టుట.

క. యువనాశ్వుఁ డంతనాత్మజు, యువభావంబునకు హర్ష మొదవఁగ నొకనాఁ
డు వసిష్ఠానుమతిన్ వై, భవమున నభిషిక్తుఁ జేసి పట్టముఁ గట్టెన్. 59

క. శుభవేళ యుక్తవిధిమై, విభుఁ డగురాకొమరుతోడ విశ్వంభర దా
నభిషిక్త యగుచు సాత్విక, విభవమునఁ జెమర్చియున్నవిధమునఁ బోలెన్. 60

సీ. శంఖకాహళవేణుఝల్లరీపణవాది, వాదిత్రనాదంబు లాదరించి
నృపగణోపాయనాన్వితసింధుఘోటక, ఘీంకారహేషలఁ గేలి సేలి
చామరగ్రాహిణీశయకుశేశయమణి, కంకణక్రేంకృతి గారవించి
జయజీవముఖబహుస్వస్తిప్రశస్తివి, ప్రాశీర్నినాదంబు ననుమతించి
గీ. విభుతమైఁ జేర్చి యువనాశ్వవిభునికూర్మి, పట్టి పట్టాభిషేకవైభవమునందుఁ
బ్రణమదుత్పతదవనిభృన్మణికిరీట, కోటికోటీవిభూషణాకులరవంబు. 61

ఉ. పాయు తొలంగు మోసరిలు పా పద మంచు మహారవంబుగా
నాయతవేత్రహస్తు లఖిలావనిపాలకులన్ బరాబరుల్
సేయఁగఁ బొల్చె ఫాలగతచిత్రవినిర్మలభర్మపట్టికా
శ్రీయుతుఁ డై కుమారకుఁడు సింహగణాంకితభద్రపీఠికన్. 62

గీ. మణిమయం బైనయారాజమౌళిమౌళి, చిత్రరుచి నొప్పె ధవళాతపత్ర మపుడు
హాటకాచలశృంగశృంగాటకాగ్ర, విభ్రమచ్ఛుభ్రశరదభ్రవిభ్రమమున. 63

మ. అమరీవిభ్రమరీతిలోలనయనాహస్తాబ్జదోధూయమా
నమణీదండకచామరాగ్రపవమానస్యందనాందోళన



క్రమశోభన్ నృపకుంతలప్రకర ముత్కర్షావహ మయ్యెం దదీ
యమృదుస్పర్శసుఖోన్నతిన్ బరవశం బై తూఁగుచందంబునన్. 64

### ఆశ్వాసాంతము.

శా. సర్గస్థేమలయాదికారణ మహాసంకల్పపంకేజభూ
భర్గాశాపతిశాసనేశనకళాపారీణ సర్వాసుభృ
ద్వర్గవ్యాకృతనామరూపబహిరంతర్వ్యాపకాదుర్గతీ
స్వర్గస్వానుభవాపవర్గఫలదస్వాతంత్ర్యసర్వంకషా. 65

క. వినిహతనతాఖిలార్తీ, యనఘనియంతృత్వచిదచిదంతర్వర్తీ
యనవధికమధురకీర్తీ, మునిజనచేతశ్శరవ్యమోహనమూర్తీ. 66

పంచచామరము. మరుత్ప్రరోహతూలతల్పమధ్యసంస్థలీశయా
ధరారమాకరోపలాలితప్రసారితాంఘ్రికా
మరుద్వృధాకవానుబంధమంధరోత్సవానక
స్ఫురద్విరావనర్తితాపభూవనీశిఖావళా. 67

గద్య. ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహసేవకోపసేవక నరసింహనామధేయ
ప్రణీతం బైనకవికర్ణరసాయనం బనుకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

*




# ద్వితీయాశ్వాసము.



రంగదివ్యగృహాశ్రం
గారోజ్జ్వలదీప శిశిరకరపుష్కరిణీ
తీరఫలనమ్రకల్పను
హీరుహ కరుణాతరంగితేక్షణసుముఖా.

క. ఈవిధమున నిజనందను, భూవల్లభుఁ జేసి వృద్ధభూపతి విషయ
వ్యావృత్తచిత్తుఁ డగుటన్, దా వనమున కేగఁ దలఁచి తనకులసరణిన్. 2

## యువనాశ్వుఁడు మాంధాతకు రాజనీతిఁ దెల్పుట.

గీ. తల పెఱుంగఁ జెప్పి తనయుని నొకవెంట, నియ్యకొలిపి పిదప నేకతమున
నొయ్య డాయఁ బిలిచి యొకకొంతనయమార్గ, మెఱుకపఱుపఁ దలఁచి హితమతోక్తి.

## అంగపంచకనిరూపణము.

గీ. మనుజపతి కుపాయమును సహాయంబును, వినుము దేశకాలవిభజనంబు
నాపదకుఁ బ్రతిక్రియయుఁ గార్యసిద్ధియు, నంగపంచకము సమస్తవిధులు. 4

## ఉపాయస్వరూపనిరూపణము.

వ. మహాభూతపంచకపరిణామవిశేషంబుల సకలప్రపంచంబు నగుచందంబున నేతదంగపంచకవివిధభేదసంగ్రహంబుల సమస్తనీతిధర్మమర్మంబులు నగుటం దత్ప్రకారంబులకుం బ్రదర్శనార్థంబు గాఁ గొన్ని వివరింతుఁ బ్రథమపరిగణితాంగం బైన యుపాయంబులు సామదానభేదదండంబులు తద్విభేదంబు లనేకప్రకారంబు లై యుండు నవి యన్నియు నేకవిషయంబు లై గురులఘుత్వాది హేతుభేదంబున ననుకల్పరూపంబులు గావు ప్రత్యేకంబ నియతభిన్నవిషయంబు లగుట నేకైకస్వతంత్రోపాయంబులు గావున నన్నియును వర్జనీయంబు లగుటం దత్తద్గుణోత్కర్షం బాలింపుము. 5

గీ. ధన్యతయుఁ బూర్ణతయుఁ గొల్చుదానమునకుఁ, బ్రోదియును రక్షయును జేయుభేదమునకు
దండియును బన్నియును దెచ్చు దండమునకు, సామమున కేయుపాయంబుసమముగాదు.



క. హితు లగుదు రహితవర్గము, హితమతిఁ బోప్రాణ మైన నీఁ జూచు హితా
హితతతిగతరూపజగ, త్త్రితయమువశ్యౌషధములు ప్రియభాషణముల్. 7

క. కా కేమి తన్నుఁ దిట్టెనె?, కోకిల తన కేమి ధనము కోకొమ్మనెనే?
లోకము పగ యగుఁ బరుసని, వాకునఁ జుట్ట మగు మధురవాక్యమువలనన్. 8

గీ ఉన్నసాధనగతుల సాధ్యుండు గాక, మిగ్గఁ బఱతెంచుశత్రువు మిత్రుఁ జేయు
దానమున నాత్మవశగులు గానివార, లితరు లెవ్వార లీజగత్త్రితయమునను. 9

క. శత్రుల మిత్రులఁ జేయున్, మిత్రుల భృత్యులుగఁ జేయు నిజగుణవృత్తిం
బాత్రులుగఁ జేయు నందఱ, ధాత్రీపతి కన్నియెడల దానము తగదే? 10

క. ఆయాసదుర్లభముల న, నాయాసమునన ఘటించు ననభిస్పృష్టో
పాయంబు పతికి భేదో, పాయము గడు నిష్ట మగునుపాయముగాదే? 11

క. అరుల విదళింపఁ గానే, నరపతి తేజస్వి యగుట నడురేయియిరు
ల్విరియించునపుడు దీప, స్ఫురణము దగుఁ గాక పగలు చొప్పడి యున్నే? 12

క. దండసమర్థుఁడు పతి గా, కుండిన సేవకులు నులుక రుగ్రారికుభృ
న్మండల ములుకునె? కావున, దండసమర్థుండు గాఁగఁ దగుభూపతికిన్. 13

క. పౌరుషము గలుగఁగానే, సారము లగుభేదదానసామములు సమి
ద్భీరువున కవి ఫలింపఁగ, నేరవు షండునకు నింతి నేపథ్యంబుల్. 14

## సహాయస్వరూపనిరూపణము.

వ. ఇవి ప్రధానప్రకారంబులు. మఱియు నుపేక్షాదులు నగుప్రకారాంతరంబులు నెఱుంగునది. యిది యుపాయస్వరూపనిరూపణం బయ్యె. నింక సహాయస్వరూపంబు విను. మఱియు రాష్ట్రదుర్గధనాదిసంపద్రూపంబున మంత్రిసామంతసుహృద్బలదూతచారప్రభృతిపురుషసంపత్తిరూపంబున బహుప్రకారం బై యుండునవి. యిన్నియు నవశ్యంబు లగుటకుం బ్రత్యేకగుణంబు లాకర్ణింపుము. 15

గీ. అరులవలనఁ గాచుకరణి మేసుతెవుళ్ల, వలనఁ గాచుకొనఁగవలయు నట్ల
యరులవలనఁ గాచుకరణిని నైజాధి, కారిజనులవలనఁ గావవలయు. 16

క. ప్రోదిఁగొనఁదగినపుష్పఫ, లాదులు గొడ్డంట వచ్చి యవనిజము నెడన్
వాదుగొనునట్ల భూప్రజ, బాధించిన నేల కలుగు పతి కరిగోరుల్? 17

క. మన సిచ్చినఁ దన కోడరు, చను విచ్చినఁ బ్రజలు వెక్కసము సేయుదు రా
ట నృపతి మన సీకయు కడుఁ, జను వీకయు మెలసవలయు సమ్ముఖచరులన్. 18

క. మించి ధనమాసఁ బ్రజ నెఱి, యించుదురాత్ములను గ్రేణి యిచ్చుట పతి కూ
హించిన నిండినచెఱు వవి, యించి శకులకులము సంగ్రహించుట గాదే? 19

క. హరి జలధి నాశ్రయించెను, హరునంతటివాఁడు నద్రి నధివసియించెన్
నరపతిమాత్రున కరిజన, దురధిగమం బైనయట్టిదుర్గము వలదే? 20

క. ధనహీనుఁడు నిరుపాయుఁడు, ధనదాసులు గాక పురుషదాసులు గలరే?
ధనము సకలైకమూలము, ధనసంగ్రహ మెడలినతఁడు దా రా జగునే? 21

క. ధనము చన దోష మగు దే?, యొనరించినయట్టివిధము లుర్వీపతికిన్
విను పాత్రుల కీకుండుట, యు నపాత్రులయందు నిడుటయును నీరెండున్. 22

క. కర్త యగుకతన మతిఁ గల, కర్తృత్వముదంబువలనఁ గార్యాతురతన్
గర్తవ్య మెఱుఁగఁ దగుటఁ బ్రవర్తకుఁ డగుమంత్రి పతి కనశ్యము వలయున్. 23

క. విపదురుపంకంబునఁ బడి, నపు డిభశత మై వెడల్చునతఁ డున్మదుఁ డై
నపు డంకుశ మై మఱలుచు, నృపకుంజరమునకు మంత్రి నిర్వాహిత గదా! 24

క. కెలనికి భ్రేఁకము దనకున్, వలఁతియుఁ గా దండనాథవర్గముఁ బెనుపన్
వలయుఁ బతియూఱటకు నై, బలిమికిఁ దేఁకువకుఁ దోడుపాటొదవునకున్. 25

గీ. ఎంతబలియురకుఁ దనంతగా సామంత, గణముఁ బెనుప కేల కలుగు జయము?
శేషునంతవాఁడు శిరములు వెయి పూని, కాక మహి వహింపఁ గలిగె నెట్లు! 26

క. పతికి ననుకూలసేనా, పతు లనఁగా నెంద అన్నిపటుతరభుజము
ల్పతికిఁ బ్రతికూలసేనా, పతు లనఁగా నెంద అన్నిపార్శ్వోరగముల్. 27

క. బలియుఁ డగుమిత్రుసంగతి, గలరా జభ్యుదయ మొందు గౌరవయుతుఁ డై
బలియుఁ డగుమిత్రుసంగతి, గలరా జభ్యుదయ మొందఁ గనఁబడుఁ గాదే! 28

క. చేరువపగ దీర్చుటకై, దూరపుఁదో డాసపడుట దుర్మతియింటం
గూరిచి చ్చార్చుటకై, ధారుణిఁ గూపంబు ద్రవ్వఁ దలఁచుట గాదే! 29

గీ. కిరణములు లేనిపగలింటిసరణిఁ దరణి, వెలుఁగ నేర్చునె యుదయాస్తవేళలందుఁ?
గాన విను ముగ్రతేజుల కైన మూల, బలము లేకున్నఁ గడుఁ బెంపుఁ బడయరాదు. 30

క. ఎప్పుడు దనకుం బగ గల, దప్పుడ సైన్యము ఘటింతు ననఁ బతి కగునే?
యెప్పుడు దగుసైన్యములే, దప్పుడ పో పగయుఁ గలుగు నవనీపతికిన్. 31

క. నిజముఖపవనము శంఖ, ప్రజనిత మై మధ్యమందరం బగుమాడ్కిన్
నిజవాక్యము దూతముఖ, ప్రజనిత మై యతిశయంబు పతికిం దెచ్చున్. 32

క. తనయున్నచోటనుండియుఁ, గనుఁగొనఁ దగు జగము దేశకాలవిరోధం
బునఁ జారయు కుండుచారుం, డను నేత్రముచేత నృపతి యఖిలజ్ఞతకున్. 33



## దేశకాలవిభాగస్వరూపము.

వ. ఇంక దేశకాలవిభాగస్వరూపంబు విను మఖిలకృత్యంబులుం దదుభయాధీనసిద్ధికరంబు
లగుటం దత్ప్రకారంబులచే ననంతంబు లై యుండు నైనం గొన్ని నిర్దేశించెద. 34

క. ఏవేళ నెచటఁ బండెడి, దేవి త్తది యెఱిఁగి కాదె యిడఁ గాఁ దగు? న
ట్లేవేళ నెచట నెట్టిఫ,లావహ మది యెఱిఁగి చేయనగు భూపతికిన్. 35

క. అరివెట్టిన లాఘవ మగు, నెరసున భేదంపుఁజేఁత నేరమిఁ దెచ్చున్
విరసించినఁ గ్రొవ్వగుటన్, సరి యగువానియెడ నెల్ల సామంబ తగున్. 36

గీ. ఏలు నిలుపఁ గే లొగ్గుట యిచ్చకంబు, మత్తకరిఁ గెగలించుట మాయచేఁత
కొండ నిదిరించి తగరు ఢీకొనుట కడిమి, కాన నధికుని యెడ మేలు దాన మండ్రు.

క. ప్రియ మెఱుఁగలేఁడు దాన, క్రియఁ గ్రొవ్వును మఱి క్రియాతిరేకం బగుటన్
బయి నెత్తఁ దగదు మత్తుం, డయినపగఱ భేదవిధికి నర్హుం డెందున్. 38

గీ. సామదానములకుఁ జన వేది భేదంబు, సేఁత దలఁపఁ బందసేఁత యని న
కాన తా బలాఢ్యుఁ డైన విక్రమశాలి, హీనశత్రుమీఁద నెత్తవలయు. 39

వ. అట్టితుర్యకార్యంబునను నిశ్చితవిజయం బగుటం జేసి యాత్మీయబలంబు నిచ్చి కేవలాం
గీకరణంబున మార్గ్యాభిముఖుండు గాక తత్తద్దేశకాలానుకూలంబుగాఁ బూర్వోపాయ
త్రయానుప్రాణితం బగుప్రాధాన్యంబు నెఱపవలయుభంగులు నెఱుంగునది. 40

క. అగపడునంతకు బలియుఁడు, పగఱకుఁ బ్రియ మాడు నొక్కపట్టునఁ దనపే
రుగ నమ్మి జంతు వగు దే?, బిగువునఁ బెనుఁబాము కూఁతపెట్టెడుమాడ్కిన్. 41

క. గాలపుటెరయిచ్చి కదా!, వాలుగులం దిగిచికొనుట వక్రరిపుఁడు దా
నే లోఁబడునంతకు బల, శాలియు దానంబు చూపఁ జను నొక్కయెడన్. 42

క. చొరవ దన కీని యెదురుల, నొరయించి దహించుగాడ్పునోజం బోది యై
పెరిగెడురిపులకు నంత, ర్విరసము గలిగించు వెరవు వెదకఁగవలయున్. 43

క. పేరెత్తి రిపులతో విరి, వో టగుసదుపాయ మొకటి పుట్టింపఁ దగుం
బో టొడ్డి యైనఁ దాఁ గను, చాటునఁ బండంగి వేఁటసలిపెడురీతిన్. 44

క. అరి నొకని బొడమినప్పుడ, బరువున నడరంగఁ జేయ బహు జిచ్చుగతిన్
దరుణం బురంబువోలెన్, బరువం బగుతినకు నోర్వఁ బడు వేఱొకనిన్. 45

క. సులభమునఁ దీర్చుపనికై, బలు వగుయత్నంబు సేయఁ బతిఁ జూచినయే
ములు ముంట దివియు కడిదము, జళిపించినయట్టిబేలచందము వచ్చున్. 46

క. చేయింపవలయుపనిఁ దాఁ, జేయుట కర్జంబు గాదు శీఘ్రము తానై
చేయంగవలయుకార్యము, సేయం బనుపుటయుఁ గాదు సిద్ధము పతికిన్. 47

క. స్థానబలంబున నధికుని, హీనుఁడు మెప్పించు బయిల నేగుక్రొలకుఁ
లోనగుమొసలి యుదగ్రత, నేనుఁగుఁ బడఁ దిగుచుఁగాదె యిరవున నున్నన్. 48

క ఊహ చెడి తేఁచఁబడెడు మ, హాహితుకోపాగ్ని పిదప నార్పుటకొఱకై
స్నేహము నెఱపఁగఁ జూచుట, మోహం బభివృద్ధిఁ బొందు మునుపటికంటెన్. 49

క. అధముఁ డని రిపుఁడు లోనగు, విధ మెఱుఁగక యెత్తి పిదప వెడఁదిరిగినయే
నధమత మానిచి వానికి, నధికత నొసఁగంగఁ బోవు టంద్రు నయజ్ఞుల్. 50

వ. ఇంక విపత్తిప్రకారంబును గార్యసిద్ధియు ననిష్టనివృత్తినిరూపణంబును నిష్టప్రాప్తిరూపంబును బరస్పరసాకాంక్షంబులై ప్రాప్యంబు లగుటంజేసి రాజులకు నీరెండును
ద్వివిధం బైనకార్యఫలం బిది యెఱుంగునది. 51

క. సకలానిష్టంబును బా, యక యిష్టప్రాప్తివలన నయ్యెడుసుఖ మే?
మొకచే ననలము దరికొన, నొకచేఁ జందనముఁ బూయ నూఱటఁ గను నే. 52

క. కావున నాత్మాభ్యుదయ, శ్రీవిభవ మరిక్షయంబుఁ జేసుఱు నయబా
హావిక్రమముల నఖిలధ, రావల్లభుఁ డైనయతఁడు రాజనఁ బరఁగున్. 53

శా. సర్వక్షోణితలంబు నేకధవళచ్ఛత్రంబు గా సంతతా
ఖర్వశ్రీఁ దిలకింపఁ నేలుము భుజాగర్వాతిరేకోన్నతిన్
బూర్వాస్తాచలమధ్యదేశనివసద్భూపాలమాళిస్ఫుర
ద్గీర్వాణాధిపరత్నరుఙ్మధుకరోద్దీప్యత్పదాబ్జుండ వై. 54

## యువనాశ్వుఁడు మునియై వనమున కేగుట.

క. అని దీవించి నిజాత్మజు, వినయవినమ్రతకు నలరి వీడ్కొని చనియెన్
మునివేషంబునఁ బావన, వనవాసంబునకు లోకవర్ణితయశుఁ డై. 55

## మాంధాత ధర్మిష్ఠుఁ డై భూమి నేలుట.

మ. జనకుం డేగినయట్టిపిమ్మట మహాసామ్రాజ్యభారంబు గై
కొని మాంధాతృమహీవరుండు గరచెన్ ఘోరప్రతాపాగ్నులన్
వనజాతప్రభవాండభాండపరిపూర్ణం బైనదృప్యన్నరేం
ద్రనిజస్ఫీతయశఃప్రపంచనవనీతంబు ల్గడు న్వ్రేల్మిడిన్. 56

సీ. వక్రభావ మధిజ్యవరధన్వమునఁ గాని, తన నెమ్మనంబునఁ దగులనీక
నిశితస్వభావంబు నిజఖడ్గమునఁ గాని, తనవర్తనంబులం దగులనీక



విశదభావము కీర్తివిలసనంబునఁ గాని, తనమంతనంబునఁ దగులనీక
దీర్ఘభావము శత్రుదీనత్వమునఁ గాని, తనదుకోపంబునఁ దగులనీక
గీ. యంబుధులు కేళికుల్యలు కులాచలములు, మేడలలచక్రగిరిమట్టుగోడ గాఁగ
నవనిఁ బాలించె శుద్ధాంతభవన మట్లు, కీర్తిలక్ష్మీకళత్రుఁ డాక్షితివరుండు. 57

సీ. సర్వసర్వంసహాజనము నర్థార్థిగా, కర్థి నర్థించుసమర్థ మయ్యెఁ
బాతాళమున నుండుఫణికచ్ఛపాదులు, భార మేమియు లేని బ్రదుకుఁ గనిరి
ఖచరలోకంబునఁ గ్రతుభుగ్జనంబులు, తృప్తిమైఁ గఱ్ఱునఁ ద్రేఁపఁ గనిరి
త్రిజగతి సంతతాతిథి యైనకలహాళి, నయనంబు లాకఁటిభయము నుఱచె
గీ. దానగుణశాలిభూసముద్ధరణదక్షుఁ, డనిశమఖదీక్షితుండు మత్తారిహరణ
విపృతినిరతుండుయువనాశ్వవిభుసుతుండు, ఘనుఁడుమాంధాతనృపుఁ డైనకాలమునను.

## శరత్కాలవర్ణనము.

శా. ఆలోకోత్సవ మయ్యె నంత గజగండావిర్భవద్దానకీ
లాలం బంబుజినీతటీవరమరాళం బుల్లసత్తాంభస్సరి
త్కూలం బుత్పలగంధదుర్లలితవాతూలం బుదీర్ణేందుర
శ్మ్యాలం బంగభవానుకూలము శరత్కాలంబు రమ్యాకృతిన్. 59

సీ. జగతీస్థలము పట్టుచాలమి పరికించి, చాలించుమీల వర్షములు వెలిచెఁ
గైకొన్న నీ రెల్లఁ గ్రక్కించి రవి నాఁక, విడుచుమీల మొయిళ్లు విరియఁ బాఱెఁ
బ్రావృడ్జననితోడఁ బాసినబిడ్డ లై, పెంపేది నదుల శోషింపఁ జొచ్చె
రాజులు దండయాత్రలఁ ద్రొక్కెడుభీతి, నిలఁ జొచ్చె నన రొంపు లివురఁ బాఱె
గి. జలము కలక దేఱె సస్యము ల్పక్వంబు, లగుచు నచ్చెఁ దెల్ల నయ్యె దెసలు
తెల్లఁ బూఁచె నంచ లెల్లెడఁ గొలఁకుల, నుల్లసిల్లె శారదోదయమున. 60

సీ. అంబుదంబులఁ గల్గునాసారవర్షంబు, కరిమదంబులయందుఁ గ్రాలుకొనియెఁ
గేకికేకలఁ గల్గుకాకలీభావంబు, కలమగోపికలవాగ్గతులఁ జేరెఁ
గేతకీతతిఁ గల్గుకృతవికాసస్ఫూర్తి, కుందవాటికలపైఁ గుదురుకొనియె
సురచాపమునఁ గల్గుపరభాగసంపత్తి, చేలకేగెడుశుకశ్రేణిఁ జెందె
గి బకకులంబులగతి విజృంభణమదంబు, మధురకలహంసకులముల నధివసించె
నఖిలలోకప్రసాదావహముగ వాన, కాల మరుగంగ నవశరత్కాల మైన. 61

చ. శరదుదయంబున న్విగతసంకులపంకములౌట మార్గము
ల్గరగర నైన నైన వెసగాఁ జననేరక యుండి రల్లెడన్
దెరువరు లాత్మదృష్టి కతిథత్వము గొల్పెడుపంటచేలపా
వడగతులం బథం బడుగు మాటికిమాటికి మాటలాడ్పుచున్. 62

శా. పారావారజలంబు లీకొడిదేడుం బ్రాపించి యే యిద్భుచో
ధారాగర్జలః చూపు నంబుధరబృందం బంచుఁ గాంతిచ్ఛల
స్మేరుం డై కనుపట్టు యామ్యదిశఁ గుంభీపుత్త్రుఁ డాపోశన
స్వైరక్రీడనభూషితోజ్ఝితచతుర్వారాశియుం డంతటన్. 63

ఉ. కైరవబంధుబింబము ముఖప్రతిబింబము తద్గతస్మితాం
కూరము శీతలాతపము కుండలసూచితమౌక్తికావళుల్
తారలు గా శరత్సమయలక్ష్మి గనుంగొనురత్నదర్పణా
కారమున న్నభస్స్థలము గన్నులపండువఁ జేసె రాత్రులన్. 64

## మాంధాత దిగ్విజయయాత్ర సేయు

క. ధాత్రీశుఁ డంత దిగ్జయ, యాత్రాసంరంభజృంభితాటోపహతిన్
శాత్రవులగుండె లగలఁగ, జైత్రప్రస్థానభేరిఁ జఱపించుటయున్. 65

శా. భూకంపంబు జనింప రొంపిగ మహాంభోరాసు లుప్పొంగఁగా
లోకాలోకము పెల్లగిల్లఁగ మరుల్లోకంబు ఘూర్ణిల్ల న
స్తోకవ్యాప్తి నజాండభాండదళనోద్భూతధ్వనిం బోలి యు
ద్రేకించెన్ విజయప్రయాణహతభేరీభూరిభాంకారముల్. 66

సీ. సజలధారాధరసముదయోదయశోభఁ, గార్కొనుభద్రేభఘటల పెంపు
నూర్మిమాలి సముద్యదూర్మిమాలికలట్ల, నడతెంచుఖత్తులాణముల మురువు
సురవిమానగణావతరణక్రమక్రీడ, గమనించుమణిశతాంగములసొబగు
వివిధసింహకిశోరవిహృతివిభ్రమలీలఁ, బైకొనుబహువీరభటులయుంపు
గీ. నలర నానాత్మవిజయచిహ్నములు గ్రాల, ఘనరణోల్లాస మాస్యవికాస మొసఁగఁ
దోడు సూపిరి సన్నాహదోహలమున, దండనాథులు నిజబలోద్దండు లగుచు. 67

మ. జగతీమండలనాథుఁ డప్పు డుచితాచారంబులం దీర్చి వే
లగులగ్నంబున జైత్రతూర్యములు మ్రోయం గాంచనస్యందనా
ధిగతుం డై జయవాక్యవైఖరి బుధు ల్దీపింప సౌగంబులన్
జిగురుంబోఁడులు జాలమార్గములఁగా సేస ల్వయిం జల్లఁగన్. 68

క. మదవద్గజహయరథభట, పదసరభసఘట్టనాదిబహుభంగురతా
స్పద మగుచు నఖిలధరణియుఁ, గదలం బ్రాఙ్ముఖము గాఁగఁ గదలె న్మోదలన్. 69

సీ. అంకుశాహతులకుఁ గొంకక తమతమ, నీడలఁ దఱిమి వెన్నాడుకరులు
త్రోవ చేకొన్నదంతావళంబుల మోయఁ, దఱిమి చివుక్కున దాఁటుహరులు
ఘననేమిరవముల గర్జించి పగతురఁ, గేతనాగ్రముల ఝంకించుతేర్లు
తొడివిన పైజోళ్లు తుత్తుము రైరాల, నొడలు లుప్పొంగఁ గ్రేళ్లుఱుకుభటులు



గీ. నగుచు నడచె లెక్క కగ్గలం బై సేన, యఖిలభువనవితతి నాక్రమింప
నుగ్రరభసలీల నుద్వేల మై త్రోచు, బహుళవిలయజలధిలహరు లనఁగ. 70

శా. ప్రస్థానారభటీవిశృంఖలచమూరాసోత్థితాంతర్మదా
వస్థం భద్రగజంబె సైనికులత్రోవం బోవఁగానీక మా
ర్గస్థం బై చతెఱంగు సైనజయముం గల్పింతు భూభర్తకున్
స్వస్థానస్థితి మీఱ నిల్పుఁడమనచ్ఛందంబు గాకుండునే ? 71

ఉ. కత్తికళేబరం బొరయఁగా సెలవుల్దిగి క్రమ్ము నెత్తుటన్
జొత్తిలి నోర జొల్లలరఁ జూపఱకుం దలఁపించె నయ్యెడన్
మత్తిలి వాగె వెక్కసపుమావు పయోనిధివారివారణా
యత్తమహానలంబు నరుదారఁగఁ గ్రక్కెడు తొంటిగోడిగన్. 72

మ. అనతారాతివిఖండనప్రవణ బాహాగర్వదుర్వారు న
మ్మనువంశోత్తముఁ జెంచినట్టి ప్రమదోన్మాదాతిరేకంబు పెం
పున విశ్వంభర మిన్నుముట్టె ననఁ గాఁ బొంగారెఁ దద్భూమిభృ
ద్ఘనసేనాపదఘట్టనోత్థితవియద్వ్యాప్తక్షమారేణువుల్. 73

సీ. అంబరజంబూఫలంబున కగచరు, లుగ్రరోచికి రాహువిగ్రహములు
అష్టదిఙ్ముఖముల కవకుంఠనంబులు, మఘవత్కరి కపూర్వమజ్జనములు
కులమహీధరములకు నవాభ్రపంక్తులు, జలరాసులకుఁ గుంభసంభవములు
శాత్రవవదనాంబుజములకుఁ దుహినము, ల్ధర లోకదృష్టికి దర్శనిశలు
గీ. నెఱసె సర్వంకషంబు లై నిబిడగతుల, వివిధరథనేమిహరిఖురద్విరదచరణ
భటపదభ్రమణత్వరోత్పాదితములు, రాజనరదండయాత్రాధరారజములు. 74

గీ. బలవిరావమునకుఁ బ్రతిఘోష మొసఁగెడు, కులనగంబులంత గుహలు నిండ
నిబిడధూళి పర్వ నిశ్శబ్దగతి నుండె, నెలుఁగు రాసి పలుకు వెడలనట్లు. 75

గీ. ఆత్మమదవృష్టిచే నేల యందు వాసి, మీఁద దళ మైనధూళిచే మెఱసి యపుడు
ధరణి మోచినహరిదంతదంతికులము, భావ మెఱిఁగించె సేనామదావళములు. 76

గీ. దానధారలచే ధరాతలము గడిగి, హస్తముఖబిందువుల విహాయసము గడిగి
సైన్యరేణువు నడఁగించె సామజములు, సత్వనిధు లోప రెట్లు రజంబు నడఁప. 77

చ. తమకు నయత్నసిద్ధముగ దానము లై యలరించుభూప రా
గము లన వానిచేఁ దమకుఁ గల్గెడుదానజలాతివృష్టిచే
సమయఁగఁ జేయఁ జొచ్చెఁ బటుసైన్యముదేభకులంబు లప్ప ని
క్కము వదియట్లు మత్తు లుపకర్తల కేనియుఁ గీడు సేయరే ? 78

క. తరళనిజఖురనిపాత, స్ఫురదవనివిభుప్రపంచమున కవు డంతగ
పురములుగ నోరఁ జొంగలు, గురియఁగఁ గడలేక నడచె గుఱ్ఱపుఁబౌజుల్ 79

క. ఆశుగహతిచేఁ గేతుని, వేశితబిరుదములు పల్లవితవీరరసా
వేశమునఁ బోలెఁ గదలఁ బ్రకాశితముగఁ గదలెఁ జిత్రగతుల రథంబుల్ 80

గీ. నిబిడధూళీభరంబుచే నింగి విఱిగి, పడుమనశ్శంక నెదు రానిపట్టినట్లు
హస్తకుంతపరంపర లలర వసుధఁ, గప్పుకొనుచుఁ బదాతివర్గంబు నడచె. 81

క. బలగతుల ధూళి యై యెగ, సిల నింగికి రెండుపాళు లెగసిన నైనన్
జిలువల ఱేనికిఁ గ్రిందన్, బలభరమునఁ దొంటికంటె భారం బయ్యెన్. 82

సీ. ఇలఁ ద్రొక్కుడున కోర్వ కెగసి మీఁ దెక్కుడు, పగిదిఁ గెంధూళి పెల్లగసె మింట
నేలకుఁ జోటిచ్చి నింగి క్రిందికి డిగ్గు, పగిదిఁ గాననములు బయలువడియె
మముఁ జొచ్చినా రెఱుంగుము సుండి రిపు లని, మొరయించుగతి మాఱుమోగె గిరులు
తెగువైర లింక భేదెంతుర న్వెరఁ బోలె, హేతిదీధితులచే నినుఁడు మాసె
గీ. నానుసమతోభ్యనూయచే నలువఁ బోలె, వాహినులు దోఁకి పిండిలివండు లయ్యె
విశ్వవిజిగీష మై యువనాశ్వనృపతి, నందనుని సేన లందంద నడచునపుడు. 83

క. జలభూములధూళియు ని, ర్జలభూములజలము లూర జగదద్భుతభం
గుల నడచె నమ్మహీపతి, బలవదసంఖ్యేయవివిధబలసంఘంబుల్. 84

సీ. రథనేమిఘుష్టనారవముచే నగలించెఁ, గొందఱహృత్పుటీకోటరముల
దంతికర్ణానిలోద్ధతి నార్చెఁ గొందఱఁ, దీవ్రప్రతాపప్రదీపశిఖల
హరిఖురోద్ధతధూళి నడఁగించెఁ గొందఱ, యతివేలవీరరసాంబునిధుల
భటభుజాస్త్రచ్ఛవి భంగించెఁ గొందఱ, గంభీరగర్వాంధకారతతులఁ
తే. గోపనిశ్వాసమారుతాటోపమహిమఁ, దూల్చెఁ గొందఱచిరయశస్తూలపటలి
విశ్వవిశ్వంభరాచక్రవిజయదీక్ష, నెరపుచోఁ బేర్చి మాంధాతృనృపవరుండు. 85

సీ. వందనం బొనరించె వంగభూమీశుండు, మొగిచెఁ గేల్దోయి కాంభోజరాజు
వినతుఁ డయ్యెఁ గళింగవిశ్వంభరాభర్త, తల వంచెఁ గాశ్మీరధరణిధవుఁడు
మ్రొక్కె సౌరాష్ట్రభూభృత్కులాధీశుండు, దండంబు వెట్టె గాంధారనాథుఁ
డభివందనము చేసె నంగభూపతి నమ,స్కారంబు గావించె సాల్వవిభుఁడు
తే. గౌళనేపాళపాంచాలకాళకకుర, సింధుకరహాటచోళాదిసింధువలయ
వలయితాశేషధారుణీశ్వరులు చేసి, రంజలులు తన్మహారాజకుంజరునకు. 86

శా. చిత్తప్రీతిగ నప్పనం బొసఁగి రాసింధుస్థిరానాయకు
ల్తత్తద్దేశవిశేషవస్తువులు మాంధాతృక్షమాభర్తకున్



మత్తేభంబులు తేజు లంగనలు హేమంబుల్మణుల్ధేనువు
ల్పొత్తంబుల్మృదుచేలము ల్పరిమళంబుల్కన్నరద్వంద్వముల్ 87

చ. కులగురుమంత్రశక్తి నవికుంఠితమైనమహారథంబునం
దలముగతి న్సముద్రవియదద్రులపై విహరింప నేర్చు న
బ్బలుమగఁ డేడుదీవుల నుపాయనము ల్గొని యష్టదిక్కుభృ
త్తలముల వ్రాసె యాధబిరుదప్రథమానజయాంకమాలికల్. 88

శా. లోకాలోకమహీధ్రముద్రితమహీలోకంబు బాహాబలో
ద్రేకప్రౌఢి జయించి యమ్మనుకులాధీశావతంసంబు లో
కైకాశ్చర్యకరానుభావవిభవాహంకారరేఖన్ మరు
ల్లోకస్కందనలోలుఁ డై కదలె నాలోనేకధాటీగతిన్. 89

మాంధాతస్వర్గమును ముట్టడించుట.

గీ. ఇట్లు సురలోకజయకాంక్ష నేగి బలము, విడిసె సురగిరిపరిసరోర్వీతలమున
నీర్ష్య నారత్నసానువు నెగిరి ముంపఁ, గ్రమ్మితొట్టెడురత్నాకరంబువోలె. 90

క. చను దెంచి రహితవీరులు, నను నాగుహ లాక్రమించి నడచిరి మొఱయో
యని యనిమిషులకు మొఱ చేసినగతి మ్రోసె నద్రి సేనాధ్వనికిన్. 91

క. ఆరవమున మేల్కాంచి సే, నారేణువు చూచి కనలి నభమునకు రయో
దారగతిఁ జౌకళించెం, జేరువ నపరంజిమెట్టుసింహపుఁగొదమల్. 92

క. శైలాధిపతికిఁ బృతనా, ధూళీతతి సోఁకకుండఁ దూలించె సము
ద్వేలనిజవాలలీలా, చాలనముల నినదచకితచమరీమృగముల్. 93

క. బలఘోషమునకు మతులం, గలఁగియు గిరిగుహలు వెడలఁ గానక పులు లా
బలముల ధూళిసంప, ద్వ్యలసనములు గలయ వేఁట తెరవై కప్పెన్. 94

గీ. మున్ను గాఁ గొంద ఱేగి చేకొన్నవిడిది, పట్ల సంకేతకేతనప్రతతి గల్గు
బిరుదుప్రతిమలు తమవారిఁ బిలిచె నపుడు, నిజపటాంచలచలకింకిణీరవముల. 95

క. పసిఁడిజలపోసనంబుల, నసమరుచిం బొలుచుగొల్లియన లున్నతి పెం
పెసఁగఁగఁ బసిండిగుబ్బలి, పసిమినుగులగతిఁ దదంకభాగస్థము లై. 96

ఉ. దూరపథంబు సేదఁ బడి తూలుచు వచ్చినవారి వస్తుసం
భారము దారు మోచి నిజపల్లవశయ్యలఁ జెట్లనీడ నిం
పార భజించె నైనికుల నప్పుడరణ్యమహీమహీజము
ల్చేరినవారిఁ జేకొనువిశేషముఁ జెట్లును నెట్లెఱుంగునో? 97

క. అపుడు మెండనె యుండియుఁ, బరిసరవర్తులకు నీడపట్టై నిలిచెన్
ధరపై నున్నతులు నిజా, తురతఁ దలంపుదురె యాశ్రితులఁ బ్రోచునిషన్! 98

గీ. ఆక్రమించినశిఖిసమూహములు బెదరి, పోయినప్పుడు మునుకంబెఁ బోలిచె నడవి
ప్రాను లయ్యెడ వివిధసామంతవరుల, పరిజనముఁ జేర్చుపింఛాతపత్రతతుల. 99

చ. పరువు లిడంగ నాత్మఖురపాతములం గనకాద్రిచెంగటన్
గర మపరంజిరామొరసుగట్టుపు నేలలు మార్జితంబు లై
ఖురళికలట్ల యాట బలఘోటకకోటికి సేద దేరఁగాఁ
బొరలుట కయ్యెడ న్వెదకఁ బోవల దయ్యె రజఃప్రదేశముల్. 100

ఉ. కొంచెముగా నిజాంగకము గుంచి ధరిత్రికి నంతయంత లం
ఘించిన లేచుదంతిఁ బరికించు జనంబులు గొంత తాత్మ భా
వించి రవంధ్యవింధ్యపృథివీధరఘోరతరోదయంబు గా
వించిరి వేఱ కొందఱు త్రివిక్రమవిక్రమవిస్మయస్మృతిన్. 101

ఉ. దాన నిరోధమయ్యెడువిధంబు నెఱింగి జలావగాహముల్
మానుప వేఁడి కాళ్లను బెనంగొనుపట్వదపట్టుక్కలో యనం
గా నవశృంఖలాలతలు గ్రందుగ మ్రోయఁగ నీడ్చికొంచుఁ బె
ల్లేనుఁగు లేగెఁ గొండసెలయేరుల మజ్జన మాచరింపఁగన్. 102

గీ. తరళతరకర్ణహతిశంక దనివి నిగుడఁ, గ్రోలఁగా లేనితేఁటులకోదువ దీఱఁ
గ్రోలెఁ గండూయమానకపాలకషణ, వనకుజాసక్తజలముదావళమదంబు. 103

క. తా నడ్డంబుగఁ దిగుచుట, నేనుఁగు మఱలంగఁ బఱచ నేటికిఁ బ్రభవ
స్థాన మగునీలశైలం,బై నెగడం జూపఱులకు నద్భుత మొదవన్. 104

గీ. నతజలావగాహనమున నుత్థితము లై, క్రాలె వక్రకరికరంబు లపుడు
కుంభమణినిధానగుప్తికై యున్నత, ఫణము లైనకాలఫణులవోలె. 105

శా. ఝంకారంబులపేర నింగి దనకై సంకల్పముం జెప్పఁగాఁ
గ్రుంకు ల్వెట్టినకుంభినీపతి దిశాకూలంకషామోదసా
హంకారంబుగ దాన మీ నలులకున్ హస్తోదకం బిచ్చున
ట్లంకూరజ్జలబిందువు ల్నభము మూయం జేసె ఫూత్కారముల్. 106

చ. వనగజదానగంధి యగువాహిని వారికి నల్లియంతఁ గై
కొనక తటోపరిస్థలము కొమ్ములచే విదళింపఁ జొచ్చె నా
ననమునఁ గెంపు దేఱఁ బలనాగము పేర జలంబు గ్రోలఁగాఁ
దనకు సరోవరం బొకటి ద్రవ్వికొనం దలపోసెయో యనన్. 107

గీ. మావటీలంగముల ధూళి వోవఁ గడుగ, మజ్జనం బాడి వెడలుచో మఱియు దాన
సామజంబులు ధూళి మైఁ జల్లుకొనియె, మందబుద్ధుల కొకనియమంబుగలదె ? 108



క. ఘోటకగజపాలురఘటు, చేటీసల్లాపపరత శీఘ్రంబుగ నా
ఘోటకగజములు మాటికి, నీటికిఁ జను తెరువు లెల్ల నిబిడము లయ్యెన్. 109

సీ. వివిధపదార్థాభివిశదీకృతిం గృతి,వ్యాకర్తఁ బోలెను వైశ్యుఁ డప్పు
డాతిథ్య మొనరించి హరియించె వేశ్యాజ,నంబు సైనికులయర్థంబు లపుడు
హుంకారశతమున కొండోడకను గ్రాస,కబళము ల్భుజియించె గంధకరులు
ఘోటికాస్మృతి నగ్రఖురములఁ ద్రవ్వుచుఁ, గవణము ల్దినియె సైంధవకులంబు
గీ. నిజనిజాహారతృప్తిమై నిఖిలజనము, వేణువీణాదిబహుకలక్వాణ మెసఁగ
సరససంగీతగీతప్రసక్త మయ్యె, రమ్యతర మైననవశిబిరస్థలమున. 110

## రావణుండు మాంధాతకడకు దూతం బంపుట.

వ. అనంతరంబ యంబుజహితుం డపరాంబుధిం గ్రుంకినం గృతోచితాచరణుం డై
యుత్తరకోసలేంద్రుండు కర్పూరతైలకరదీపికాసహస్రపరంపరగసౌరభవిశేషంబులి
సేవాగతసామంతజనంబులు వివిధగంధానులేపసుగంధంబులతోడ సంబంధబాంధవం
బనుసంధింపఁ బ్రౌఢపాఠకోత్తములు నిజవిజయాంకమాలికాపఠనంబులవలన శ్రవణసు
ఖంబుగా ముఖరం బైనకొలువుకూటంబునఁ బేరోలగం బుండునంత దౌవారికుం డే
తెంచి మ్రొక్కి దూతపురస్సరుం డైనదైతేయుం డొక్కం డరుగుదెంచి మోసల
నున్నవాఁ డని విన్నవించిన నాకస్మికవిస్మయాయత్తచిత్తంబున నాస్థానం బెల్లం దదా
గమనసాపేక్షనిరీక్షణం బయ్యె నప్పు డయ్యధిపతియనుమతంబున నాహూతుం డై యే
తెంచి నిర్భయంబున నహంకారగర్భంబుగాఁ గర్ణకఠోరంబు లైనవచనసందర్భంబుల
గొలు వెల్ల వినం బెద్దయెలుంగున వాఁ డి ట్లనియె. 111

శా. ఎవ్వం డిం దధినాథుఁడో? యతఁడ నా? తే తుచ్ఛుఁడా! మంత్రి యిం
దెవ్వండో వినుఁ డింకఁ దక్కినబలాధీశాఖ్యకీటంబు లిం
దెవ్వం డెవ్వఁడొ మీఁదిచే టెఱుఁగ రీహీ! నిక్కమే రాజు లై
క్రొవ్వు ల్మీఱ మదిం గృతార్థులగతిం గూర్చున్నవా రిందఱున్. 112

సీ. కైలాసశిఖరంబు కందుకం బెవ్వని, కంపమాతినిజభుజాదండములకుఁ
గృత్తాత్మశిరములు నైత్తమ్ము లెవ్వని, నీలకంఠార్చనానియమములకు
శతమఖాంతగపురస్మితము లు గ్గెవ్వని, యుగ్రాసిపుత్రికాభ్యుదయమునకుఁ
గనకగర్భాండంబు కరఁగెడునుయిచ యె,వ్వనిరోషశిఖిశిఖావైభవమున
గీ. కతఁడు దుర్వారదిగ్విజయప్రయాణ, సరళమార్గాంతరాంతరసన్నివేశ
భవనవలయీకృతాఖిలభువనకుండు, రావణుఁడు వొల్చు విశ్వవిద్రావణుండు. 113

వ. అమ్మహావీరుండు విశ్వవిజయధాటీసమాటోపంబునం బాతాళభూర్భువనంబు లాక్ర
మించి యెదుర్పడుశూరుండు లేక యుపరిలోకం బైనస్వర్గంబునకుం జనిన సునాసీరా

దులు నాసీనవీరులకుఁ బట్టువడిన నోసి విడిచి కనివోనిదోర్దర్పభరంబుతోడన మఱలి యదె నికటనగోపరిస్థలంబున విడిసి యాఁకొన్న బెబ్బులికి మేఁకలకూఁతయుంబోలెఁ బర సైన్యకలకలంబు వినంబడిన నెవ్వ రని తెలిసి రమ్మనిన నతనియానతిం బనిపూని వచ్చితి నస్మత్స్వామి యగునతనిపరాక్రమక్రమంబు లొకకొంత యెఱింగికొనుండు విని పించెద. 114

మ. సమదైరావతదంతము ల్విఱిచి బీజశ్రేణి గా సాధ్వస
భ్రమధావత్సురలోకరాడపయశఃపంకంబులో నాటి త
ద్రమణీనేత్రజలంబులం బెనిచి యాదైతేయవంశావతం
సము గోల్చె న్నిజకీర్తివల్లికల నాశాకోటిపైఁ బ్రాఁకఁగన్. 115

క. దనుజపతిమఖము లుడుపఁగ, జనితస్వాహావియుక్తి సమ మయ్యును ద
క్కినసురలకంటె ననలున, కినుమడి యయ్యెం గళత్ర మిదె చెఱపడుటన్. 116

ఉ. తోడనె లేచి దండము ప్రతోదముగా నెనుపోతుతో జముం
డూడినచక్కటిన్ మడుగు లూనిన నెత్తుట భగ్నశృంగముల్
ప్రోడతనంబునం దగినబూఱటకొమ్ములు గాఁగఁ జల్లుపో
రాడిరి నిన్న రావణరణావనిభూతపిశాచబాలికల్. 117

క. బాడుదలఁ బట్టుకొలమునఁ, గూడనిచెఱుగంతుఁ బెట్టుకొనఁ జూచియుఁ జే
యాడక వదలిన నూడని, బాడెం గోణపుఁడు దైత్యపతివెనువెనుకన్. 118

క. దనుఁగట్టఁ ద్రాళ్లు తానై, కొనివచ్చిన జాడ యనుచుఁ గుదియించి కరం
బునఁ బాశముఁ గొని తానన, వనధీశుని గట్టె నసురవర్యుం డాజిన్. 119

గీ. ఆత్మజవము నచ్చి హరిణంబు డిగ భీతిఁ, బాఱఁగాళ్లు రాక పవనుఁ డసుర
లెగిచి కూడ ముట్టి యెకిరింతయిరినోరి, గరికిఁ దిగచి నోరఁ గఱచుకొనియె. 120

క. మిడిగడుపువ్రేఁకమున నొక, యడుగే నిడ లేక యున్నయర్థాధిపతిం
బుడమిఁ బడఁ ద్రోచి పైమరు, పడ శవములతిట్ట పేర్చి పరిజన మరిగెన్. 121

క. కలవాఁ డెవ్వఁడు జెడఁడను, పలుకు నిజం బాజిఁ బట్టువడియును దనకుం
గలనిధులను దండువ యిడి, తలలో నూఁదఁబడి పోయె ధనదుఁడు గృతి యై. 122

గీ. ఎద్దుచేతిపుర్వ నెమ్ములఁ బొడతోలు, నొల్ల కసురవీరుఁ డొడిచికొన్న
చంద్రరేఖ నాత్మసత్కీర్తిరేఖ గాఁ, దలఁచి వగచుఁ జంద్రధరుఁ డతండు. 123

గీ. అసురచెఱసాలయం దున్నయమరవరుల
నారు లిప్పుడు ధరియించినారు జడలు
ధూర్తరక్షఃప్రతాపాగ్నిధూమరేఖ
లార్తనిర్జరలోకాపకీర్తిలతలు. 124



వ. గుడిమ్రింగువానికి గుడితలుపు లప్పడంబు లనిఁ జెప్పవలెనె? యీచందంబున శతమఖప్రముఖులం జెఱవట్టినరావణునకు నధమమర్త్యులు మీరు లక్ష్యంబు గా రని యెన్న నేల? తలంగి పోయినం గట్టువడి బ్రదుకలే రగుట బుద్ధిమంతు లైన నమ్మి నావెంట నే వచ్చి యతనిమ్రోల శరణంబు నొంది ప్రాణంబులు గాచికొనుం డని పలికిన. 125

సీ. అరుణాయమానంబు లై చూపు లొదవంగ, నిండార దెసలు తీరెండఁ గనియె
నత్యుష్ణగ్రీష్మంబు లై యూర్పు లొలయంగ, గాఢంబుగా వడగాడ్పు వీచె
నాసారవర్షంబు లై స్వేదములు గ్రమ్మ, మణికుట్టిమస్థలి మడుగుకొనియె
నహహాశబ్దమయంబు లై హాసములు పర్వఁ, గ్రందుగా వీతెంచెఁ గలకలంబు
గీ. దైత్యకులభర్తృభృత్యధూర్తప్రతాప, దండహతపుండరీకోగ్రదండనాథ
నిర్నిరోధాగ్రహావేశనియతిఁ బలన, మనుకులాధీశునాస్థానమండపమున. 126

వ. అప్పు డవ్విభుండును నిటలకుటిలభృకుటీకటీకపటంబునం బొగసినదైత్యకులభర్తృభృత్యరోషానలంబునం బొలయుకీలలచెలువునం గనుంగొనలం గెంపు గదుర నెదురనున్నదనుజదూతం జూచుచుం గనుంగొని. 127

క. దూత నని వెఱక వ్రేలెదు, దైతేయాధముఁ డెదిర్చి తానై యనికి
ప్లైతెంచుపనికి మదిలోఁ, గాతరుఁ డై నోరఁబోటుఁ గఱపె న్నీకున్. 128

చ. కొలిచినవారినేరమునకుం బతి దండ్యుఁడు గాన నిప్డు నీ
పలికినప్రల్లదంబులకుఁ బ్రాప్యఫలంబుగ నెల్లి యాజిలో
నిలిచినయేని దూతవుగ నిన్నిటు పంపినరాక్షసాధమున్
సెలవులు వాయఁ ద్రొక్కి వెస జిహ్వ యసిన్ మొదలంటఁ గోయుదున్. 129

ఉ. మేరునగంబునివ్వలిసమీపవసుంధర సంగరస్థలం
బోరి! నిశాచరాధముని నుగ్రకరుం డుదయాద్రి కెల్లి దో
తేరకమున్న పోరి కరదెమ్మను రజ్జులు వ్రేలి రానినాఁ
డూరక పోదు సుమ్మి నసలోగ్రకృపాణిక రేఁచిపెట్టునన్. 130

క. అని వాని వెడలఁ ద్రోయం, బనిచి మహీపాలుఁ డెల్లి బవరముసుండో!
యని నిఖిలసైన్యములకును, జనితోత్సాహముగ వీటఁ జాటించుటయున్. 131

సీ. కైదువు లర్చించి కలయర్థ మంతయు, నిలుఁ జూఱ యర్థుల కిచ్చువారు
కదనోత్సవత్వరఁ గను మూయ నెఱుఁగక, కోర్కి మై వేఁబోకఁ గోరువారు
వెడనిద్రఁగలలోన విమతుఁ గూల్చితి మని, కలువరింతలఁ బేరువలుకువారు
పొలయల్క లెడలించి పొలఁతులచే బిగ్గఁ, గంఠగ్రహప్రీతిఁ గాంచువారు
గీ. భానుబింబంబు భేదింపఁ బంతమాడి, యించుపడఁతులమతులు భేదించువారు
నగుచు బలయోధు లారేయి యనుభవించి, రాహవోత్సాహసన్నాహహర్షరసము. 132

గీ. త్రోపువడి కోపమున దైత్యదూత యంతఁ, గనకధరణీధరాధిత్యకాస్థలమున
నుగ్రదనుజులు గొల్వఁ గొలువున్నదనుజ, విభునిసన్నిధి నది విన్నవించుటయును. 133

ఉ. త్రొక్కుడువడ్డభోగిగతి మ్రోఁగి ఘృతాహుతి గొన్న యగ్నియ
ట్లొక్కట మండి దండహతి నొందినక్రొల్పులిమాడ్కిఁ జూడ్కికిన్
వెక్కసమై ఘనస్వనము విన్నమృగేంద్రమువోలెఁ బైఁ బడ
న్నిక్కి సురారి యాత్మరథినీవరకోటి మొగంబు చూచినన్. 134

## ⟹ రావణుసేనాధిపతులు పంతంబులు వల్కుట. ⟸

వ. విలయపవనవజనఘూర్ణమానమహార్ణవోద్రేకరేఖావిడంబకాండంబు నభంగక్రూరభ్రూభంగభంగితంబును నట్టహాసప్రభాఫేనిలంబును నవిరతోద్భేదస్వేదప్రవాహపరివారహితంబును నరణాయమానావలోకనసచ్ఛురణకలుషితంబును నై తాలగ్రీవచక్రాక్షుజంఝూశ్వాసగుహాముఖసేతుఘ్రాణతటిజిహ్వాక్రోశబాహుకూటోదరకుంభహను ప్రముఖం బగుదైతేయసామంతవర్గం బనర్గళారంభసంరంభవిజృంభణంబునం గొలువుకూటంబు గ్రక్కదల నొక్కంత దిగ్గన లేచి యేచినతమిం బ్రాసాసిభిండివాలశూలప్రముఖప్రహారముఖంబుల నిప్పుకలు చిటులం ద్రిప్పుచు నొండొరుం గడవ నేయుం జక్కాడి యెక్క డెక్క డనియు నెప్పు డెప్పుడనియు నేమేమి యనియు విడువిడు మనియు వివిధవీరాలాపంబులు గ్రందుకొన వీరనృత్యంబు సలిపి రప్పుడు విభీషణుం డనుదండనాయకుం డఖండనాదంబు నిగుడ భుజాస్ఫాలనం బొనరించుచు ని ట్లనియె. 135

క. పుడమి సమస్తముఁ బిడికిటఁ, బొడిపొడిగా నుసిమి కినియఁ బొడమినపైచి
త్తడి యడఁగఁ జల్లుకొందు నె, యెడయేటికి లెమ్మనుజ్ఞ యిమ్మసురేశా! 136

వ. అనినఁ బ్రలంబకుం డనువాఁ డి ట్లనియె. 137

గీ. ఉదధిపుడిసిలించి యొకగ్రుక్కఁ గొని లోని, చిలువసెజ్జతోడిజలజనాభు
నరిగి పాఱఁ గట్టు మనఁ ద్రేఁచి పుత్తునో? క్రాసి యుమిసి విడుతునో? సురారి!

వ. అనిన విఘసనుం డనుదైతేయనాయకుం డి ట్లనియె. 139

ఉ. తారలచేరు గ్రుచ్చి యఱుత న్ధరియింతునొ? భానుబింబనీ
హారమరీచిబింబముల నన్నువలై తగఁ గర్ణకుండలా
కారము గా వహింపుదునొ? కంజభవాండకరండఖండముం
గోరఁగఁ బట్టి యీభువనకోటి గుటుక్కన మ్రింగిపుత్తునో? 140

వ. అనిన నందఱు మెచ్చక నిఘ్నకుం డనుయాతుధానప్రధానవీరుం డి ట్లనియె. 141

చ. శతమఖు నగ్ని నంతకు నిశాచరుఁ బాశి సమీరు నర్థపున్
శితిగళు గిట్టి బిట్టెగచి చెచ్చెరఁ గైకొని తెచ్చి పేరితో



నితఁ డితఁ డీతఁ డీతఁ డితఁ డీతఁ డితం డితఁ డంచు నింక నే
నితరులు వోలె నిప్పు డిహిహీ! వెడపంతము లాడ నేర్తునే? 142

## ⟹ రావణుఁడు మాంధాతపై దాడి వెడలుట. ⟸

క. అని సామంతులపంతపుఁ, బెనుగాడ్పులతరతరంబు పెరిగెడునసురే
శునికినుపుగడలి మెఱసెనొ, యనఁ దగి ప్రస్థానభేరి యంతట మ్రోసెన్. 143

మహాస్రగ్ధర. బలగర్జానాదవేదప్రణవరవణమై ప్రాణిహింసారిరంసా
బలికాలత్వోళితాపోపమయి కలహభుక్పారణామంత్రణం బై
బలవిద్విట్ప్రేరకన్యాపరిణయకలనాబంధురాశీఃపదంబై
పలభుగ్భర్తృప్రయాణప్రతిహటపటహప్రోషరానం బెలర్చెన్. 144

సీ. వింధ్యాద్రిఁ గలయఁ బర్వినకాఱుమొయిలు నాఁ, గఱుకునెమ్మేన మైమఱువు దొడిగి
మున్నీటిపై మండుపెన్నేటిచిచ్చుపై, తవణించుమణికిరీటములు దాల్చి
మదహస్తి పెటికినమ్రాను చేకొనునట్లు, విస్మయం బగునొక్కవిల్లు పూని
ప్రళయపర్జన్యుండు పవిపరంపరవోలె, నదురు లీనెడునంపపాదులు పూని

గీ. యుగ్రకరుఁడు వెండియు నమోఘనైదాఘు, తీక్ష్ణగతి వహించుతెఱంగు దోఁప
గ్రూరుఁ డైనదనుజకులభర్త భయదస, న్నాహకలితుఁ డగుచు నడరె ననికి. 145

వ. ఇట్లు సమరసన్నాహదోహలంబున రావణాసురుండు విగ్రహం బెత్తి యాగ్రహంబున మూర్తీభవించినపరాక్రమంబున నాకారంబు గైకొన్నమాత్సర్యంబునఁ బురుషభావంబు భజించినక్రౌర్యంబున నవయవంబులు పూనినభయంకరత్వంబున దుర్నిరీక్షుండును దుస్సహుండును దుర్నివార్యుండును నగుచుం జిరమనోరథసిద్ధి యైనయుద్ధంబు గలిగినపరమలాభంబున నుల్లంబునం బట్టువడనిమహోల్లాసంబు వదనదశకంబునకు మందహాసవికాసంబు నొసంగ నగరు వెడలి నిజోద్యోగానురూపంబుగా నున్నతం బైనకామగమనం బైనరథంబు నారోహించి సామంతమంత్రిసుతహితాదివర్గంబు లనర్గళారంభంబున నిరుపక్కియలం బిక్కటిలి సేవింప ధవళచ్ఛత్రడిండీరంబుగాఁ దనయందు వెల్లివిరియునీరసప్రవాహంబున కలంకారంబుగా విహారంబు చూపుచామరనురాళంబులకరాళదంష్ట్రాప్రభాపూరంబులు ముకుటంబులు సంపాదింప శంఖకాహళీసంధుక్ష్యమాణం బగుచుఁ బాతకపఠనముఖరంబుగా నుద్దీపించునిజప్రతాపపావకునకు సముత్తాలకీలాకలాపంబు లై ముందఱ నందంద సందడి జడియుచుం గనత్కనకవేత్రపరంపరలు నర్తింప నరుదెంచునపుడు ప్రియాదత్తగండూషహాలారసాస్వాదనంబున రణోన్మాదం బెత్తి తత్తరంబున నొరలు పాయం దట్టినపట్టెంబు లంకించుచుఁ దమనీడలుదారువెన్నాడుచుం బఱతెంచువెక్కసపుఁగఱకు

రక్కసులును, మఱియు దక్షిణహస్తంబులం దొడిగినయంతన సమరసంతోషంబున నవయవంబు లుప్పొంగ నితరహస్తంబులం దొడువను దొడివినహస్తంబుల వెడలింపను రాక కవచంబులును వెనువెంట వ్రేలికొనం గంచుకంబు లూడ్చినకాలోరగంబులభంగి పోఁగుచుఁ బఱతెంచుయాతుధానయోధులును, మఱియు మునుపు సురలఁ గెలచిన సురలోకంబు చూఱఁగొనునప్పుడు చెఱఁబడక మఱుంగునం దలంగి లోఁబడక పోయి రగుట నీరణంబునం గోలలు మున్నుగాఁ దనువులు దొఱంగి వెనుకొనువార మింతసిద్ధంబని ప్రతిజ్ఞాబద్ధలై యూర్వశి నాకు నాకుం దిలోత్తమ ఘృతాచి నాకు నాకు మేనక యనుచు నొండొరుం గడవఁ బంతంబులాడివివాదించుచుం జనుదెంచునక్తంచరకుమారవీరులును, మఱియు నాయోధనోత్సవాగమహర్షాతిశయంబున నుబుసుపోక లీలాపరత్వంబునం గొందఱు గంధర్వదంతావళంబులుం గొందఱు రథారోహణులుం గొంద ఱుత్తమాశ్వంబులునుం గొందఱు రాహుత్తులునుం గొందఱు శతాంగంబులునుం గొందఱు రథికసారథులును మఱియునుం గొందఱు భేరుండశరభశార్దూలసింహభల్లూకవరాహాదిక్రూరజంతుభేదంబులునై సర్వతోధికంబైన యనివార్యరభసంబునం గవిసి పఱతెంచు కామరూపధరు లగుధూర్తదనుజులుం గలిగి శతసహస్రలక్షకోటిశతకోట్యర్బుదన్యర్బుదాదిసంఖ్యల నతిక్రమించి విరించి కీజీవలోకంబు దోడుచూపుభావంబునం జాపఱులచూడ్కికి వెక్కసం బయి యొక్కంతఁ బట్టుసాలక మేరుమహీధరావతరణమార్గంబు నతిక్రమించి నిండుచెఱువవియునీరునుం బోలె మహీమండలంబు గలయ ముంపుచు వివిధభీషణక్ష్వేళాసముత్క్షేపంబున దిగంతంబునం దొట్టుచు నెడవడనియడియాలంపుగొడుగులం బడగలయంతరాళంబున దంతురంబు గావించుచు నెల్లివిఱియునమ్మహాసురచమూసమూహంబులు విలయసమయంబునం జెలియలికట్ట నతిక్రమించుమహార్ణవతరంగపరంపరలం దలపించె నివ్విధంబున. 146

సీ. తీవ్రదంతిప్రభాతేజోధరంబులు, విరళాంధకారంబు వెన్నడింప
బదసముద్ధతమేరుపదవీపరాగంబు, తొలుసంజరుచులకుఁ దోడుపడఁగ
వివిధతూర్యధ్వనిక్ష్వేళారవంబులు, గతనిద్రముగ భూతగణముఁ గలఁప
నస్త్రశోచులు దీప్యదర్కబింబమునకు, దీధితిప్రతినిధిస్థితి వహింప
గీ. భయదనిజధాటికాటోపపటిమ కులికి, డాఁగిపోయినగతి నిశ యేగువేళ
నాహవోత్సాహసన్నాహ మతిశయిల్ల, విడిసెఁ బతిసేన కెదురొడ్డి విమతసేన. 147

వ. సూర్యకులనృపసూర్యుండును సూర్యోదయంబునం గృతకాల్యకరణీయుండై జగదండభాండంబు బూరటిల సన్నాహభేరి చఱపించి దనుజసేనకుం బ్రతిగా నిజబలంబుల మాఱొడ్డ సంఘటించుటకు దండనాయకుల నియోగించిన. 148

క. హరి కరిఁ గరి హరి హరికరు, లరద మరదము కరిహరుల హరికరిరథము
ల్పురుషునిఁ బురుషుఁడు రథకరి, హరులం గాచికొనఁ బని రణపతిపేటన్. 149



ఉ. వీ ళ్లవి రెండుఁ బన్నడు దివిం గలవాశనమ్మానిచూడ్కు లు
వ్విల్లు గొనంగఁ జొచ్చె నలవేల్పుపడంతులనెమ్మనంబు పిం
పి ళ్లొగిఁ గూయఁ జొచ్చెఁ దమిపెక్కువ మృత్యువు మ్రింగఁ జొచ్చె గ్రి
క్కి ళ్లవియంగఁ జొచ్చె రవికిన్ హృదయం బఖిలంబు నయ్యెడన్. 150

గీ. పన్ని వేగిరించుపరనిజధ్వజినులఁ, జూచి కోప మేచి త్రోచి యపుడు
పోర నొండొకంటిఁ బొడుచుట కవనీశ, విబుధరిపులు గేలువిడుచుట యును 151

## మాంధాతృ రావణసైన్యములు ఘోరముగ బోరుట.

క. శ్రుతికటువుగ నిరువాగునఁ, జతురంగధ్వనులు తూర్యశబ్దము లేకా
త్మతఁ జూపుట్టియును దిక్కులు, ప్రతివాక్కులు గాన భిన్నభావము దెలిపెన్. 152

మ. రతివాదంబులు దక్క భర్తలస్వయంగ్రాహాంకపాలీసము
న్నతులం గా నొనరింప సిద్ధవనితల్ నిద్రాణకంఠీరవ
ప్రతతు ల్గర్జిల నమ్మహాబలయుగారావంబు భూభృద్గుహా
ప్రతిఘోషాధిపదీర్ఘమై పగిలిచెం బంకేజగర్భాండమున్. 153

గీ. కుంతములఁ జిమ్మి శక్తుల గ్రుచ్చి యెత్తి, ముసలముల మోఁది కరవాలముల దళించి
పరశువులఁ ద్రెంచి గదలచేఁ బంపు చేసి, ఘోరగతిఁ బేర్చి యిరువాగుఁ బోరొనర్చె.

క. కలన నొక టొకటి మార్కొని, కలసి కచాకచి విచిత్రగతిఁ బోరఁగ నా
బలముల కుడిగె విభేదము, బలభటులకుఁ గలిగెఁ గాని ప్రత్యంగములన్. 155

సీ. మది తత్తఱం బెత్తి మొదల మ్రొక్కులు చూపి, పట్టి పైకొకలు పాఱఁదిగిచి
కేలిపై గుణము లగ్గించి యగ్గించుచు, నడుములు డాకేలఁ దొడికి పట్టి
కుటిలభావములు గైకొని యున్నఁ బరికించి, పరుసనై రంపిల్లుబిరుసు మెచ్చి
పరిచితస్నేహానుపాకంబు మది నచ్చి, వదలక కొప్పులు వాలఁ దిగిచి
తే. యచ్చలము మీఱ మెలపినయట్ల వచ్చు, తరుణులును బోనివిండ్లతో దండిమగలు
విషమశరఖేలనము చూపువేళయందు, నభినవక్షతు లెసఁగెఁ బెల్లంగములను. 156

క. సలలితవికాసలక్ష్మీ, నిలయము లగుయోధవదననీరజములపైఁ
బొలసెఁ బరంపర లై యపు, డలఘుశిలీముఖకులంబు లారవ మెసఁగన్. 157

క. తొడవినయొడలను అవికల, నెడలిచి యనురక్తరచన లేర్పడ భటులన్
మెడలు గబళించి వివశతఁ, బొడమించె న్నారఖడ్గపుత్రిక లంతన్. 158

గీ. పటవణించినయరిగెలపాఁజుమీఁదఁ, గూడి విలుకాండ్రు తూపులు గురియు మ్రోఁత
సమరవీరుల మ్రింగుకోపమున జముఁడు, పెటపెటనఁ బండ్లు గీఁటెడుపెల్లు చూపె.

గీ. పోటుపూఁచి పట్టునీటెలు దగె రెండు, వీళ్లయందు సమరవీరవరుల
మ్రింగ వెఱచి యున్నమృత్యుముఖంబున, బయలువడినదంతపంక్తు లనఁగ. 160

గీ. తీవ్రచక్రనిహతిఁ దెగి కాళ్లు గుత్తుల, కొలఁది కూడి చనినఁ గూలఁబడక
నిలిచి పోరి రిపుడు నిజహస్తకుంతంబు, లూఁత గాఁగ వీరయోధవరులు. 161

క. ఎడనుకడవాఁడు వొడిచినఁ, గుడిచే బాణముల కొఱిగి కొఱప్రాణముతోఁ
బుడమికి వ్రాలఁగఁ జేయం, బడకయు శరతల్పవసతి భటులకుఁ గలిగెన్. 162

గీ. విడిచి వాటుల వీఁపున వెడలుగొరక, లొగ్గి నిలుపుటఁ గూలక మ్రొగ్గతిల్ల
నీటునప్పనియరిగెలచాటుకలిమి, నీల్గియును గొంద అహితులు నిలిచి రాజి. 163

గీ. నన్నుఁ జిన్నపుచ్చి నాకంబు పెద్దసే, యంగఁ బోవు టె? ట్లటంచుఁ బుడమిఁ
దెగినవీరులరుగుతెరు వరికట్టె నా, సమరధూళి మింట సాంద్రమయ్యె.. 164

గీ. తూర్యములఁ బెట్టుచప్పుడు దోఁప కైన, కప్పుకొనుధూళి నొండొరుఁ గాన కైన
పోర నిరువాగునెదురుగఁ బొడుచుపోటు, లందు నొకటియు వృథగాదు క్రందుకలిమి.

క. ఇలకును నింగికి భేదము, గలుగక రణధూళి పర్వఁగా నిరుమొనలన్
విలుకాం డ్రేసెడితూపులు, నెలవుగ నాకసము గాఁడి నిలిచె న్నడుమన్. 166

గీ. తనువు తనువును దార్కొన్నదాఁకఁ గాన, రానిబలధూళిఁ జేతిశస్త్రములు వదలి
పొదివి యొండొరుఁ ద్రోపాడి పోరుకతన, మల్లుపోరాటమైఁ బోరు చెల్లె నపుడు. 167

క. తొరఁగెడు నెత్తుటఁ దేలియు, నొరిగెడుప్రాణముల నింగియును గప్పదు నా
దురమున ధూళి యడంచిరి, పరస్పరాస్త్రముల గ్రివ్వఁ బడువీరభటుల్. 168

సీ. చెఱకుపన్నిద మాడుతెఱఁగున గొడ్లండ్ల, నడుములు రెండుగా నఱికి నఱికి
యంత్ర మాడెడుభంగి నట్టులు దలలును, విడసినధారల వ్రేసివ్రేసి
కఱకుట్లు గ్రుచ్చుసంగతి నల్వ రేవుర, గుదులుగా గొరకల గ్రుచ్చి గ్రుచ్చి
దొంతుల కుఱుకురీతుల నొడ్డణములతో, శిరములదొడలఁ జిదిపి చిదిపి

తే. ప్రల్లదమునఁ బల్కుపంతంబు నొకఁడుగాఁ, బోటుగరవుకన్న పోల్కిఁ జూపు
శివము లెత్తినట్లు చేతులతీఁట వోఁ, బోరి రిందు నందు వీరభటులు. 169

క. ఇది హస్తం బది మస్తం, బిది తొడ మెడ డొక్క పిక్క యిది కాలిది వ్రే
లిది వదనం బిది రదనం, బిది యిది యని యెఱుఁగ కుండ నీల్గిరి సుభటుల్. 170

గీ. ఉభయబలముల బిరుదురాహుత్తు లెదిరి, తోలుగుఱ్ఱంపుపోఁజులధూళికతన
నపుడు కాలనిశావేళ యైనచోటఁ, దగియె ఖద్యోతనామంబు తపనునకును. 171

చ. ఇతరబలాంగకోటి గలహింపఁగ సంగరభూతభోజనో
చితముగఁ బ్రోవు లై పడియెఁ జిత్రముగాఁ గవిరూపరూపము
లుక్కుతలముదూఱున వ్లెదిరి గుఱ్ఱపురౌతులు వ్రేటులాడ న
ద్భుతముగఁ దద్భుజక్రియకుఁ బోలెడునట్లుగఁ గత్తెఁ బచ్చడుల్. 172



క. పగరౌతు లెడమభుజములు, తెగ వ్రేసినవాగెపట్టుతెఱఁ గేదియునుం
దగునిజహయముల నద్భుత, ముగ రాఁ గలసన్న మెపిల పోరిరి రౌతుల్. 173

క. రౌతుల సందిటఁ గొని చను, రౌతులపడిగుఱ్ఱముల కరాతికృపాణీ
పాతితహయు లై తిరిగెడు, రౌతులు రౌతు లయి పోరురణ మలరారెన్. 174

గీ. రౌతు వొడిచినఁ బుడమికి వ్రాలుభటులు, ఖడ్గముల వ్రేయ ముందఱికాళ్లు ద్రెవ్వి
హయము గూలంగ నిజపటాప్రాంతమునన, త్రెళ్లునారౌతుతలయును డొల్లనడఁచె.

క. నెత్తురునుడువులు పోఁజుల, మొత్తపుపొదులు గలకలనుమోదముఁ బెనుపన్
మత్తకరిఘటల శృంఖల, వృత్తి నెదుర్పడియె రెండువీడులయందున్. 176

గీ. ఉపరిసామంతజనము వెంపొప్పవార, ణములకులవృద్ధు లని చేరినెమలి లన
నొలి నిరువాగుతరులపై వ్రాలుశత్రు శస్త్రికలు గ్రాలుఘింఛగుచ్ఛములు వొలిచె. 177

గీ. ఉభయబలములు నెదిరి పోరొడ్డి కదియు, కరిఘటలయంతదాళంబు గాన నయ్యెఁ
గపటపాఠీనవిహృతివేగంబువలనఁ, బాయవడి తోఁచుజలధిగర్భంబువోలె. 178

క. దూరమున శరము లేయుచుఁ, జేరువ బల్లెముల నొంచి చేరినయపుడా
ధోరణవరులు పరస్పర, వారణముల కుఱికి రిపుల వధియించి రనిన్. 179

గీ. క్రొత్తయినుపకట్లకొమ్ముల నన్యోన్య, ఘట్టనముల నిప్పుకలు జనింపఁ
గర్ణచామరములఁ గప్పుచుఁ గ్రొంపొగ, లెగయఁ బోటులాడె నిభము లపుడు. 180

క. కొమ్ములు విఱిగినబిరుసునఁ, గ్రమ్మరు ప్రతిగజముపార్శ్వకము కరి వొడిచెన్
గొమ్ములకొలఁదియుఁ దిగఁబడఁ, గ్రమ్మి నదీతటము గ్రొచ్చుకై వడి దోఁపన్. 181

క. కలనం బిఱుసన వయ్యెను, బలవద్భద్రేభములకుఁ బ్రతిగజదేహం
బులు మునుఁగ నాఁటి కొమ్ములు, వెలువడఁ బెఱుగుట కొకింత వెనుచన వలసెన్. 182

క. కుంజరము వాజిఁ గొమ్ముల గ్రుచ్చి యెత్తి, జడియ కసిధార మావంతుఁ బుడమిఁ గూల
వ్రేసి రాహుత్తుఁ డామదద్విపము నెక్కి, మలపి దీకొల్పి శాత్రవబలముఁ బఱపె.

గీ. చాయ దప్పించి కొమ్ములసంది కొదిగి, గ్రుంకి తొండముఁ దెగ వ్రేసికొంచుఁ గాళ్ల
నడుమ నరిగినభటుని గానఁడు నిజాగ్ర, హస్తఖండంబు భటుఁ డంచు హస్తి వొడిచె.

క. దురమున మృత్యువు ఘోరుల, కరముల రెంటన వసించి కరులకు గుండా
చరణరదనాలముఖములఁ, దరలక యష్టోళనష్టధా నసియించెన్. 185

క. తమయెక్కియున్నమదనా, గములకు ననిపోటు గరవు గా నెదిరినరూ
పము నెల్లఁ దార మునుమును, సమయఁ దొఱంగించి చంపఁ జని రాకొమరుల్. 186

క. శరము లడరించి ముందఱి, పరబలములఁ ద్రుంచి తెరపిఁ బడుత్రోవలుగా
నరదంబులు నడపించుచు, సరినిరువాగును రణంబు సలిపిరి రథికుల్. 187

క. ఆరూఢి వీరరథిక, క్రూరాశుగనిహతి నేలఁ గూలియు శైలా
కారంబు లైనగజములు, తేరులు చన కుండ వారితెరు వరికట్టెన్. 188

వ. ఇవ్విధంబున. 189

క. నారదమునిచూడ్కికి సుఖ, పారణ గా నింగివేల్పుపడఁతులయిండ్లం
గోరిక నాథులపండువు, గా రవిమండలము డొలుకఁగా నని చెల్లెన్. 190

గీ. దురములోఁ దఱు చైననెత్తురుమడుఁగులు, కాళ్లు ద్రెవ్వినకరులు నక్రంబు లయ్యె
లూనతత్కరవితతి జలూకమయ్యె, భిన్నతత్పదకులము దాఁబేళు లయ్యె. 191

క. నలుగడల నట్టలాడుచుఁ, బొలుపారఁగ మొదల నిడినపుష్పాంజలు లై
దళితకరికుంభముక్తా, ఫలములు రణరంగపీఠిఁ బ్రకటము లయ్యెన్. 192

క. పలుచని నెత్తురుమడుగులఁ, బొలిచెన్ రథనేమివలయములు రణహతవీ
రులు దూరఁగ రవిబింబము, దొలుకై రుచి మాలి నీడ దోఁచినమాడ్కిన్. 193

క. ఖరభల్లనిహతిఁ ద్రెవ్విన, తురగంబులవాలవితతి దురమునఁ గ్రొన్నె
త్తురుమడుగులఁ జూపట్టెన్, విరిజల్లులఁ గుసుమనూనె వ్రేసినమాడ్కిన్. 194

గీ. ఎదురుపోట్ల మిడిసి యెగసి బోరగిలంగఁ, గూలి నేలఁ గఱచుకొన్నదొరలు
సచ్చి యైనఁ దమకు సడలనిభూమిభృ, ద్భావలోభ మెఱుకపరచి రపుడు. 195

సీ. వివిధమాంసంబులు వివిధభోజ్యములు గా, నెత్తురు లెక్కుపానీయములుగఁ
బదహస్తతతు లపూపవిశేషములుగాఁగ, బహుగాత్రఖండము లప్పడములుగఁ
బ్రేవులప్రోవులు సేవెలుగాఁ దెట్టె, గొన్నక్రొమ్మెదడులు జున్ను గాఁగ
ఛిన్నాస్థిఖండము ల్చెఱకుఁదుంటలు గాఁగ, నెర వైనయయ్యోట నెయ్యి గాఁగ

గీ. సమరవీరులు నప్సరస్సతులు పెండ్లి, యాడునప్పుడు పెండ్లివిం దారగించి
భూతబేతాళఖగమృగవ్రాత మొందెఁ, జాల సంతృప్తి నారణస్థలమునందు. 196

వ. మఱియునుం గ్రోధంబులకు సామ్రాజ్యంబును గ్రూరత్వంబులకు నామనియు మదంబులకు సాఫల్యంబును మాత్సర్యంబులకుఁ గృతార్థతయు నభిమతంబులకు విలసనంబును నాశ్చర్యంబులకు నుద్వేలనంబును నుత్సాహంబులకుం బురిటిల్లును నున్మాదంబులకుం బ్రోఁకుడును సాహసంబులకుఁ బర్వంబును సత్వంబులకు దాయంబును బ్రాయంబులకుం గై సేఁతయు బంతంబులకుం బరిణేతయు సత్కీర్తిలతలకుం బాదును స్వర్గంబునకు ఘంటాపథంబును నగునమ్మహాహవంబునం బేరుకలరౌతు లాయశుద్ధిగాఁ దార యొఱంగి వ్రేసినజన్నిదంబువేట్లం బంచి వేసినగతిం గాలు చేయాడక నిలువునఁ గుప్పలై కూలినపట్లును, నిక్కబాయ లై వడినయొడలునుం, బరిఘాఘాతంబులం బలకలతోడన పునుకలు తుందునక లై రూపు చెడి మడిసినచోట్లును, వాఁడిగుదియల మోఁదిన నొడళ్లు గులగుల లై తలమోపులు దిగ వైచినగతిఁ గాలుసేతు లాడక నిలువునం గుప్ప లై కూలిన



పట్లును, నిక్కగలడొక్కచిప్పలవలనఁ గొనం జిమ్మినం బంది వోడిచినగతి నాపాదచూడంబు గానొదవినక్రొంగంట్ల నుడుగక వెడలుక్రొన్నెత్తుటన్ జొత్తిల్లి త్రెళ్లి జొత్తుపాపల విడంబించుచక్కట్లును, జోరువ గని తఱిసి గండ్రగొడ్డండ్ర ఖండించినం గీలెడలినజంత్రంబులక్రియ నడుములు దెగి యపరభాగంబు లున్నయట్ల యుండ నూర్ధ్వభాగంబులు జాఱినవంకలును మఱియుఁ గుంతతోమరశరశక్తిముసలగదాపట్టసప్రాసపాశభిండివాలశూలప్రముఖప్రహరణ ప్రహారంబులం గన్ను వెన్ను డొక్క పిక్క కాలు వ్రే లనుభేదంబు సేయరాక కలిపి క్రుమ్మినగతిం దఱిగి మెదపిన తెఱంగునం గుడిచి క్రక్కినచందంబునం బగిలియు నొగిలియు దునిసియుం దుమురయ్యుం గండలు నెత్తురుంబ్రేవులు మెదళ్లును గలయంబడి పేరి పేరెండతాఁకునఁ గరంగి నిగ్గు తేఱుతావులును, వెండియు నొండెడలం గుంభముక్తముక్తాఫలశర్కరిలంబు లగు సేనికమెదళ్లు కెళ్లుకొనియు నమలి చవి గొన లేక మరల వెడలఁ గ్రక్కుడాకినీగణంబులును, మాంసంబులే పెరిగి మిసమిసలు వారుమృతసామంతజనంబుల పెన్నురంబు లన్నినం గవిసి కబళించి యంతర్మగ్నభగ్నంబు లగునస్త్రిభంగంబు లంగుళ్ల నాటిన మిట్టిపడి వెరదేఱనోళ్లు విదిర్చికొనుచుం బారుభూతవ్రాతంబును, రక్తపానమదోన్మత్తంబు లై ద్వీపరదనఖండంబులం దురంగవదనంబులు చేర్చి కిన్నరాకారంబులు పన్నియు గజవక్త్రంబులు గూర్చి గణపతిప్రతిమలు సేసియు నొక్కొక్కటం బెక్కుతలలు హత్తించి చతుర్ముఖషణ్ముఖాదిరూపంబు లొనర్చియుం బరితఃపతితమృతవీరుల తనుత్రాణశిరస్త్రాణభూషణవస్త్రవిశేషంబుల యథాతథంబులుగాఁ బూన్చి మాతంగతురంగశవంబు లారోహింపించి లె మ్మనుచు నార్చి మోదియు వినోదించుపిశాచలోకంబును, నిజముఖాగ్రఘట్టనంబులచేతం బ్రహారవశంబునం గప్పినమూర్ఛలు దెప్పిరిలి కొఱప్రాణంబులతోఁ బొరలువీరయోధులపై మూఁగుచు విరియుచుఁ జిట్టుముట్టాడుకాకోలూకాదివిహంగసంఘంబులును, శతమతిం బతితకేతనబిరుదప్రతిమలం గదిసి పసిగొనం గదలిన నెదిరి ఝంకించుట గా శంకించి వెనుక ద్రొక్కునక్కపదువులుం గలిగి, మహాప్రళయంబునుం బోలె సర్వతఃకబంధబంధురంబును, దివసావసానసమయంబునుంబోలె వియుక్తరథాంగసంఘంబును, నంధకారంబునుంబోలె హతసహస్రాతపత్రంబును, మత్తురాజ్యంబునుంబోలె విధ్వస్తసమస్తధర్మంబును, గుకవికవితయుంబోలె భగ్నోరుప్రాసంబును, శూన్యపురంబునుంబోలె శిథిలపరిఘాకులంబును, వార్ధకంబునుంబోలె భిన్నగదాసంకులంబును, అవగ్రహంబునుంబోలెఁ బ్రశాంతనిశ్శేషవాహినీసంకులంబును నై సంగ్రామరంగంబు చూపఱకు వెరపు వెరగు వెక్కసపాటు నొదవించె నయ్యవసరంబున. 197

గీ. బలము లడఁగినఁ దమ కెదుర్పడఁగఁ దెరపి, గలుగుటకుఁ బొంగి యార్చి శంఖంబు లొత్తి
తాఁకి రెక్కటిరెండుమొత్తములు దొరలు, నోర్చి ఫణిపతితలలు నుఱ్ఱూఁత లూఁగ. 198

క. కడపడక కూలుగొడుగులుఁ, బడగ్గలుఁ జామరలుఁ గలయఁ బడి మూర్ఛితు లై
పడియెడుతారలకును ము, న్నొడఁగూడెడు మెత్తపఱపునొఱపు వహించెన్. 199

గీ. యోధవరులయొడళ్లు పె ల్లుబ్బి పాఱి, తన్నుఁగట్టినతూపులతఱుచువలన
నెత్తురులఁ గొమ్మెదల్లు మునింగి సమర, ధరణి గరుపాఱియున్నవిధంబు సూపె. 200

క. ఈరీతి నుభయబలములు, పోరాడఁ గఁ దత్ప్రతాపములు సూచి మదిం
గూరినలజ్జఁ బ్రతాప, ప్రారంభం బుడుగునట్లు భానుఁడు గ్రుంకెన్. 201

క. అనిఁ దెగువీరులు దివికిం, జనుచుం దనుఁ జించికొనుచుఁ జనఁ జనసంధ్యా
ఘనదీప్తిరుధిర మొలుకఁగ, ననువతి యినుఁ డస్త శిఖరి నల్లన సోలెన్. 202

క. కదనమునఁ గినియుశూరుల, వదనంబులఁ బదనుగొనుచు వడి నాకసమున్
బొదివెనొకొ ? సమరశోణిత, సదమలరుచు లనఁగఁ బర్వె సాంధ్యమరీచుల్. 203

గీ. భానుకులముఖ్యుబలముపైఁ బగఁ దలంచి, తననిశాచరవరులబాంధవము దలఁచి
పోర నోడింప గెలిపింపఁ బూనికాదె ?, పర్వె నన నిర్లు దట్ట మై పర్వుటయును. 204

వ. అట్టియెడం బ్రళయసమయంబున విడివడినమహావలాహకంబునుంబోలె దిశావలయం
బద్రువ గర్జిల్లుచు నిజతనుచ్ఛాయాచ్ఛటాస్ఫురణంబునం జిమ్మచీఁకటి రెట్టింపం గుటిల
చటులదంష్ట్రాఘట్టనంబులం జిటులువిస్ఫులింగంబులు విద్యోతమానఖద్యోతంబులకుం
బ్రాపు చూపం గఠోరహుంకారభయంకరంబు లగుచుం గులాచలమహాగుహాకుహరం
బుల విడంబించువదనగహ్వరంబులఁ గంఠపర్యంతంబుగాఁ దెఱచి యెదిరించువీరులం
బట్టి విఱిచి వైచుకొని మ్రింగుచుం బొంగుచుం బ్రహస్తమహాకాయప్రముఖప్రధాన
వర్గంబును నగ్నికేతురశ్మికేతువిరూపాక్షాదిబలాఢ్యులు నింద్రజిదతికాయదేవాంతక
నరాంతకప్రభృతికుమారులును మున్నుగా నసంఖ్యేయు లగుయాతుధానవీరు లేచి త్రోచి
హాలాహలానలం బుద్వేలనంబు చూపురూపునఁ గవిసి నిజమాయావిజృంభణంబుల
మహార్ణవంబు వెల్లి విరియించియుం బ్రళయానలజ్వాలాకలాపంబులం జొట్టుకొలిపియుం
గ్రూరోరగపాశంబులం గట్టువఱచియు నఖండగండశిలావర్షంబు లొండొండఁ బయిం
గురియించియు మఱియు ననేకంబు లగుమిథ్యామహోత్పాతకల్పంబుల భ్రమియించి
గుండియ లవియించినం జెదరి బెదరినసజ్జనవచనంబులునుం బోలె మఱుగు లేక సాధు
జనంబునుంబోలె నొక్కం డొకనితెరువు వోక యామినిశ్రిన్నలునుంబోలెఁ బరువు
మిగిలి యమ్మహీనాథుయోధు లాయోధనంబు మఱచి వెఱచఱచి దైన్యంబుల తోడన
కైదువలు విడిచి యొండొరుం గడచి విజయశంఖనాదంబులతోడం బిశితాశనవీరు
లార్చుచును వెనుకం దలలు వీడం బఱచిన. 205

## మాంధాత రాక్షససైన్యముపై విజృంభించుట.

శా. కించిద్భ్రూకుటిఫాలవీథి మెలయం గింక న్మహీభర్త దో
రంచచ్చాపగుణధ్వను ల్చెలఁగ బాణౌఘంబుచే యామినీ



సంచారోద్ధతు లైనరక్కసుల నాశ్చర్యంబుగా వేల్మిడిం
జించెం ద్రుంచె వధించె నొంచె నొలచెం జెండాడెఁ జండాకృతిన్. 206

క. మిడియుతల తునియునడుమును, బడుతొడయును విఱుగుకాలు పగులుతనువు లై
బడలువడి యసురబలములు, పొడ వడఁగె న్విభునిబాణములవెల్లువలన్. 207

క. పరహృదయకమలభేదక, శరకిరణసహస్రకర్కశం బై మనుజే
శ్వరకరవలయిత మగువిలు, పరికింపఁగఁ దత్ప్రతాపభాస్కరుఁ డయ్యెన్. 208

క. కనుఁగొన నొకఁ డయ్యె మహా, త్యనుమిత మై నైక మయ్యె నధిపతి తెగ రె
క్కినతూపు తీవ్రభావం, బున దీపజ్వాలవోలె భువనాద్భుత మై. 209

## మాంధాతృరావణు లొండొరుల నధిక్షేపించుకొనుట.

మ. అవి యెల్లం గని రావణుండు లయకాలాగ్నిక్రియ న్మండుచుం
బదిదిక్కు ల్పదినోళ్లచేతఁ గబళింపం జూచుచందంబునన్
వదనౌఘం బవు డట్టహాసరచన వ్యాలోలజిహ్వాభయ
ప్రద మై యుండఁ గ విస్ఫులింగములు నేత్రశ్రేణి వర్షింపఁగన్. 210

క. నిలు నిలు నృప! నీ వగుదువు, బలియుఁడ! నీబీర మెల్లఁ బదిలపఱపు నీ
పలలములు నీకు నోడిన, పలభుక్కులమునకుఁ బంచి పాలిడువాఁడన్. 211

గీ కాదు వో వేగునాఁడు ముక్కంటితోడ, వెండికొండయు నాభుజాదండమునకు
దురము గఱువౌట నైన ప్రాఁద్రుప్పుతోడి, చంద్రహాసంబురీతి నో జనవరేణ్య ! 212

క. బలిభిత్ప్రభృతు లెదుర్పడ, బలవంతులు గామిఁ బ్రాఁతవడినకృపాణం
బులు గడుగువాఁడ నిదె నీ, గళరక్తముచేత నేఁడు ఖరకరవంశా ! 213

గీ. అనినఁ దద్వచోనిలాహతిఁ గోపాబ్ధి, వెల్లి విరిసి నెఱసి వేల ముంచి
తొట్టి మెఱయునురుగుదెట్టువవోలెఁ గె, మ్మోవిఁ జిఱుతనవ్వు మొలకలెత్త. 214

క. తనుఁ దానె పొగడుకొను టిది, ఘనమతులపథంబు గాదు కైదువచేతం
గొనియుండియు నసురాధమ! పనిమాలిన రజ్జు లాడఁ బౌరుష మగునే. 215

వ. అనిన మగులం గోపించి. 216

## మాంధాతృరావణుల ద్వంద్వయుద్ధము.

క. ఒకవింటికిఁ బదివిండ్లను, బ్రకటించినఁ గాదు నాకుఁ బంతము పరిపం
థికిఁ బెంపొసగుట యని వి, ల్లొకటనె దనుజేంద్రుఁ డేసె నుగ్రాస్త్రంబుల్. 217

మ. అవి దోడ్తోఁ దునుమాడి భూపసుఁడు నుగ్రాకారుఁ డై శింజినీ
రవ మాశాంతరముం జెవుడ్పఱప నారాచంబు లొక్కుమ్మడిం
గవియింపం దశకంఠుఁ డద్భుతరసక్రాంతాత్ముఁ డై హస్తలా
ఘవ మగ్గించి తదీయబాణనివహంబుల్ ఖండింపరా కుండుటన్. 218

క. ఒండువిలు సాలమిని వే, ఱొండొకవి ల్లెత్తి చాలకుండినఁ బైఁ బై
నొండొండఁ బూనఁ గార్ముక, దండంబులు పదియు నయ్యె దశకంఠునకున్. 219

క. వదలక విభుఁడును వివిధ, ప్రదరంబుల వెల్లిగొలుపఁ బటు వగుదీప్తుల్
పొదిగొన్నవేళ నింగియుఁ, దుది నేమని చెప్ప నంపదొన యై తోఁచెన్. 220

సీ. భూరితరంగితాంభోధి యై కను పట్టు నురగకులంబుచే నొక్కమాటు
నికటకాంచనరాజీవకషోపలముఁ బోలు, నురుగరుత్మత్కాంతి నొక్కమాటు
కాచపాకక్రియాకరపటీరముఁ బోలు, హుతవహజ్వాలల నొక్కమాటు
చటులమహావటక్ష్మారుహంబును బోలు, నుదకధారలచేత నొక్కమాటు

గీ. నభము చూపఱ కిట్లు మాంధాతృమనుజ, నాయకుండును రాక్షసనాయకుండు
నిగిడ పన్నగమారుతాగ్నేయవారు, ణాదిదివ్యాస్త్రములఁ బోరునాహవమున. 221

ఛ. ఉడుగక పెద్దకాల మిటు లొండొరు గెల్వఁగ లేక కోపము
ల్విడువక పోరిపోరి తుద వేసరి దైత్యుఁడు చంద్రహాసముం
బుడమి విభుండు పాశుపతము న్వడిఁ బూనిన మ్రొగ్గె దిక్కరు
ల్జడధులు ఘూర్ణిలెం బెకలె శైలము లల్లల నాడె లోకముల్. 222

## శివుఁడు ప్రత్యక్షమై యుద్ధమును మాన్పుట.

గీ. అంధులై చేయునది లేక యసుర లింకఁ, ద్రుంగెఁ బో విశ్వ మింతటితోడ ననఁగ
నంతలోనన వారలయంతరమున, నలికనేత్రుండు ప్రత్యక్ష మగుచు నిలిచె. 223

శా. ఓహో! చాలుఁ బురే! మహాహవము మీ కొండొక్కరుం దక్కఁగా
బాహాహంకృతి యొందు వేఱ సరి చెప్పం గాన మీ విశ్వని
ర్దాహక్రీడకు మిమ్ముఁ బంపిడితి నే? తప్పయ్యె మీ కీజగ
ద్ద్రోహం బేటికిఁ బొందు మీరిరువురుం దుల్యప్రభావాధికుల్. 224

గీ. అనిన హరునియాజ్ఞకు సురేంద్రుఁ డట్లుకా, సమ్మతించె విభుఁడు సమ్మతిలక
యహితుమీఁదికోప మారక భువనంబు, తలఁక భవునిఁ జూచి పలికె నపుడు. 225

క. నిను దశశిరములఁ బూజిం, చినవాఁ డని కాదె వీనిఁ జేపట్టితి? వే
నును నీమది కెక్కినయీ, తనితలలం ద్రుంచి నిన్నుఁ దగఁ బూజింతున్. 226

వ. అనుటయు. 227

## శివుఁడు మాంధాతకు విజయము నొసంగుట.

ఉ. మెచ్చి హరుండు రాజ! వినుమీ యొకమాట మదంఘ్రిభక్తిసం
పచ్చరితార్థుఁ డీయసురభర్త నిసర్గబలాధికుండ వీ
విచ్చితి నీక యజ్జయము నింతియ కాదు వరంబు నొక్క పే
రిచ్చితి నిన్ను నెవ్వఁడు జయింపఁడు పొమ్ము జగత్త్రయంబునన్. 228



గీ. అని విభుండు సేయువినయంబు గైకొని, పోయె హరుఁడు చిన్నఁబోయె నసుర
విజయశాలి యపుడు విజయకాహళములు, మొరయ నాత్మసైన్యములు భజింప. 229

## మాంధాత హిమవంతము నెక్కుట.

ఉ. హేలమెయి న్మహీరమణుఁ డెక్కెను నిశ్చలనమ్రదేవతా
నాలము గంధరస్థసురచారణదంపతిగానవీచివా
చాలముఁ దుంగశృంగతటసక్తమణీపునరుక్తతారకా
జాలముఁ బారిజాతవనసంస్థితిమూలము హేమశైలమున్. 230

వ. మఱియు నమ్మహామహీధరంబు తారకితనభోభాగంబునుం బోలెం బ్రతిఫలితోత్తుంగ శృంగతరుప్రసవపరంపరావిరాజితంబు లగువిశాలహరినీలవప్రస్థలంబులచేతను వప్రస్థలంబుల వ్రేలుచు మొదలం గులిశఖండితంబు లైనపట్లం గ్రమ్మఱ నిగిర్చి మొలచిపొలుచు పక్షశ్రేణియుంబోలెఁ గనుపట్టు నవీనధారాధరంబులచేతను, ధారాధరంబుల మదాంధసింధురంబు లనురోషంబున ఘోషింపుచుం బయింబడ నుఱికి నిజనిపాతవిశీర్ణగర్భంబు లగునయ్యంబుధరగర్భంబులు దొఱఁగి ధాతుస్థలంబులం బొరలి పాఱునీరంబు లరక్తపూరంబులం బ్రోవు లై గానంబడువడగండ్లు కుంభనిర్ముక్తముక్తాఫలంబులుగాఁ దలంచి గర్జించుసింహకిశోరంబులచేతను, సింహకిశోరంబులజాడలు వెనుకొనుభిల్లపల్లవాధరధనుర్గుణక్వణనంబులు గుహాముఖంబులం బ్రతిశబ్దంబులు చూప మేఘగర్జితంబుల నుత్కంఠంబు లై యాలకించునీలకంఠంబులముఖంబులం గబళితవాలంబు లై వ్రేలెడుఫణులఫణామణులు మ్రాకులకులంబులకు దివియ లై వెలుంగఁ జీఁకటి యెఱుంగనిదినకరకరనికరదురధిగమవనీగర్భంబులం గ్రీడాగృహంబులును మఱియుఁ బ్రతిరాత్రంబును వెన్నెలలం గఱంగునుపరిచంద్రకాంతంబులజలంబులు పయిం దొరఁగఁ దట్టి ఘర్షణంబునం జలితపటీరతరుశాఖలవలన జాఱి క్రిందమృగనాభిన్యగాధ్యస్తవిస్తీర్ణశిలాతలంబులు గుప్పలుగొని తత్పరిమళమిళితంబు లైనచందనపంకంబు లనులేపంబులను వెండియు నర్కకిరణసంపర్కంబున సూర్యకాంతంబులం జిటిలెడునలకణపరంపరలసోఁకువం బరిసరమదకరిభగ్నకాలాగరుతరుకాష్ఠంబులవలన నెగసి పరిభ్రమచ్చమరీమృగవాలవీజనవశంబునం గలయ విరిసి నెరసి కమ్మతావులు బుగులుకొనునునుఁబొగధూపంబులు గొనఁ బ్రయత్నసిద్ధోపచారంబు లుద్దీపనంబుం గొలుప నిచ్ఛావిహారంబులం గ్రీడించుకిన్నరమిథునంబులచేతను, గిన్నరమిథునంబులు మధురగీతికలం గరంగునుపలకులంబులజలంబులు గూడి యేఱు లై ప్రవహింప నిమ్నోన్నతస్థలపతనావసరంబులం బెల్లెగసి గగనలక్ష్మీశిరంబున నచలపతి తననిం మసేసఁ బ్రోలిచందంబున నందంబు లగుజలకణాసారంబులచేతనుం గన్నులపండువు సేయుచు, భగవంతుండునుం బోలె భృగుపాదలక్ష్మీతోత్కర్షంబును, జతుర్ముఖుండునుంబోలె హంసోపరివిలసితంబును, శంకరుండునుం

బోలె నిజమూర్ధన్యంతర్గతచంద్రంబును, బురందరుండునుంబోలె నధఃకృదభీష్టవృష్టిద మేఘంబును, ఐరావతంబునుంబోలె నఖండగండస్థలప్రమదాపాదకంబును; శబ్దశాస్త్రంబునుంబోలెఁ బ్రకటితధాతువిశేషంబును,చార్వాకసిద్ధాంతంబునుంబోలెఁ గూటయుక్తిప్రతిషిద్ధాకాశంబును నై వెండియు నొండుచందంబున భీమసత్వసంపన్నంబయ్యును గీచకకులవర్ధనకారణంబును, గుహాశోభితం బయ్యును దారకాసురవిహారోచితస్థానంబును, బహుకోటివజ్రవిజృంభితం బయ్యును గరుత్మదుపలకలితంబును,నిరంతరచంద్రకాంతం బయ్యును బద్మరాగపరభాగస్ఫురితంబు నగువిచిత్రశోభాస్పదం బగునన్న
గోత్తమంబునం గలుగువివిధవిశేషంబుల కరు దందుచు నుత్సాహంబున. 231

## మాంధాత మందరముపై జయస్తంభముల నాటుట.

క మేరునగ మెక్కి యటఁ జని, యారాజశిరోవతంస మటఁ గాంచె సుధా
ధారాపాతక్షాళిత, రారాజత్కనకకందరము మందరమున్. 232

సీ. కస్తూరికామృగీకర్ణజపంబులఁ, నిర్ఝరీనివహపాణింధమములు
బహుమహీజపరాగపశ్యతోహరములు, ఫణిమిథునప్రియంభావుకములు
శబరసతీరతిశ్రమతాళవృంతముల్, వంశసారస్వతావాపకములు
చమరవాలసమీరసద్బృష్మావాదులు, తతబర్హిబర్హసంధాయకములు
తే. కుంజవిహృతికళాభద్రకుంజరములు, మందరాచలవనమందమారుతంబు
లెదురుకొన నమ్మహాగిరి యెక్కి యందు, జనవరుఁడు నిల్పె నిజజయస్తంభపటలి. 233

వ. ఇట్లు స్వర్గపురప్రాంగణక్రీడాశైలం బైనమందరమహీధరంబుపయిం జయస్తంభంబు వేసిన. 234

## మాంధాత్రుఁ డింద్రపూజితుఁడై పురంబు చేరుట.

ఉ. విస్మయమగ్నుఁడై యటకు వృత్రహరుం డరుదెంచి భూవిభుఁ
సస్మితసాధువాక్యరచనం బ్రియ మాడి విరోధి మండలీ
ఘస్మరి నీకు నీడు త్రిజగంబుల లే రని యెన్న నేల ? శౌ
ర్యస్మయరేఖ రావణమహాసురుఁ గెల్చితి వాజి నెక్కటిన్. 235

తే. అనుచు నగ్గింపఁ బూజించి యనుప మరలి, ఖేచరీగీతవిఖ్యాతకీర్తి యగుచు
విజయవాదిత్రములు మ్రోయ నిజపురంబు, వేడ్క మెయిఁజొచ్చి పాలించె విశ్వధరణి.

## ఆశ్వాసాంతము.

ఉ. పూతవిహార హారరుచిపూరితరంగితవత్స వత్సల
త్వాతిశయాత్మదా వినయదాంతికగోచర గోచరాంగనా



జాతపయఃపురోహరభుజంగ భుజంగశయాన యానలీ
లాతురగోత్తమక్రమవిలంఘనచంచలకుండలాంచలా. 237

క. గోవర్ధనధృతిదర్శిత, గోవర్ధన నిజఘృణానుగుణసజ్జనబృం
దావన పదపాలితబృం, దావన సంశ్రితకృతానుధావనచరితా. 238

స్రగ్విణి. సమాశ్రితవిశేషణా సమతవిద్విషద్భీషణా
సమాయతచతుర్భుజా సమరరంగభూభృద్భుజా
నమఃపతపరాయణానతజనార్తిజంబాలకూ
లముద్రుజఘృణాసుధాలహరిఘూర్ణమానార్ణవా. 239

గద్య. ఇది శ్రీ మద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహసేవకోపసేవక నరసింహనామధేయప్రణీతం బైనకవికర్ణరసాయనం బనుకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.




# తృతీయాశ్వాసము.





రంగవలయరూఢా
ధారమహీరుహ సమ స్తధరణీతరుణీ
హారాయమానవిమలక
వేరసుతామన్మఖచితవిమలేంద్రమణీ. 1

వ. ఇట్లు విశ్వదిగ్విజయంబు సేసి మాంధాతృమహీమండలేశ్వరుండు జగత్పూజ్యంబు
గా రాజ్యంబు సేయు చున్నకాలంబున. 2

## మాంధాతకడ కిరువురు చిత్రకారులు వచ్చుట.

క. చిత్తరువు వ్రాయ నేర్చిన, యుత్తమశిల్పకులు వచ్చి యొకయిద్దఱు భూ
భృత్తమనుఁ గాంచి యవ్విభు, చిత్తము రంజించి రాత్మచిత్రక్రియలన్. 3

క. మెచ్చి తమ కమ్మహీవరుఁ, డిచ్చుపదార్థంబు లొల్ల కే మిచ్చటికిన్
వచ్చుటకుఁ గారణము గల, దిచ్చం గృప సేయవలయు నేకాంతంబున్. 4

వ. అనిన ననుగ్రహాతిరేకంబునం గార్యజిజ్ఞాసాకుతూహలంబున నట్ల యేకాంతం బొసం
గిన వార లిట్లని విన్నవించిరి. 5

## చిత్రకారులు విమలాంగివృత్తాంతముఁ దెల్పుట.

క. కుంతలపతికిం గల వలి, కుంతల విమలాంగి యనఁగఁ గూఁతురు రజనీ
కాంతునిపదియేడవకళ, కంతునియాఱవశరంబు గణుతింపంగన్. 6

గీ. రత్నపుత్రిక వోలె నారాజకన్య
పుట్టినప్పుడ యొకమహాద్భుతపుఁగాంతి
నుదయ మందినఁ గనుఁగొని యుచిత మగుటఁ
దండ్రి విమలాంగి యనుపేరు దాని కిడియె. 7

గీ. కన్య యై మా కొకానొకకారణమునఁ, గలిగె నది దేవతామూర్తి గాని మనుజ
జాతి గాదని బహుమానసహితమతులఁ, దల్లిదండ్రులు పెనుప నత్తన్వి పెరిగె. 8

క. కుందనము గమ్మవలపుం, జెందెడుచందమునఁ దెల్లచెఱకునఁ బం డై
సుందరి యగునక్కన్నియ, యం దెలప్రాయంబు విడువ నాయత మయ్యెన్. 9



## బాల్యయౌవనసంధివర్ణనము.

క. తొడరియుఁ దొడరనిసిగ్గున, బొడమియుఁ బొడమనియురోజములఁ జాపలమున్
విడిచియు విడువనినడపులఁ, బడఁతుక పై నూఁగునూఁగుఁ బ్రాయం బయ్యెన్. 10

చ. దివసముపోలె శైశవము దీఱఁగఁ బ్రాయపురేయి దోఁచుచో
నవకపుమోవికెంపునఁ గనంబడియెన్ నెఱసంజవోలె న
క్కువలయపత్రనేత్ర నవకుంతలబాల తమోవితానముల్
గవియఁగఁ దానఁ బో మరునిగర్వము దుర్వహ మయ్యె నయ్యెడన్. 11

చ. గురుకుచకుంభసంస్థితికిఁ గూడె నురంబున నాలవాలముల్
పొరసెఁ గురుల్ ముఖాబ్జమునఁ బొడ్మెడుతావికిఁ జేరుతేఁటు లై
గరువపుఁజూపు లోరసిలెఁ గన్నులక్రేవను సిగ్గెలర్ప నా
వరనృపకన్యయం దభినవంబుగ జవ్వన మంకురింపఁగన్. 12

చ. విరివియె కాని పైపొడవు వెల్వడ కుండెడుపూఁపచన్నులన్
సరవియె కాని దంతురత చాలనిసన్నపుము త్తరంగలన్
దరళవిధంబె కాని నిశితత్వ మెఱుంగనిక్రొత్తచూపులన్
సరసిజనేత్ర పొ ల్పెసఁగె శైశవయౌవనసంధిఁ జూడఁగన్. 13

సీ. విస్తారవిలసనప్రస్తావనలు దోఁచె, సరవిఁ దటప్రదేశములయందుఁ
గ్రమముతోఁ దల లెత్తెఁ గడకంటిచూపుల. యందుఁ గౌటిల్యమూర్వాంకురములు
సరస వైదగ్ధ్యరసాయనోదయమునఁ, బలుకు లొయ్యొయ్యన పదనుకొనియె
నురముపైఁ జెక్కి పయోధరంబులు చేసె, లాలితోద్భేదకోలాహలములు

తే. నవయవంబులు గై సేఁత లభిలషించెఁ, జెవులు సంభోగవార్తలచవులు మరిఁగె
జనవరాత్మజ కంతను శైశవంబు, వీడి క్రొత్తగఁ బ్రాయంబు గూడునపుడు. 14

వ. అంతఁ గ్రమక్రమంబున. 15

## నవయౌవనవర్ణనము.

మ. స్మరశాతాసివిలాసపుష్పమధుమాసం బక్షవృత్తిస్వయం
వర మాలోకనభాగధేయము మదస్వాతంత్ర్య మవ్యాజల
బ్ధరహఃకేళికళామనోరథలతోపఘ్నంబు నారోపితా
భరణప్రాయము ప్రాయ మయ్యువతిపైఁ బ్రాదుర్భవం బొందినన్. 16

చ. కవగొని నిల్చె పేరనఁటికంబము లయ్యె మృదూరుకాండముల్
గువలయతోరణావలినిగుంభన మయ్యెఁ గటాక్షవిభ్రమం
బవిరళపూర్ణకుంభయుగ మయ్యె విరాజదురోజయుగ్మ మ
య్యవనిపకన్యయందు నవయౌవనలక్ష్మిసమాగమంబునన్. 17

సీ. ప్రథమహాలాహలప్రథమానకీల లై, మీఁచెఁ గ్రూరకటాక్షవీక్షణములు
దరహాసచంద్రికాంకురములు నల లెత్తె, నుదితేందుబింబ మై యొప్పె మొగము
సముసముద్భగ్నవాసవకుంభివరకుంభ, యుగ్మ మై కుచకుంభయుగళి దోఁచెఁ
బ్రకటసుధాపూర్ణరత్నకుండిక యయ్యె, నరుణాభ మై మధురాధరంబు
గీ. విశ్వమోహనలీల నావిర్భవించె, మదనజగదేకపూజ్యసామ్రాజ్యలక్ష్మి
సతి పయోనిధి యై యున్న శైశవంబు, మహితయౌవనమంధానమథిత మైన. 18

చ. ఉరుతరవజ్రకర్కశతయుం గుధరోన్నతియుం గుచంబులన్
సరసిజసద్వికాసమును జంద్రవిలాసము నెమ్మొగంబునన్
గరికరలక్ష్మియుం గదళికాతరువిస్ఫురణంబు నూరులం
బొరయుట చిత్రమయ్యె నృపపుత్త్రిక కాయెలజవ్వనంబునన్. 19

ఉ. కన్నులఁ జంచలత్వమును గ్రౌర్య మపాంగవిలోకనంబులం
జన్నులఁ గర్కశత్వముఁ గృశత్వముఁ గౌనున మందభావము
న్నెన్నడ వక్రతం గురుల నెక్కొనఁ జేసియు నెట్టిచిత్రమో?
కన్నియజవ్వనంబు త్రిజగజ్జనసన్నుత మయ్యె నయ్యెడన్. 20

ఉ. నీరజసూతి దీనితనునిర్మితకాలమునందు డించినం
గారు మెఱుంగు లయ్యె నునుఁగాంతికి గీసినయట్టిపైపొరల్
సౌరభహీనభాగములు సంపఁగిక్రొవ్విరు లయ్యె మార్దవ
శ్రీరహితాంశము ల్నవశిరీషము లై విలసించె ధారుణిన్. 21

ఉ. కారుమెఱుంగు లయ్యె నునుఁగాంతికిఁ బైపొర గీసివేయ బం
గారవు లయ్యెఁ జేసె గలఁగఁదినపల్లటుత్రోవఁ జంపకా
కారము లయ్యెఁ గర్కశత గల్గినపట్లటు వ్రేయ దీని న
న్నీరజసూతి సేయు నెడ నిక్కమ నాఁ దను వొప్పె నింతికిన్. 22

చ. కమలము మోమునందు నొకకన్నులమాత్రముఁ బోల దన్నచోఁ
గమలవిరోధియందు నొకగండతలంబును బోలఁ డన్నచోఁ
గమలముఁ జందురుండు సరిగా రని వేఱ గణింప నేటికిన్
రమణిదరస్మితేక్షణతరంగితమోహన మైనవక్త్రమున్. 23

చ. తరళగతిద్యుతిచ్ఛటలఁ దమ్మికొలంకులు సేయుదిక్కులం
గురియఁ గటాక్షపాతములఁ గోణముల న్మదనాస్త్రవర్షముం
గురువపుఁజూపులం గొలుపుఁ మెరుంగులు మింటసాటియే
తరుణి విలోకనమ్ములకుఁ దమ్ములు నమ్ములు గ్రొమ్మెఱుంగులున్. 24

గీ. మహితకటిచక్రవక్షోజమండలంబు, లప్పు డక్కృశసమృద్ధిచే నతిశయిల్ల
సంతతక్షామ మిం దెట్లు సంభవించె, నాఁగ మధ్యప్రదేశంబు నాతి కమరె. 25



గీ. ఒత్తుకొనివచ్చుకటి కుచోద్వృత్తిఁ జూచి, తరుణితనుమధ్య మెచటికో తలఁగి పోయె
నుంకొ నేనియుఁ గనఁబడ కున్నె యహహా! యున్నతులమధ్యమునఁ బేద యుండఁ దరమె.

సీ. అవనిపై నుండుఁ గా కనఁటికంబము లెట్లు లనఁటికంబములపై నవని నిలచె?
గగనంబు గిరులపైఁ గనుపట్టుఁ గా కెట్లు గగనంబుపై గిరు ల్గాన నయ్యె?
జలధరంబులమీఁద శశియుండుఁ గా కెట్లు శశిమీఁద నున్నది జలధరంబు?
నాళంబుపైఁ గాక నలినకోశం బెట్లు నలినకోశంబుపై నాళ మున్న?
గీ. దనుచుఁ జూపఱులకు విస్మయంబుగొలుపఁ, దొడలుఁ గటిమండలంబును నడుముఁ జన్ను
లాననముఁ గొప్పు నాభియు నారుఁ నలర, నలరె విమలాంగి నవయౌవనాగమమున.

ఉ. త్రాసునఁ దూఁపవచ్చు ముఖతామరసంబును నిండుచందురు
న్వాసి యెఱుంగరాదు మగవాలికమీలకుఁ గన్నుదోయికి
న్వాసము దప్పు లేదు నెరివేనలికిం జిఱుఁదేఁటిదాంట్లకుం
దోసము గాదె యయ్యతివతోఁ బెఱతొయ్యలి నీడు సేసినన్. 28

చ. ఘనపథమధ్యనిర్భరము గా నుదయించి నిరుద్ధలోకలో
చనముగ సన్నికృష్టముఖచంద్రము లై శ్రితతారకంబు లై
యనయము కుంభసంభవమహాత్త్వవిజేతలు నాఁటఁ గన్యకా
స్తనములు వింధ్యముం దెగడి సాటికి హెచ్చినమేరుకూటముల్. 29

మ. స్మరసమ్మోహనమంత్రదేవత మనోజప్రౌఢసామ్రాజ్యల
క్ష్మి రమానందనభాగ్యరేఖ మరుక్రీడావనీపుష్పమం
జరి కామావరకీర్తి మన్మథపునస్సంజీవినీవిద్య నా
ధరణీశోత్తమకన్య యొప్పె విలసత్తారుణ్యసంపన్న యై. 30

వ. ఇట్లభినవతారుణ్యభువనైకకన్య యగునిజకన్యం గనుంగొని జయభద్రుండు దీనికిం దగువరుండు స్వయంవరంబునం గాని కలుగం డైనం గలహమూలం బగుట నది గా దని యత్యంతనిపుణులు నంతరంగులు నగు చిత్రకారుల నమ్ము రహస్యంబుగా నియోగించినం బసిపూని నేమును విచిత్రచిత్రకళాకౌశలవశంబున నిఖిలదేశాధిపతులం గనుంగొని యుపకృతుల మగుచు నందఱయాకారంబులు యథారూపంబును రహస్యంబుగాఁ బటంబులం జిత్రించికొని వచ్చి వచ్చి యక్కన్యాభాగ్యపరిపాకంబున నస్మదీయతపఃఫలోదయంబున నిన్ను నిట్లు సందర్శింపం గంటి మిటమీఁదివిశేషం బొకటి విన నవధరింపుము. 31

గీ. కన్య యది యెట్టు లాలోకకారి యట్ల
యీవు నతిలోకతేజోభిహితుఁడ వగుట

యుగళ మగుటకుఁ దగుట మీఁయొండొరులకుఁ
గాఁగల దిట్టుల యనియు నిక్కముగ నెఱుఁగ. 32

## చిత్రకారులు మాంధాతకు విమలాంగి చిత్రపటముఁ జూపుట.

క. దేవ! భవత్తేజము మా, భావంబుల నిట్లు బయలుపఱచుట కిట ము
న్నే వలనఁ బరు లెఱుంగరు, గావున నిత్తలఁపు దైవికమున ఫల మగున్. 33

ఉ. ఆసతిమేనుచెల్వుఁ గలయంత వచింపఁగ నేర మన్నచో
వ్రాసితి మన్న రాదె యపరాధము? పోలికమాత్ర చిత్రవి
న్యాసము చేసినార మిదె యంచుఁ దదాకృతిలేఖనక్రమో
ద్భాసిపటంబు విప్పి నరపాలునిసన్నిధిఁ బెట్టి చూపినన్. 34

క. నిను నెడఁ గరఁగినమనమున, యనమార్గంబున ప్రవించి యవయవములలో
నెనయుంగఁ జేరునట్లుగఁ, గనుఁగొనియె న్విభుఁడు గన్యకారూపంబున్. 35

సీ. కచభారరుచులఁ జీఁకటిఁ గొన్నయపరాధ మాననేందుద్యుతి నపనయించుఁ
గ్రూరకటాక్షము ల్గొన్నఁ బైకొనుమూర్ఛ నధరసుధారసం బాని తెలియుఁ
గుచశైలతటుల డిగ్గుచుఁ గొన్నకంపంబు త్రివళిసోపాన మూఁది విడఁ గాంచు
మధ్యకార్శ్యముఁ జూడ మదిఁ గొన్నకరుణంబు కటిబింబసంపదఁ గాంచి మఱచు
గీ. నూరుయుగలక్ష్మిఁ బాసి నా నొదవుతాప, మడఁచు బదపల్లవంబులయందుఁ బొరలి
రాజవరుదృష్టి కుంతలరాజకన్య, సుందరాకార ముత్కంఠఁ జూచునపుడు. 36

క. చనుఁగవ పొడవై నాభిం, గనుఁగొన నిమ్నమయి మఱియుఁ గటి పొడ వగునం
గనవిషమాకృతిపథమున, జనపతి మదిఁ దొట్రుకొనుచుఁ జాల పరించెన్. 37

క. వనితనతనాభిఁ దుంగ, స్తనములఁ గడచి చనలేవు జనపతిచూడ్కు
ల్తనమున నుయ్యో కొండో, యని యాందోళించువారి కగునే తెగువల్. 38

వ. ఇట్లత్యంతాసక్తుఁ డయ్యును ధీరనాయకుం డగుటఁ జిత్తవృత్తి బయలుపడనీక యి
ట్లనియె. 39

గీ. నిక్కముగ నిట్టిరూపంబు నెలఁత యొకతె, గలిగెనే బ్రహ్మనిపుణుఁ గాఁదలఁపవలదె?
కలిగ లేకుండె నిట్టియాకార మిట్లు, వ్రాయ నేర్చినమీనేర్పు వలయుఁ బొగడ. 40

వ. అని యుచితసత్కారంబులం బ్రీతులం జేసి వీడ్కొల్పిన వారును నిక్కార్యంబు సం
ఘటించి మఱికదా దేవరచేత మెచ్చులం బడయువార మని పంతంబు లాడుచు నిజ
దేశంబునకుం జనినయనంతరంబ. 41

క. చిత్రకళావంతులచేఁ, జిత్రపటము చన్న నైనచిత్రము హారిణీ
నేత్రం జిత్రించినత, చ్చిత్రపటం బయ్యె విభునిచిత్తం బంతన్ 42



## మాంధాత విమలాంగిని వలచుట.

సీ. భద్రేభకుంభసంస్ఫాలనక్రీడలఁ, దన్వంగికుచములఁ దలఁచి తలఁచి
కరకృపాణీసముత్కంపనక్రీడలఁ, దరలాక్షికన్నులఁ దలఁచి తలఁచి
ధరవైరిమణిహారధారణక్రీడలఁ, దరుణికుంతలములఁ దలఁచితలఁచి
సజ్యకార్ముకలతాసంగ్రహక్రీడల, లలనబొమ్మలతీరుఁ దలఁచితలఁచి
గీ. రుచిరతరభద్రపీఠాధిరోహణములఁ, జామరసనేత్రికటి పెంపుఁ దలఁచితలఁచి
యవనిపతి స్వపదార్థానుభవము లెల్లఁ, గన్యరూపానుభవముగాఁ గరఁగుచుండె. 43

వ. ఇట్లు నిరంతరచింతాతిశయంబునఁ దదాయత్తచిత్తుం డగుచు నృపోత్తముం డిట్లని
వితర్కించె. 44

గీ. చిత్రకారులరాకఁ జర్చింప నొక్క, దేవతామాయ గాదె యీత్రిజగదేక
సుందరాకృతిఁ జిత్రించి చూపు టెట్లు, చూచునంతన మఱి దగు లేమి టెట్లు. 45

వ. అని తలంపుపెంపునం జిత్రితవిచిత్రాకారక్రమంబు సంస్మరించి. 46

సీ. హరినీలములఁ జేసి యంధకారముఁ జేసి, మొలకతేఁటులఁ జేసి ముద్దుగుడిచి
మీనులఁ బుట్టించి మెఱుఁగులఁ బుట్టించి, శుక్తులఁ బుట్టించి సురుచిరాంగి
యాద్దము ల్నిర్మించి యమృతాంశు నిర్మించి, వనజము నిర్మించి వణఁకు దేఱి
గుచ్ఛము ల్సృజియించి కోకము ల్సృజియించి, కుంభము ల్సృజియించి కొంకువాసి
గీ. ప్రౌఢయై మీఁద నిర్మింపఁబోలు నలువ, కన్యకామణికురులు కన్నవయు మొగముఁ
జన్నుదోయియు నట్లు గాకున్న నిట్టి, యనుపమానాంగములు సృష్టియందుఁ గలవె!

వ. అని మఱియును. 48

సీ. మెట్లకుఁ దగ మిడ మెయికొంట యాయింతి, కుచముల ప్రతిఁ జూపఁ గోరు టెల్ల
ఖడ్గధారావ్రతగ్రహణంబు సేయుట, సుదతియా రుపమింపఁ జూచు టెల్ల
గగనారవిందంబుఁ గనుట యాసతిమధ్య, గతినాభితో సాటిఁ గాంచు టెల్ల
నంధకారముద్రవ్వు టాయింతికుంతలములసాటివెట్టంగఁ బూను టెల్లఁ
గీ. జందమామకు గ్రుక్కిళ్లు యిందువదన, వదనసామ్యంబు సేయంగ వాంఛసేఁత
పృథివికడ గాంచు టారామపిఱుఁదుతోడ, సదృశవస్తువు గను టన్నఁ జదు రెల్ల. 49

వ. అని వెండియు నిజమనోగతానురాగం బుపలక్షించుకొని. 50

సీ. బింబోష్ఠిముఖ మిందుబింబమై యుండ నా, డెందంబునకు నేల కందు గలిగె?
మగుదచన్నులు తమ్మిమొగ్గలై యుండనా, చిత్త మేగతిఁ బొందె మెత్తపాటు?
సతినితంబము రథచక్రమై యుండ నా, భావంబునకు నెట్లు ప్రాణ మొదవె?
నబ్జాక్షిపెందొడ లనఁటులై యుండ నా, యుల్లంబు లైసార్వ మొందు టెట్లు?

గీ. మగువజిగిమేను కుందనం బగుచు నుండఁ, గాఁకఁ గరఁగెడు నామనోగతు లి దెట్లు
వనితయవయవములఁగల్గువస్తుగుణము, చూపఱులయందుఁ బొరయుట చోద్యమొక్కొ?

వ. అని మఱియు రసాతిరేకంబున. 52

ఉ. మానము మాఱుమాట ముఖమండలమెత్తఁగనియ్య కొల్ల కే
పై నిగుడించునూర్పుప్రసభాచరణంబులకుం బ్రతిక్రియ
ల్గా నొనరించుచున్నపతికన్యక నూతనసంగమంబునన్
బానుపుపై మదీయభుజపంజర మెన్నఁ డలంకరించునో?. 53

చ. తమకము నాఁగి ముచ్చటసఁ దార్చి నెపంబున సోఁకి హస్తసం
గమమున కియ్యకొల్పుపులకంబులు మై నొదవించి వంచన
క్రమముల నొయ్యఁ బయ్యెదయుఁ గంపమున న్దొలఁగింపఁ బూన్కికిన్
సనుకొని సిగ్గు నీవియును జార్చి యెన నృపతిగూర్చు టెన్నఁడో! 54

చ. స్థిరమతి నీకు మేము మును చెక్కుల వ్రాసినపత్రభాగము
ల్వరుసయురంబున న్గలిగి వచ్చెఁ గదే విపరీతవృత్తి మీ
సరస రసప్రసక్తి నని చాయలఁ బాఱఁగ నాఁగు నెచ్చెలిం
గరకమలాహతి న్నిలుపఁ గన్నియ నెన్నఁడు ప్రోడఁ జేతునో! 55

క. అని మఱియుఁ బెక్కుకోర్కులు, బెనఁగొన నక్కన్యవలనఁ బ్రేముడివలన
న్మనుజపతి యంత నిపుణ, న్మనసిజశరశరధిసదృశమానసుఁ డగుచున్. 56

సీ. దొరల విమర్దంబుఁ బొరయుతల్పము దక్కఁ, గెలన నిద్రాహాని దెలియనీక
పదలెడుభూషణావలి దక్క నితరుల, మేనిపై కార్శ్యంబు గాననీక
మెనయయనియింద్రియంబులు దక్క నన్యులఁ, గ్రియలయం దరుచి లక్షింపనీక
తగవుమాలినకోర్కి దక్కఁ దక్కొరులకు, హ్రీపరిత్యాగంబు నెఱుఁగనీక

గీ. మలయపవమానచలనము ల్గలిగి యైన, దవ్వులకు నిశ్చలంబైనతరువుపోలె
మదనవికృతిక్రమాక్రమ్యమానుఁ డయ్యుఁ, బరుల కవికారుఁడై యుండెఁ బార్థివుండు.

వ. ఇట్లనుదినప్రవర్ధమానమనోభవదశావిశేషంబులవలన నమ్మహీపాలశేఖరుం డేటి కెదురేగుచందంబున దుర్భరం బైనకాలంబుఁ గడుపుచుండె నటఁ జిత్రకారులు కృతార్థమతి నతిత్వరితగతి నిజదేశంబునకుం జని తమరాక కెదురుచూచుచున్న నేలికం బ్రహృష్టహృదయుం జేయుచు నుచితగతిం గాంచి యేకాంతంబునఁ దమతెచ్చినచిత్రపటంబులు నివేదించి యందుఁ జిత్రించినవివిధదేశాధిపతులం గ్రమక్రమంబున వేర్వేఱఁ జూపి యిట్లనిరి. 58

క. దేవర యానతి నిఖిల, క్ష్మావరులన్ వ్రాసి యిట్లు సమ్ముఖమునకుం
దేవలసెఁ గాని పనిలే, దీవిస్మృతి మాకుఁ జూడ నిది యెట్లన్నన్. 59



### కుంతలేశునెడఁ జిత్రకారులు మాంధాతగుణముల వర్ణించుట.

మ. అరవిందప్రతిమల్లఫుల్లనయనుం డాజానుబాహార్గళుం
డరతోత్తాలవిశాలవక్షుఁడు సమగ్రాకారలోకైకసుం
దరుఁ డుల్లోకవిచిత్రతేజుఁ డిల మాంధాతృక్షమామండలే
శ్వరుఁ డాతం డొకరాజమాత్రుఁ డటె సాక్షాద్విష్ణుఁ డూహించినన్. 60

క. అతనిఁ గనుఁ గొన్నచూపుల, నితరమహీపతులు సృష్టి నెంతటితేజో
యుతు లేవి సూర్యుముందటఁ, బ్రతిదీపము లట్ల యతఁడు ప్రభుమాత్రుండే? 61

క. నీకన్య కతఁడు దగు నా, భూకాంతాగ్రణికి నీదుపుత్త్రికయ తగు
న్నాకుం దోఁచినమత మిది, టీకలు పదివేలు నేమిటికి నిప్పటికిన్. 62

క. అతిమానుష మైనతద, ద్భుతతేజము వ్రాసి చూపఁ బోల దతనియా
కృతిమాత్ర మచటఁ జిత్రిం, చితి మిదె యని చూపఁ జూచి చిత్తం బలరన్. 63

వ. కుంతలేంద్రుండును వారలు పలికినంతకు నిక్కం బగుటకు మెచ్చి పారితోషికం బొసంగి యనిచినపిదప విమలాంగికిం బ్రియవయస్యయుఁ బోడయు నగుపాలిక యనుశుద్ధాంతచారిణి రావించి నిజప్రారంభంబునుం జిత్రకారాభిప్రాయంబునుం దెలిపి తత్తద్దేశనగరనగనదీవిహారప్రదేశవిశేషంబులతోఁ గులగోత్రచరిత్రనామాంకంబులతో యథారూపంబులతో నిందుం జిత్రింపనిరాకుమారుండు సర్వంసహాచక్రబునం గలుగం డీనృపనందనసందోహంబు మదీయనందనడెందంబు గందళింపం జేసినయనురూపభూపకుమారునిం దెలిసికొని రమ్మని యాజ్ఞాపించినం బనిపూని చని యక్కుమారికకు నాసంతోషం బెఱింగించి యచ్చిత్రచిత్రపటంబు విప్పి చూపునపుడు. 64

ఉ. పాలిక చూపఁగా నవనిపాలతనూభవ నూచె దేశత
చ్ఛాలనదీవనీనగరసత్కులనామయశస్సనాథులం
గౌళకళింగవంగకురుకాశకరూశవిదేహచోళపాం
చాలవనాయుసింధుముఖసర్వమహీవలయాధినాథులన్. 65

### విమలాంగి మాంధాతం జిత్రపటమునఁ గని మోహించుట.

గీ. చూచి యెవ్వనిఁ గైకోక సుదతి యంతఁ, జూచె డెందం బెనసి యొత్తఁ జూడ్కి నాఁట
గుణవిని స్తంద్రు నుత్తరకోసలేంద్రు, నిరుపమాకారు యౌవనాశ్వనృపకుమారు. 66

శా. ఆకంఠప్రణయప్రమత్తము లపూర్వాశ్చర్యనిష్యందము
ల్సాకూతాయతపాతము ల్సుఖవిశేషాంతర్మహుర్ముగ్ధముల్
ప్రేంకోణాంచలచంచలాలసవశప్రీతిప్రసాదోదయ
వ్యాలోచంబులు నైనవీక్షణముల న్వామాక్షి నూచెం బతిన్. 67

మ. అనురాగాకృతికందకందళము భోగైకాంతసారంబు యౌ
వనసర్వస్వ మశేషవిభ్రమకళాస్వాంతంబు విశ్వైకమో
హనశృంగారరహస్య మంగజవిజృంభావాహనాగ్రక్షణం
బు నరేశాత్మజచూడ్కిఁ గ్రోలె నపు డాభూపాలసౌందర్యమున్. 68

ఉ. చిప్పిలుచెక్కులన్ జెమటచిత్తడులం గరపల్లవంబులం
గప్పుచుఁ జన్నుగ్రేవఁ బులకంబులు పయ్యెద నొత్తి యోరఁగాఁ
ద్రిప్పినమోము వంచి జగతీవరుచిత్ర మపాంగదృష్టిచేఁ
దప్పక చూచి రాజసుత తానును జిత్తరు వయ్యె నత్తఱిన్. 69

వ. ఇట్లు దర్పకదశాధ్యయనంబునకుఁ బ్రథమప్రణవం బైనయవలోకనమహోత్సవంబునం దగినకన్నియ నెఱింగి యంత నెఱుంగనియదియుంబోలెఁ బ్రియవయస్య సోపాలంభనంబుగా ని ట్లనియె. 70

ఉ. ఒల్లమి నిట్లు మాఱుమొగ మొందియునుం దడవేల సాల్వభూ
వల్లభుఁ జూడు వీఁడె గుణవంతుఁ డనాఁ దలవంచి నెచ్చెలిన్
హల్లకపాణిపాణిధృతహల్లకతాడితుఁ జేసెఁ గెంపు సం
ధిల్లఁగ సిగ్గులేనగవు దేఱెడుకన్నులచే నదల్చుచున్. 71

వ. అప్పు డప్పాలికయు బాలికఁ గని నవ్వుచు. 72

క. కోపించె దేల యట్టిమ, హీపతిఁ బతిగా వరించు టే నెఱుఁగుదు నే
వాపుచ్చ కొరులమనసుల, లోపలితలఁ పెఱుఁగు టెల్ల లోకమునఁ జెలీ. 73

వ. అని యుచితసరససల్లాపంబులం గలపికొని. 74

గీ. రూపమున నెల్లఁ ద్రిజగదారూఢలట్లు, బుద్ధియందును సకలైకపూజ్య నైతి
నెల్లరాజులలోన మే లేర్చి తగిన, వరునిఁ గోరితి పతిభాగ్యవతివి సఖియ. 75

వ. అని యమ్మనోరథం బప్పు డమ్మహీపతికి విన్నవించిన నతండును జిత్రకారాభిప్రాయంబునం దనతలంపునుం గన్యామనోరథంబు నొక్కటి యగుట దైవఘటనంబ కాఁ దలంచి ప్రహృష్టహృదయుం డై తత్కార్యసంధానోన్ముఖుం డయ్యె నంత నిక్కడ.

## విమలాంగి మన్మథావస్థల నొందుట.

క. నెచ్చెలి తనకుం జూపిన, యచ్చిత్రపటంబులోనియధిపతిరూపం
బచ్చొత్తినగతిఁ దోఁపఁగ, నచ్చెలువమనంబు సంతతాంతర్ముఖి యై. 77

సీ. పూర్ణచంద్రునిఁ జూచి పూర్ణచంద్రునియందు, విపులనేత్రయుగంబు వెదకఁ జూచు
మణికవాటముఁ జూచి మణికవాటమునందు, తారహారంబులు దడవఁ జూచు
నునుఁగంబములఁ జూచి నునుగంబములయందుఁ, గంకణాంగదములు గానఁ జూచు
వికచాబ్జములఁ జూచి వికచాబ్జములయందు, శుభదోర్ధ్వరేఖలు చూడఁ జూచుఁ

గీ. దరుణమృగలోలనేత్ర సంతతముఁ దనదు, చిత్తసింహాసనము నధిష్ఠించియున్న
యధిపమన్మథుభువనమోహనము లైన, యవయవంబులు చెలి గన్నయట్ల యైన. 78

చ. చెలుల మొఱంగి యేకతమ చెన్నున హస్తములందుఁ దూలికా
ఫలకముల న్వహించి తనభావములోఁ బతిరూపు వ్రాయఁగాఁ
దలఁచి లతాంగి చిత్రముగఁ దా నవిచేష్టతఁజిత్రరూప యై
నిలిచెఁ దదాకృతిస్మరణనిర్వృతిచే వివశాంతరంగ యై. 79

చ. వదనము వ్రాసి తోన గరువంబునఁ జుంబనకేళి సల్పుచున్
హృదయము వ్రాసి తోన నిలువేది కవుంగిటఁ జిక్కఁజేర్చుచుం
బదములు వ్రాసి తోన కరపద్మములం బ్రియ మార నొత్తుచు
న్నుదతి పతి న్లిఖించు మఱి చూడ నెఱుంగదు కోర్కి పెక్కువన్. 80

వ. ఇట్లు తీవ్రంబు లగుకోర్కులత్రొక్కునం జిక్కువడి యక్కన్య తనలోన. 81

ఉ. మారునిచేతిఘాత నభిమానమువోక సఖీజనంబుచే
నారడి గప్పిన న్వలపు లంగడి కెక్కక కోరినప్పుడే
కూరిమివల్లభుం గలసి కోర్కి ఫలించి సుఖించుకన్నియ
ల్భారపునిష్ఠఁ బూని తొలుబాములనోముల నేమి నోఁచిరో ? 82

ఉ. వల్లభుపేరఁ జిత్తరువు వ్రాసినరూపముఁ జూచినంత నా
యుల్లము నీర మై కరఁగుచున్నది నిక్క మతండు వేడ్క రం
జిల్లఁ గవుంగిటం బిగియఁ జేర్చినయేని యురంబుపైఁ దనూ
వల్లియు నేను బెంజెమట పట్టఁగ బిట్టు గరంగి పోవనే. 83

క. అని మఱియుఁ బెక్కుకోర్కులు, దనమదిఁ బైకొనఁగ వెలఁది దరళోర్ముల నాఁ
గినయట్ల యోర్చి చెలులం, గననీక వెలుంగు చుండెఁ గన్నియ యంతన్. 84

చ. ఉదయమె కాని యస్తగతి నొందక తీవ్రగతి న్వెలుంగున
మ్మదనభుజప్రతాపరవి మండఁగ నప్పుడు మోడ్పెఱుంగమి
న్నిదురకుఁ బాసి యచ్చెలువనేత్రమహోత్పలము ల్జయించె నె
ల్లిదమున రాత్రు లెల్ల ముకుళించురవిస్ఫురదంబుజంబులన్. 85

ఉ. అంగన కాను యౌవనసహాయమునం గయిచేసినట్ల నేఁ
డంగజుప్రాపుఁ గల్గి యఖిలాంగము లేన యలంకరింపఁగా
నంగములందు నేల యివి యుండఁ గృశత్వ మహంకరించి తా
నంగదకంకణాదు లగునాభరణంబులఁ జార్చె నింతికిన్. 86

ఉ. వారణరాజయానకును వారము కుంతలమధ్యవీథి సిం
దూరము దూర మయ్యె మగతుమ్మెదప్రోడలు గోడగించుఝుం
కారము కార మయ్యెఁ జెలికత్తియలం బలికించువాక్యసం
భారము భార మయ్యె మదిఁ బర్వెననూతనకామవిక్రియన్. 87

చ. విరులు సరంబు లయ్యె చలివెన్నెల యొట్టినమంట యయ్యెనుం
గరువలి వజ్ర మయ్యెఁ జెలికత్తియ యొప్పని దయ్యె హస్తపం
జరమునఁ బూని పెంచుశుకశాబకము న్బగచాటు దయ్యె న
త్తరుణికిఁ బంచబాణుఁ డనుదైవము దాఁ బ్రతికూల మాటచేన్. 88

చ. పులకకదంబము ల్నిలిచె ఫుల్లముఖాబ్జవిలాససంపద
ల్దూలఁగ మరాళికాగతులు దూరము లయ్యె శ్రమాంబుపూరము
ల్వ్రాలి విరియంగఁ జొచ్చెఁ బురివిచ్చి నటింపఁగ నెమ్మిగోరిక
న్బొలఁతుకయందు మన్మథుఁడు పూర్ణముగా శరవృష్టిఁ జూపఁగన్. 89

తే. తాపమును బాండిమయు నాఁగఁ దరుణిమేన
సెండయును వెన్నెలయుఁ గూడి రెండు నుండి
భావిలజ్జావినాశసంప్రాప్తికొఱకొ
ధైర్యహానికినో మహోత్పాత మయ్యె. 90

వ. ఇట్లెంతకంతకుఁ బెరుగువిరహపరితాపంబు నిలువరింపం గోలంది గాక నెచ్చెలులం గనుమొఱంగి యొక్కనాఁ డొక్కతెయు మందిరారామంబునకుం జని. 91

సీ. అలరుతేనియలయలుఁగులు మీఁదఁ గురియుచోఁ, జేలకొంగుముసుంగు చేసిచేసి
చిల్కపల్కులు గాఁడి జీవంబు లెడలుచో, నంగుళంబుల వీను లానియాని
యడుగులఁ బుప్పొడు లంటి చుఱ్ఱుడుచుచో, నుస్సురు మని వెచ్చ నూర్చియూర్చి
కమ్మదెమ్మెరలుపైఁ గలయంగ సోఁకుచో, వల్లరియునుబోలె వణఁకివణఁకి

తే. సాహసమె తోడు గాఁగఁ నచ్చపలనయన, మందిరారామవాటికామధ్యవీథిఁ
దఱిసి చని యొక్కపుష్పలతాగృహమున, ధవళకరకాంతశయ్యపైఁ దనువు వైచి. 92

ఉ. లేనిప్రియుండుఁ గన్గొనఁగ లేనివిలాసము విన్నవింపఁగా
లేనిప్రియంబుఁ గైకొనఁగలేనికడంకలుఁ గౌఁగిలింపఁగా
లేనిముదంబుఁ జేకొనఁగలేనిరతు ల్మదిఁ బట్టుకొల్పఁగా
లేనిసుఖంబుఁ దాల్మిఁ గబళింపఁగ సింధురయాన దీన యై. 93

వ. ఉండునంత నిచ్చటం బ్రియవయస్యం గానమిం జేసి చెలికత్తియ లెత్తినతత్తఱంబున నత్తలోదరిపదారవిందంబులచొప్పునం జనుదెంచి యుద్యాననికుంజంబు డాసి పరికించునప్పుడు. 94



ఉ. తూలినమోముచెల్వుఁ బయిదూఁకొనుఘర్మజలంబువెల్లువం
దేలినమేను నెమ్మనముత్రిక్కులఁ జిక్కులఁ జేసి వెల్వడం
దోలినతాల్మి వల్లభుఁడు దోఁచినరిత్తకు రిత్తకౌఁగిటన్
సోలినచందముం గలయఁ జూచి వయస్యలు భీతచిత్తలై. 95

క. తత్తఱిలువారి నందఱు, నత్తఱి మఱుపడఁగ నిలిపి యప్పాలిక దా
నత్తన్విఁ దెలిపి కౌఁగిట, నొత్తి కురు ల్నిమిరి యుల్ల మూఱడిలంగన్. 96

ఉ. మచ్చిక గల్గు నెచ్చెలుల మమ్ము మొఱంగి లతాంగి! యొంటి నీ
విచ్చటి కెట్లు వచ్చితివి! యీవనవాటిక దాదిప్రక్కయే?
పచ్చనివింటిజోదు తగుబందుగుఁడే? మఱిచిల్క లేమి నీ
నచ్చినతోడఁబుట్టుగులె? నాయము దప్పఁగ దమ్మ! యియ్యెడన్. 97

చ. హిమకరుఁ డంకకాఁడు మధు వెప్పుడు జాతివిరోధి రాజకీ
రము ప్రతిపక్షి తెమ్మెరలు ప్రాణముదాయలు కాచియుండుఁ జా
తము గడుఁ జూడఁ జాలఁ డలదర్పకుఁ డింత యెఱింగియుం జెలీ!
మము సఖులం దొఱంగి రిపుమధ్యమ మీవన మొంటిఁ జొత్తురే. 98

చ. మనమున నీవు గోరునృపమన్మథుతో నినుఁ బెండ్లి సేయ నీ
జనకుఁడు సంభ్రమించె నదె సమ్మద మొందుదు గాక బేలవై
వనరుహపత్రనేత్ర! యిటు నాఁగె వదల్చినకోర్కులన్ మనో
జున కెర యచ్చి డిల్లపడఁ జూచినఁ జూచినవారు మెత్తురే! 99

వ. అని సిగ్గెక్కించి పలికిననెచ్చెలికంఠంబు కరంబులం బెనఁచి తనవాడినవదనపద్మంబు నోరగాఁ దదీయకుచమధ్యంబునం జిక్కం జేర్చి నిడుదకనుఁగొలంకులఁ గ్రొవ్వేఁడి బాష్పకణపరంపర లొలుక నిట్టూర్పు నిగిడించి. 100

క. మగబొమ్మఁ జూడ నొల్లని, ముగుదతనం బెల్ల మూలముట్టుగ నిటు పె
ల్లగిలించుకొంటి నే నే, తగనిమనోరథమువలనఁ దప్పదు చెలియా! 101

క. చెలు లెఱిఁగిన నాడెద రను, తలఁ కది ప్రాపడియె నిపుడు దర్పకశరబా
ధలవలన నాకుఁ బ్రాణము, నిలుపుట గండ మయినయది నిక్కము సకియా! 102

ఉ. ఏయఁ దొడంగెఁ గంతుఁ డెడ యూక శరంబుల వేఁడివెన్నెలల్
గాయఁ దొడంగెఁ జందురుఁడు గర్ణపుటంబులు వీలఁ గోయిలల్
గూయఁ దొడంగె వల్లభులఁ గోరెడుకన్నెల కెల్ల నిట్టిదే
న్యాయమొ? లేక దైవ మిది నాకు ఘటించెనొ? నేఁడు నెచ్చెలీ! 103

క. కర మర్థి నేన పెనుపం, బెరిగినశుక, మోట లేక ప్రేలుచు హృదయుం
బెరియింపఁ దొడఁగె నింకం, బరభృతములు చెప్ప నేల పంకజవదనా! 104

చ. వలపుల ఱేనిచేతివలవంతల కోర్వక చల్లగాలిపై
నొలయ నెదిర్చి యే శుకపికోత్కరములకుం జెవియొగ్గి యేని యొ
క్కలమున మోకమావిపయిఁ గన్నిడి యేఁ దనువుం దొఱంగఁ గాఁ
జెలుల మొఱంగి యొక్కతియ సేరితి నీవనమధ్యమంజమున్. 105

క. చెప్పితిఁ దలంపు నీకుం, దప్పక యిది యెట్లు సేయు దాన న్వినుమో
యప్ప! రహస్యం బొక్కటి, యి ప్పగుఁ గా కుండు నింక నోడఁగ నేలా! 106

ఉ. సత్తుగ నోఁచ నెట్లుఁ బతిసంగతికిం బ్రతిరూప మేరి నా
చిత్తము పూనికం గుఱుచచేసినసోలముతోడి నక్రబ్రియో
ద్వృత్తి విశాలవక్షమునఁ దేఱెడునట్లుగ వ్రాసి చూపి నా
యుత్తలపాటు మాన్ప మది నూఱడి వెన్నెలచిచ్చు చొచ్చెదన్. 107

వ. అని సప్తమం బైనయవస్థాంతరంబు దేటపడం బలికిన నులికిపడి పాలికయు నిబ్బాలిక
మనగపరిపాకంబుఁ బరికించినం గార్యంబుపరువంబు దప్పినయది యైన నిరంతరం
బగుకంటె నిప్పటికిం గొంత యూఱడిలం బలికి తెలుపు టుచితంబుగాకేమి యని
తేనిబింకంబు దెచ్చుకొని. 108

మ. అలరుందూపుల మూలపాల్పఱచి సొంపానిక్షుచాపంబునం
గలపెం పెల్ల దృణీకరించి మకరాంకం బవ్వలం ద్రోచి య
చ్చల మేపారఁగఁ జిన్నిబాలకులచేఁ జప్పట్లు వెట్టింతు న
వ్వల ఱేనిం జెలి! యొక్కపోటుదొర గా వాలూఁది చింతింపకే. 109

సీ. అహికులాధిపు వ్రాసి యంత్రించి దక్షిణ, గంధవాహునిరాక గట్టువఱతు
రాహుపూజాభిచారవిధాన మొనరించి, శశిబిట్టబిసుగుడు చంపి వైతు
నలు వైనశ్రీరామనామమంత్రంబుచేఁ, గలకంఠతతుల వాకట్టి విడుతు
సంపంగి నౌషధసంప్రయోగము చూపి, నొకరితుమ్మెదపిండు మూర్ఛవుత్తుఁ
గీ. భ్రాంతభూరుహముల గల్గుపండ్లు మిలిచి, త్రుళ్లుచిలుకలనాల్కల ముండ్లు విఱుతుఁ
బొలఁతి! నాయంత నెచ్చెలిప్రోడ గలుగ, నించువిలుతునిచగకు నీకేల తలఁక? 110

తే. డెందమునయందు ప్రీడ నాటింపవలదె? యతిరతి హారంబు నులిగొన్న దకట! మేల?
యొంటి నిల నేల! యిచట నా యుత్పలాక్షి! ప్రోదిచూతంబునకు నీరువోయ వలదె?

వ. అనిన నప్పలుకులయెడ ననాదరంబు తేటపడ వెడనవ్వు నవ్వి. 112



ఉ. ప్రోడవు గాన నీపలుకు పోలదు గాదనరాదు గాక యీ
పీడసితాపవేదనల వేఁగెడుచెన్నటిమేనఁ బ్రాణముల్
గూడి నసింప నోర్వ విదిగో చనుచున్నవి యేల ప్రీడయుం
గ్రీడయు నాకు హారమును గీరముఁ జూతము గీతముం జెలీ! 113

వ. అనుటయు నక్కన్నియమేనిసంతాపాతిశయంబు పరికించి యలంతులం బోకుండుట
యెఱింగి కొంత యుపశమంబు సేయకున్నఁ బ్రమాదం బగు నని నెచ్చెలులం బిలిచి
యచ్చెలువ వారునుం దానును శిశిరోపచారంబులు సేయ సమకట్టి యప్పుడు. 114

చెలియలు విమలాంగికి శిశిరోపచారములఁ జేయుట.

ఉ. కేరపుమోకమావిఁ గమియిక్కవ గొజ్జెఁగలందు జాఱుప
న్నీరులయేఁటు నయ్యనఁటినిట్టలపైఁ బొరలాడి గాలిక
ర్పూరపుదీవిచెంగలువపువ్వులు గప్పినచప్పరంబులో
సారపుఁదమ్మిపుప్పొడులశయ్యకుఁ గన్నియఁ దెచ్చి నెచ్చెలుల్. 115

వ. హారపటీరకర్పూరపన్నీరపల్లవహల్లకాదిశిశిరద్రవ్యంబులు గొని వచ్చి విరహాదిదైవ
తం బగుభావభవునాకారంబు ప్రతిష్ఠించి యారాధించి యతని నుద్దేశించి. 116

ఉ. గిల్లియ గోరఁ దీర్పపనికి న్మతి గొడ్డలి యొల్లకే కదా!
బల్లిద మైనసాధనముఁ బట్టక మన్మథ! నీవు లోకముం
దెల్లమిగా జయించితివి తియ్యనివింటను గమ్మఁదూపులం
జల్లనిమంత్రిచే శ్రుతిరసాయన మయ్యెడు తేంట్లయార్పులన్. 117

సీ. నీవిక్రమక్రీడ నిజహృదయంగమం, బై మెచ్చు శ్రీధరుం డనుఁగుఁదండ్రి
నీయాజ్ఞ కొండన నేరక ముద్రిత, వదనుఁ డై వర్తించు వాగ్వరుండు
నీతూపు కోర్వక నిటలాక్షుఁ డుమతనూ, ఫలకంబుచాటునఁ బాయఁ డెపుడు
నీబిరుదోక్తిచిహ్నితజయజంగమ, స్తంభ మై యున్నాఁడు జంభవైరి
గీ. యింకఁ దక్కినబడుగుల నెన్న నేల? యిట్టినీ విట్లు పసిబాల నేఁచు టెట్లు?
పర్వతం బెత్తు కేలన బంతి యెత్తి, కడిమి నెఱపంగఁ జూచితే కాయజన్మ! 118

వ అని మఱియును. 119

సీ. ముద్దియయెడఁ గల్గుమోమోట మఱచితే, కాఱించె దేల? నాకాశశాంక!
మగువ నీకిచ్చినమాటపట్టెఱుఁగవే, యించుక కృప సేయవేల? చిలుక!
కోమలాంగికి నట్టుఁగుత్తిక వై యుండి, కలకంఠమా! కనికరము వలదె?
చెలిమోముఁదమ్మితావులఁ గ్రోలుచుండియు, గుడిచినింటికిఁ గీడుఁ గోరకు మలి!
గీ. కాల మెల్ల పగలు గా వచ్చినది మీకుఁ, గొమ్మ నేఁచఁ దగదు కోకయుగమ!
యకట! సతికి నంతరంగ మై యుండియు, మలయకయ్య! నీవు మలయపవన! 120

వ. అని సపరివారంబు గా మదనదేవతాప్రార్థనం బొనరించి. 121

ఉ. పత్త్రము పుష్పముఁ బ్లలము భక్తి నొసంగెడువార మింతె యీ
మాత్రమునం బ్రసన్ను లయి మానినిఁ గన్గొనుఁ డయ్య! మీకృపా
పాత్రము గాఁగ నంచుఁ దగుభంగిఁ బికంబులఁ దేంట్లఁ జిల్కలం
బత్త్రము పుష్పము న్బలు ముపాయన మిచ్చి భజించి యచ్చెలుల్. 122

సీ. స్వర్ణకుంభములకు వర్ణలేపనముగఁ, జన్నులఁ గుంకుమం బలఁది యలఁది
వెడవిల్తునలుఁగులు వొడముట గాఁ గన్నుఁ, లెడపక పన్నీటఁ దుడిచి తుడిచి
తేఁటతుమ్మెదలకు మేఁతఁగా విరిదమ్మి, పుప్పొడిఁ గురులపైఁ బోసి పోసి
యనఁగుఁ జుట్టములతో నాలింగనంబు గాఁ, బదకరంబులఁ జిగు ళ్లదిమి యదిమి

గీ. కప్పురపుధూళి మేనిపైఁ గుప్పి కుప్పి, విపులకదళీదళంబుల వీచివీచి
విరహపరితాపవతి యైనవెలది కపుడు, చెలులు శిశిరోపచారము ల్సేయఁ జేయ. 123

ఉ. ధాతుపటంబులం బొగసి దట్టపుఁ బుప్పొడి రాఁజి చందన
వ్రాతముచేతఁ గాల్కొని ప్రవాళముఖంబుల వీచవీచ ను
ద్భూతమహార్చులం బెరిగి తోరపుఁగొజ్జఁగ నీటిపేరిపె
న్నేతఁ బ్రతీప్త మయ్యెఁ దరుణీమణిపై విరహాగ్ని యెంతయున్. 124

మ. పటకి న్వార్చినలీలఁ జందనము పైఁ బైఁ బూయ నంగారక
చ్ఛటలం గాఁచుతెఱంగునం జిగురుసెజ్జం బొర్లగా నప్పట
ప్పటికిం జేరఁగ నిచ్చిన ట్లొడలిపైఁ బన్నీరు చల్లంగ ను
త్కటమయ్యెం బెనుఁగాఁక బంగరుసలాకం బోలునబ్బాలకున్. 125

వ. ఇట్లు విరహానలం బగ్గలించుటకు బెగ్గిలి నెచ్చెలులు శిశిరోపచారంబులు చాలించి
చంద్రమందానిలకందర్పాదులం బ్రార్థించు టుడిగి వారిపయిం గినుక వొడమి 126

ఉ. పైకొని వచ్చె దేల! నినుఁ బాము దినం జలిగాలి! ప్రార్థనం
గైకొనవేల? చంద్ర! నినుగా మడువ న్మెలఁపేది ప్రేలెదో
కోకిల! యేటి కిట్లు? నినుఁ గొ ర్తఁబడం దరలాక్షి సేయునీ
పాకము దప్ప వేల? నిను భస్మము గా వలరాజ! యి త్తఱిన్. 127

తే. తలఁప దోషాకరుం డఁటే తగినప్రాపు, సహచరుఁడు జాతిమాలినచైత్రుఁ డట్టె
యెప్పుడును నీవు నీయొడ లెఱుఁగ వింక, మదన! నుతియేమి చెప్ప నీమధుపగుణము.

వ. అనునంత నుదయగిరిశృంగాటకంబునం దుహినకిరణకిరణోదయసూచకం బగుచు నునుఁ
గెంపుజగజంపుగొనం గనుపట్టిన బిట్టులికి యబ్బాలిక పాలికకరంబు కరంబున నప్ప
ళించి యీ రెలుంగున. 129



ఉ. కూయఁగ నిమ్ము కోయిలలఁ గోపము దీరఁగ బువ్వుఁ దూపు లి
ట్టేయఁగ నిమ్ము మన్మథుని నీయెడ దూఱఁగ నీకు నేటికిన్?
మ్రోయఁగ నిమ్ము తుమ్మెదలఁ గ్రూరత మై నను నేఁచు టెల్లఁ దా
రీయుదయించువెన్నెలపయిం బడునంతకుఁ గాదె కోమలీ! 130

క. చిచ్చునకు గాడ్పు దోడై, వచ్చినగతి మరుని కబ్జవైరియుఁ దోడై
వచ్చె నదె యాస నల దిఁక, మచ్చిక దలపోసి నన్ను మది మఱవకుమీ. 131

వ. అని యఖండపాండురప్రభాడంబరంబున నంబరంబుఁ గబళించుచు శుభ్రకరుం డభ్యు
దయవిభ్రమంబు చూపిన. 132

చ. పొడిచినచంద్రుఁ జూచి నృపపుంగవ! వచ్చితె? యంచు లేమపైఁ
గడువడిఁ గేలుసాఁచి బిగికౌఁగిటి కందక యున్న పూనిక
ల్సడలి విషణ్ణ యై మరల శయ్యపయిం బడి వెచ్చనూర్చున
ప్పడఁతి మనోజతీవ్రశరబాధలఁ జిత్తగతుల్ భ్రమించినన్. 133

వ. ఇట్లు చిత్తవిభ్రమణరూపం బైనదశాంతరంబు నొంది వెండియు శశిమండలంబుపయిం
గన్నిడి. 134

ఉ. నిప్పులకుప్ప మింట నదె నెచ్చెలి కా దది చంద్రబింబమో
యప్ప! యదేల మీఁదఁ బొగ యంగన! కా దది పైకళంకపుం
గప్పు తనింపఁజేయు నఁటె కల్వలకుం డతఁ డేల సేయు నీ
ముప్పిరిగొన్నతాప మది మోహము నొందకు వే తలోదరీ! 135

వ. అని సఖీప్రయత్నంబునం జంద్రుండ కా నెఱింగి నిజవిరహప్రవర్ధ్యవహ్నికిం
బయఃప్రపూరం బైనచంద్రికాసారంబు దుస్సహం బగుటయుఁ గటకటం బడి
యుడురాజు నుపలక్షించి. 136

తే. ఉవిద! వీఁడు సుధాంశుఁ డై యుండి తాప, మెట్లు సేయు వియోగికి నట్లు దలఁప
జలధి జన్మించునపుడె లక్ష్మింబుపేర, నడుమ హాలాహలముఁ దాల్చినాఁడు గాక. 137

తే. పథికసంహారనిజపాపఫలమువలన, దినదినక్షయమునఁ గడ తేఱి పోయి
విరహిజనపాపఫలమున వీఁడు మరల, ననుదినంబున కభ్యుదయంబుఁ బొందు. 138

తే. హాలహలమునకంటె నీయమృతకరుఁడు
దుస్సహుం డనుదృఢబుద్ధి దోఁచె నాకు
మృడుఁడు హాలాహలము దక్క మ్రింగెఁ గాని
వీని మ్రింగియు రాహువు వెడలఁ గ్రాయు. 139

క. నిజ మెఱుఁగ లేదు లోకము, నిజగురుతల్పగుని యామినీపతి వీని న్
ద్విజరా జనుచును బేర్కొను, గజగామిని నేఁటిబీఱకాయంబోలెన్. 140

సీ. పుట్ట మంద్రు గొందఱు పుట్టయే మఱి వృద్ధిఁ, బొంద కుండఁగ హాని పుట్ట వలదె?
వట మంద్రు గొందఱు వట మేని యూడలు, వాఁటి మండల మెల్లఁ బ్రబల వలదె!
మృగ మంద్రు గొందఱు మృగమే నెదుక నీక, మృదుకరాంకురములు మేయ వలదె!
శశ మంద్రు గొందఱు శశ మేని దేవతా, పథికుల కిరవు మార్పంగ వలదె?
గీ. వీనిలో నొక్క పెద్దియే నైన నంక, మండియును జెఱకున్నవాఁ డువిద! వీఁడు
ధర్మపరు హేతువునఁ గీడు దాఁకుఁ గాని, పాపపరుఁ దాఁక దనియెడుపలుకునిజము.
ఆ. అనుచు నంతలోన నతిసాంద్రచంద్రికా, స్పర్శనమునఁ దనువు పరవశముగ
నున్న శిశిరవిధుల నొకభంగి నబ్బాలఁ, దెలుపుచెలులఁ బ్రోడచెలువ చూచి. 142
తే. చాలు మనసేయుశిశిరోపచారవిధులు, మెలఁత కంగజదశలు తొమ్మిదియు నిండె
నింకఁ బదియవదశఁ బోవనీక వేగ, మగనితోఁ గూర్చుటయ చల్లమందు సతికి. 143
వ. అని పలికి యక్కన్య నంతఃపురంబునకుం గొని వచ్చి యప్పు డంతయును మహీకాంతునకు విన్నవించినం జంచలస్వాంతుం డై యతండును శీఘ్రింబ వరునిఁ గూర్చునుపాయంబు చింతించుచున్నసమయంబున. 144

మాంధాత కుంతలేశునొద్దకు దూతం బుత్తెంచుట.

సీ. ఆగతిఁ జిత్రస్వయంవరంబునఁ దన్నుఁ, గుంతలేశ్వరపుత్త్రి కోరు టెల్ల
జారులవలన నిశ్చయముగ విని హర్ష, మెసఁగ మాంధాతృమహీశుఁ డనుప
దూత మోసలనుండి ప్రీతిమైఁ దనరాక, దౌవారికునిచేతఁ దనకుఁ జెప్పి
పంపిన విని జయభద్రుండు సాద్భుత, ప్రమదుఁ డై తోతేరఁ బనుప వచ్చి
గీ. యుచితగతిఁ గాంచి సత్క్రియారచనఁ బొంది, చేరి యర్హాసనమున నాసీనుఁ డగుచుఁ
గుశలసంప్రశ్నముఖసుఖగోష్ఠిఁ జరపి, యాగమనకార్య మెఱిఁగింప నాత్మఁ గోరి.
మ. స్వగతక్షోణికి మేరకంబములు ప్రాక్శైలంబు నస్తాద్రియుం
జగతీనాయకు లాత్మజంగమజయస్తంభంబు లింద్రాదిదే
వగణాస్యంబులు నై జసద్గుణలతావ్యాప్త్యుచితోపఘ్నముల్
తగదే? సన్నుతి సేయ నెవ్వరికి మాంధాతృక్షమావల్లభున్. 146
తే. అమ్మహాత్ముండు నీయల్లుఁ డగుటఁ గోరె, నెంత భాగ్యైకశాలివో? కుంతలేశ!
యనుడు మది వెల్లివిరిసినహర్షజలధి, లహరు లై వక్త్రమున సముల్లసన మెసఁగ. 147
వ. మొదలఁ జేసినచిత్రస్వయంవరప్రయత్నంబును వెనుకటిచిత్రకారోక్తియుఁ బిదప నైనకన్యామనోరథంబును దురీయం బైనవిచారవిశేషంబును సవిస్తరంబుగా నెఱింగించి యాశ్చర్యకథనం బైనయీయవిలంబఘటనంబు దైవకృత్యం బగుటఁ గృతార్థుండ నై తిం గన్యామనోరథపరిపాకంబు పరికించినం దడయుట దగదు 'శుభస్యశీఘ్ర' మ్మను



నయంబ యవలంబనీయం బని యప్పుడు మౌహూర్తికుల రావించి చేరువన లగ్నంబు నిశ్చయించి దూతపురుషు నుచితసత్కృతులఁ బ్రీతునిం గావించి నిజపురోహితసహితంబుగా నతని నయోధ్య కనిపి శుభలేఖాప్రేరణంబున నిజనిఖిలబంధుహితలోకంబు రావించి పరిణయోచితసమస్తవస్తుసంపత్సంపాదనంబునకుం దగినయధికారుల నియమించి పురంబుఁ గై సేయం బనిచి నిజరాష్ట్రంబున నయోధ్యానగరమార్గంబున విడుదు లాయితంబు సేయించి జామాతృసమాగమప్రతీక్షాపరుం డై యుండునంత గతిపయదినాంతరంబున. 148

మాంధాత విమలాంగిం బెండ్లాడఁ గుంతలేశుపురి కేతెంచుట.

శా. సప్తద్వీపధరాధవుల్ నిజచమూసంయుక్తు లై శ్రీకరుల్
సప్తాశ్వాన్వయజుల్ భజింపఁ ద్రిదశాశ్చర్యప్రదం బై జగ
ద్వ్యాప్తాశ్చర్య మెలర్ప వచ్చెఁ దగ మాంధాతృక్షమాభర్త సం
ప్రాప్తాభీష్టమనోరథం బగుటకున్ భావంబునం బొంగుచున్. 149
వ. ఇట్లరుగుదెంచి నిజబంధుసామంతసేనాసమేతుం డై దూరంబున గుంతలేంద్రుం డెదుర్కొని తోతేర మంగళాలంకారసంకులం బైనతదీయపురంబుం బ్రవేశించి రాజమార్గంబునం జనునప్పుడు. 150

పౌరకాంతలు రాజమార్గమున మాంధాతం గనుంగొనుట.

సీ. క్రొవ్వేద యూఁదినడిచేతికరమూల, కాంతులు కేయూరకాంతిఁ బొడువఁ
బెఱకేలి కందనిబిగిగుబ్బచనుఁ గ్రేవ, నిగ్గుపయ్యెదకు వన్నియ యొసంగఁ
దఱుచుటూర్పులతావి కెఱఁగుచుండటితేంట్లు, దివిరెడునునుఁజూడ్కి తెలుపుసేయఁ
గడుఁజేద యగుకొను గమనవేగంబున, మెలఁ పేది జవజవ జలదరింపఁ
గీ. గుఱుచనెట్టున నందియల్ చరచి మెరయఁ, బిఱుఁదువ్రేఁకంబుచే నీవి బిగువుసడలఁ
జూపఱుల కెల్లఁ దనుఁ గనుచూఱయొసగిఁ, వేగపరతెంచి చూచె భూవిభు నొకర్తు.
చ. తరుణి యొకర్తు కంఠమునఁ దాల్పఁగఁ దావస మేది హారముల్
కరములయందుఁ బూని పతిఁ గన్గొన వచ్చె రయంబుమై స్వయం
వరమునఁ దాన మున్ను నృపవర్యు వరింపఁగఁ గోరి మంగళా
విరళమధూకదామకము వేడుకఁ జేకొని వచ్చెనో! యనన్. 152
చ. నెఱఁకులు గాఁడ దన్మరుఁడు నిర్దయుఁ డేసినతూఁపు లేఱి య
త్తెఱఁ గెఱిఁగింప భూపతికిఁ దెమ్చుగతి న్వెస దోఁప విమ్ముచోఁ
దురుమ నెఱుంగ నొక్కసతి తోడన తెచ్చినఁ బొల్చెదో యిటన్
గిఱికొనుపాణిపద్మరుచిఁ గెంపు వహించినకమ్మగ్రొవ్విరుల్. 153

తే. తమకమునఁ బాదలాక్ష యంగమున నలఁది, నృపతిఁ గన్గొనవచ్చెఁ గన్నియ యొకర్తు
విటులనెత్తుట జొత్తిల్లి వెలపుఁగఱపు, మకరకేతనుఖడ్గపుత్రికయుఁబోలె. 154

క. ఇల సేనిఁ జూడఁజనుతమి, లలన యొకతె తడబడినయలంకారముతో
వలయుపడి గూడనిపద, స్థలవంబును గలిగి కుకవికవితయుఁబోలెన్. 155

ఉ. ఆరనిచెక్కులేఁజెమట లప్పటియుం బొడమంగ నిక్కఁ జొ
ప్పారనిమేని ముత్పులక లగ్గల మై యుదయింప మ్రానుపా
టారనిచూడ్కి వెండియును నన్నున సోల రతాంతతాంతి య
ల్లారక మున్న వచ్చి యొకయంగన చూచె నరేంద్రచంద్రునిన్. 156

ఉ. భారపునిండువెక్కసపుఁబ్రాయపుజవ్వని యొర్తు మందిర
ద్వారమునందు నిల్చి నృపవంశమనోభవుచిత్తమోహనా
కారముఁ జూడ నంగజవికారవశంబున నీవి జాఱినం
గూరినసిగ్గుమైఁ దలుపు గొబ్బున మాటుగఁ జేసె నాభికిన్. 157

ఉ. అంబుజనేత్ర యొర్తు వసుధాధిపుఁ గన్గొనుచో రసాతిరే
కంబునఁ జేత మున్ను తమకంబునఁ దెచ్చినదర్పణంబునం
బింబిత మైనరాజుప్రతిబింబము చెక్కుల నొక్కి గ్రక్కునం
జుంబన మాచరించి చెలిఁ జూచి ముఖాబ్జము వంచె సిగ్గునన్. 158

తే. మానలేక నిగిడ్చిరి మఱియు మఱియు, సతులు దృగ్జాలములు రాజచంద్రుమీఁద
నతనిలావణ్యజలధితో నణఁగియున్న, తమి మనంబున శోధింపఁ దలఁచిపోలె. 159

క. పెల్లుకొనఁ గురిసి రప్పుడు, దల్లుగఁ దనుచూడ్కులకును దల మిచ్చుచు భూ
వల్లభుపైఁ బురభామలు, కొల్లలు గా లాజమిళితకుసుమాంజలులన్. 160

వ. ఇట్లు పౌరవిలాసినీదృక్చకోరచంద్రుం డగుచుఁ జనుదెంచినరాజచంద్రుం గుంతలేశ్వ
రుం డాత్మనిర్దిష్టంబును మంగళాలంకృతంబు నగువిడిది విడియించి యితరసామంత
మంత్రిపరివారచమూవర్గంబులఁ దగిన నెలవుల విడియించి యుచితోపచారంబులం
బ్రీతులం గావించి వివాహమంటపంబునకుం దగినవస్తువు లొడఁగూర్చుటకుఁ దగు
వారి నాదేశించి యనంతరంబ పతంగుం డపరదిగంగనాసంగతుం డగుచు వచ్చినం గు
మారిక నలంకరింప నియమించినం బనిపూని పాలికాదిసఖీజనంబు లంతిపురంబున.

## సఖీజనంబు విమలాంగి నలంకరించుట.

తే. విరహపరితాపశాంతికై వెలఁది మున్ను, చలువలొనరించినట్టిచేతుల నెనీకుఁ
బరిణయాలంక్రియలు సేయుభాగ్యమబ్బెఁ, జెలియ! మున్నేమినోమునోఁచితిమొ మేము.
వ. అని వెండియు. 163



సీ. అంగసంభవుఁ డింక నబ్జాక్షి! నీకు విధేయుఁడై కనుసన్నఁ దిరుగుఁ గాక
నఖపదచ్ఛలమున సఖి! యాకళానిధి, వచ్చి నీశరణంబుఁ జొచ్చుఁ గాక
చెమట లార్చుచు సేవ చేసి సుందరి! మంద, పవనుండు నీకృపఁ బడయుఁ గాక
తరుణి సోలపుటూర్పుతావి యెంగిలి మ్రింగి, తేంట్లు నీలెంకలై తిరుగుఁ గాక
గీ. సీత్కృతుల నభ్యసించినశిష్యు లగుచుఁ, జెలువ! చిలుకలు నీమాట సేయుఁ గాక
తొలుత వలవంత గొలిపినద్రోహు లగుటఁ, గాంత! నీవింక రతిఁ బతిఁ గలసినపుడు.

వ. అని సమేళంబుల మేళంబు లాడుచు లజ్జావనతసస్మితముఖారవింద యగుకన్నియ
కు మంగళాభ్యంగంబు మొదలును దర్పణదర్శనంబు తుదయునుం గా విచిత్రభంగుల
శృంగారించిన. 165

ఉ. శారదలక్ష్మిఁ జేకొనినచంద్రకళాకృతి నెల్లసానలం
దేరినరత్నలేఖికగతి న్మధుపుష్పితపల్లవస్థితిం
గారునఁ బుట్టి క్రొత్తసిరి గైకొని క్రాలుమెఱుంగుభంగి శృం
గారము పూని యచ్చెలువ కన్నులపండువ యయ్యె నయ్యెడన్. 166

ఉ. చొక్కపుజల్లిమీఁద నిరునూఱెలఁ గుండలరత్నము ల్పయి
న్మక్కరముత్తియంబు గలముద్దియముద్దుమొగంబె చూడఁగాఁ
జుక్కలరాణివాసములు చుట్టును గొల్వ బుధుం గుమారుఁ జే
రక్కున గ్రుచ్చి యెత్తుకొని యాడెడురాజును బోలె నత్తఱిన్. 167

క. కరివంకబొమలపైఁ గ, స్తురిఁదీర్చినతిలకరేఖ సుదతికిఁ బొల్చె
న్మరుఁడు వెడవింటఁ దొడిగిన, యరవిరుసునునల్లగల్వయమ్మునుబోలెన్. 168

తే. ఉన్నఁ గరికుంభములకు లోనుండు నంద్రు, గాని మరుపట్టబద్ధయోగ్యగజకుంభ
ములకునదె మీఁద గ్రాలెడుముత్తియంబు, లనఁగ సతిచన్నుఁగవఁ బొల్చెహారమణులు.

తే. హారరత్నప్రతిచ్ఛాయ లడరఁ గలసి, క్రాలుకరమూలకుచమూలకాంతివలన
నింతిమృదుబాహులతలయుం దేఱుపఱుప, నర్పితము లయ్యెఁ గనకశతాంగకములు. 170

క. గురుకుచభరభంగుర మగు, తరుణీమణికౌను పేదతనమే తనకా
భరణముగఁ బొలిచెఁ గలదే? వరభరణముకంటె సొమ్ము పరికింపంగన్. 171

క. తరుణీమణికటి రత్నా, కరమేఖల యగుచుఁ బృథ్వి గావునఁ బొలిచెక్
బరికింపఁ బృథ్వి రత్నా, కరమేఖల యగుచుఁబొలుపుఁ గైకొనుఁగాదే? 172

సీ. మగువచన్నులఁ గుంకుమము పూయుటొత్తియ, కరికుంభయుగళిఁ జెందిరము గాఁగఁ
దెలినక్రొమ్ముడివిరుల్ దుఱుముట నిజతూణి, నేర్చి నారాచంబులిడుట గాఁగఁ
గడకంటఁ జొక్కపుఁగాటుకఁ దీర్చుట, తనవింట నళిగుణోద్ఘటన గాఁగ
గజయానకటిరటత్కాంచి వహించుట, నిజసమారంభడిండిమము గాఁగ

గీ. బాలికామణిశృంగారభంగు లెల్ల, విశ్వవిజయైకదీక్షాప్రవృత్తుఁ డైన
తనకు సమరోక్తసన్నాహదశలు గాఁగ, దర్పితుం డయ్యె మిగులఁ గందర్పుఁ డపుడు.

వ. అంతట మహీరమణచంద్రుండును బారిజాతమహీజాతంబు వసంతవిలాసంబునుం బోలెఁ బరిణయోచితాలంకరణంబుఁ బూని పంకజహితుం డపరజలధిం గ్రుంకినం గరణీయంబులు నివర్తించి మౌహూర్తికదత్తం బైనసుముహూర్తంబు నికటంబు విచ్చేయు మని భావుకవిజ్ఞాపితుం డై. 174

సీ. మూర్ధాభిషిక్తులముకుటరత్నద్యుతు, లక్కరదీపదీప్తులఁ గలిపికొనఁగ
రత్నవేత్రపరంపరారుచు లుప్పరసతీ, నీరాజనాంశుల నిలిపికొనఁగ
స్మేరముఖాంబుజశ్రీ పార్శ్వదోధూయ, మానచామరలక్ష్మి మాఱుకొనఁగ
వందిమాగధులకైవారంబురావంబు, శుభతూర్యరవములఁ జూఱకొనఁగఁ
గీ. బసిఁడిరథ మెక్కి విపులవైభవము మెఱయఁ, జూపరుల కెల్ల నేఁకపుఁజోద్య మొదవ
సాంగమై వచ్చు భాగధేయంబుఁ బోలె, మామయింటికి వచ్చె జామాత యపుడు. 175

వ. ఇట్లరుగుదెంచి రథావతరణం బొనరించి యెడనెడఁ బ్రాయంపుఁబడంతులు తమ మెఱుంగుఁజూపులతోడికర్పూరదీపకళికల నిగిడింప మంగళాలంకారసంకులంబు లగు కక్ష్యాంతరంబులు గడచి చనినయనంతరంబ యభ్యంతరంబున. 176

## విమలాంగీమాంధాతృ వివాహము.

చ. కదళము లూరుకాండములు గాఁగఁ దలంపుచుఁ బూర్ణకుంభస
పదఁ గుచకుంభభావనయ పైకొన దర్పణలక్ష్మిచే హస
ద్వదనము చూచినట్లయి ప్రవాళరుచిం జిగిమేముఁ దోఁపఁ గా
నెదుట నె యున్నకన్నెసవియే పతి చూచె వివాహవేదికన్. 177

వ ఇట్లు కన్యావిలోకనమనోరథంబు తమకంబు రేఁపం గల్యాణరంగంబు గదియఁ జనుదెంచి యచట నర్పితమహార్హమణిమయోన్నతపీఠాసనంబున నాసీనుం డై విద్వదుపదిష్టమార్గంబునం గుంతలేంద్రుండు గావించుమధుపర్కాది యథోక్తశుభసమర్చనంబులు గైకొని నిజహృదయచిరమదనవహ్నికిం బ్రశామకంబుగా నతం డొసంగుకన్యాదానోదకధారం బరిగ్రహించి కౌశేయయవనికావ్యవహిత యగుకుంతలేశ్వరదుహితం గదియ వచ్చె నప్పుడు. 178

క. ఒండొరుఁ గనుఁగొనఁ దివురుచు, నుండువధూవరుల మదనుఁ డొగిఁ దూపులచే
నిండుదెరచాటు గైకొని, రెండును దనయంపదొనలు రిత్తగ నేసెన్. 179

క. వెలిపట్టుపచ్చడము తెర, వొలిచె వధూవరులమధ్యమున వారిమది
న్వలరాచశివముఁ గొలుపఁగఁ, దొలితొలిఁ గర్పూరధూపధూమం బనఁగన్. 180



క. రమణీజనంబు కల్యా, ణము వాడఁ బవిత్రతూర్యనాదము లెసఁగన్
సుముహూర్త మయినవేడ్కలఁ, దివురువధూవరులనడిమితెర యెత్తుటయున్. 181

తే. తగవుప్రాపున లజ్జ నధఃకరించి, నెలఁత నెమ్మోము జిగిఁ గ్రాలె నృపునిదృష్టి
తెర యెడల్చినఁ గనుఱెప్ప తెర వహించి, నిగిడె నధిపతిమూర్తిపై నెలఁతచూడ్కి.

మ. తెరవట్టించినవేళఁ జేతివిలసద్దివ్యప్రసూనాస్త్రముల్
సరిపో నేసి సుమాస్త్రుఁ డేసెఁ బిదపన్ జంద్రానన న్భూవరుం
దెర యెత్తించినవేళఁ గూర్మి యలుఁగుల్ దీండ్రించుమం గోర్కుల
న్గరుల న్గల్గినతత్పరస్పరసమీక్షాతీక్ష్ణబాణంబులన్. 183

వ. తదనంతరంబ. 184

తే. మన్మథుఁడు తాన తనదుసామ్రాజ్యమునకుఁ, గాంతు యువరాజ్యపట్టంబు గట్టఁ జేసె
శీతకరునకు ముక్తాభిషేక మనఁగ, భర్తచంద్రాస్యపైఁ దలఁబ్రాలు వోసె. 185

చ. ఎగయుచు నున్నచక్కనల నేలుచనుంగవ వ్రేఁగునం దెగం
దెగె నన గౌను సోఁగికొన నిక్కి బయల్పడుబాహుమూలమున్
దగదగ మించునిండుజిగి దట్టపుఁబైఁడి వసంత మాడఁ గా
మగనిశిరంబుపై నినిచె మానిని వే తలఁబ్రాలు దోయిటన్. 186

క. ఒండొరులు వోయుతలఁబ్రా, లొండొరుదేహములు సోఁకి యుల్లంబులయం
దొండొరుఁ గౌఁగిటఁ జేర్చిన, నిండుముదం బొదవఁ జేసె నెలఁతకుఁ బతికిన్. 187

క. అంగజవికారవశమున, నంగుళములు వణఁక వణఁక నప్పుడు భూభృ
త్పుంగవుఁడు పెద్దదడవున, మంగళసూత్రంబు గట్టె మానిని యఱుతన్. 188

క. పరిరంభత్వర గలయెం, డొరులమనంబులకుఁ గొంత యూఱటగా సుం
దరి యొక్కటె ముడిచె వధూ, వరులకు నపు డుత్తరీయవసనాంచలముల్. 189

తే. తనదుపంతంబు చెల్లిన దర్పకుండు, వేడ్క రతిచేతఁ దనచెయి వేసి నవ్వ
గురుజనులయాజ్ఞ నపు డొక్కతరుణి నగుచు, బాలకెంగేలు పతికేలఁ గీలు కొలిపె.

క. సంగతిలేనితరసమ, స్తాంగంబులఁ దొఱఁగి కన్నియకుఁ బతికి మిథ
స్సంగతము లైననిజహ, స్తాంగుళములయందు నిలిచె నపు డుల్లంబుల్. 191

వ. అనంతరంబ గురుజనపురస్సరంబుగాఁ గల్యాణరంగంబునకు వచ్చి యథోక్తవిధి శుభహోమకృత్యంబు నిర్వర్తించునప్పుడు. 192

సీ. తఱి వేచి యొండొరుమొఱఁగి కన్గొను నాసఁ, దారలు కడగంటఁ జేరి మెలఁగఁ
బార్శ్వదృష్టికిఁ గానఁబడునంతనంతన, యంతనుఁ గనుటగా నాత్మ లలర
హోమధూమంబుల కోఱగుపేరిటఁ జూడ, కైన నొండొరుమోము లభిముఖముగ
స్పర్శ లేకున్ననాసన్నపార్శ్వంబులు, పెరపార్శ్వములకంటెఁ బ్రియము గాఁగ

తే. హోమవేదియందు నొక్కపీఠంబున, నొప్పి రపుడు కన్నెయును వరుండు
గంతుఁ డిరువురందుఁ గలకూర్మి లొక్కింత, చూచి కల్లె వైచి తూఁచుకొనఁగ. 193

వ. ఇట్లు వివాహంబు నిర్వర్తించి క్రమంబున దినచతుష్టయం బరిగినం బంచమవాసరం
బునఁ బ్రభాతం బగునంతఁ గుంతలేశ్వరుండు పరిణయాగతరాజసమాజంబుఁ బూజించి
శుభముహూర్తంబున వధూవరులం బయనంబు చేసి. 194

రగడ. పగడపుదీఁగెలు గోమేధికములు, పచ్చలుఁ గెంపులు పుష్యరాగములు
నిగనిగ మనువైడూర్యములును హరి, నీలము లంభోరుహరాగమ్ములు
ముక్తాఫలములు వజ్రోపలములు, మొదలగునవమణిసందోహంబులు
శుక్తిపాలికలు శంఖపుటంబులు, శుద్ధసువర్ణాదికలోహంబులు
వెలిపట్టులు మంజిడులును దోఁపులు, వెల్లులుఁ జెంగావులు సకలాతులు
వలిపంబులు గుప్పట్లును చూదా, వళులును జీబులు జిలిబిలిజాతులు
గింటెంబులు బతినీల్ దసలీలును, గిముకాకరములు సుకదట్టమ్ములు
కంటకిగుజ్జరిమదుపువులు మొదలుగఁ, గలిగినపలువన్నెలపుట్టమ్ములు
కుంకుమపు వ్వగరును దట్టపునుం, గును గస్తూరియు హిమవాగపూరము
సంకుమదంబు గుమంజియుఁ బూతియుఁ, జందనఖండంబులుఁ గర్పూరముఁ
దెల్లనిజల్లులు వింజామరములుఁ, దెగగలసవరా లేనికకొమ్ములుఁ
జల్లనిగందపుఁజిప్పలు రత్నపు, సానలు శశికాంతము నద్దమ్ములుఁ
బగడపుబరణులు దంతపుఁబెట్టెలుఁ, బలువన్నెలచిలుకలయడకొత్తులు
జిగిగలపగడపుగిండ్లును గిన్నెలుఁ, జిత్రము లగుధూపంబులవత్తులు
జాలవల్లికలు పలుమానికముల, చదరంగంబులు సొగటాసారెలు
కాళాంజులు మసగపుఁబ్రతిమలు మేల్, కట్టులు నేకాండపుఁదెరచీరెలు
సరసపుఁబలుకులు గద్యపద్యములు, చదువఁగ నేర్చినశుకశారికలును
నిరతము నాడఁగఁ బాడఁగ నేర్చిన, నెచ్చెలి నెఱజాణకుమారికలును. 195

క. మున్నుగువస్తువు లరణము, కన్నియ కిడి వెంట మూఁడుగమనము లరుగన్
మన్నించి నిలిపి వీడ్కొని, యున్నతముగఁ బతియుఁ గూర్మియువిదయుఁ దానున్.

## మాంధాత పత్నీసహితుఁ డై యయోధ్యకుఁ జేరుట.

వ. సైన్యసమేతుం డై కతిపయప్రయాణంబుల నయోధ్యాపట్టణంబు గదియం జని నిజ
సామంతపౌరవర్గంబు లెదుర్కొన మహోత్సవాలంకృతం బైనపురంబు ప్రవేశించి
సఫలమనోరథుం డై మఱునాఁడు వివాహసమాహూతు లై వచ్చియున్నసకలరాజ
లోకంబు నుచితసత్కారంబులం బ్రీతులం గావించి నిజదేశంబుల కనిపి యుచిత



వ్యాపారంబుల దినశేషంబు గడపి నిశోదయంబునఁ గృతకరణీయుం డగుచు నవో
ఢారిరంసామాంసలం బైనచిత్తంబున. 197

## విమలాంగీమాంధాతలు క్రీడాగృహము సొచ్చుట.

సీ. రతిబంధబంధుర ప్రతిమావితానంబు, కల్పితకల్హారకల్పకంబు
సురభితైలోదయచ్ఛురిత ప్రదీపంబు, కర్పూరధూపసమర్పణంబు
శుక్తివిన్యస్తకస్తూరీపటీరంబు, వీటికాపరిపూర్ణపేటికంబు
శయ్యాసమీపకాంచనకళాచికంబు, గంధవద్వారిభృంగారుకంబు

గీ. భర్మపంజరశుకశుకీపఠ్యమాన, కామశాస్త్రోక్తబహుపద్యగద్యకంబు
కరణనికరసమున్మాదకారణంబు, మనుజపతి సొచ్చె మోహనమందిరంబు. 198

వ. చొచ్చి క్రీడాగృహమధ్యంబున సమున్నతరత్నపీఠంబు నలంకరించి యుచితపరిచారి
కలు సేవింప నుండునంత నట మున్న పాలికాదిప్రౌఢసఖీజనంబు విమలాంగిం జేర
నరిగి. 199

తే. గాజుపూసకుఁ గనకనిష్కములు వ్యయము, సేఁత తక్కినపనులు గై సేఁత సతికి
జాతిమణి గొనఁ గనకనిష్కములు వ్యయము, సేఁత వరుఁగూర్చుపనికిఁ గై సేఁత సతికి.

వ. అట్లగుట నీవు నిష్ఫలుడు సఫలం బైనశృంగారం బంగీకరింపవలయు రమ్మని ప్రారంభ
ప్రయోజనంబు దేటపడం బలికి ప్రహర్షజనితముఖవిలాసాలంకృత యగునచ్చెలువకుఁ
బునరుక్తంబుగా సముచితాలంకరణం బొనరించి తోతేర లజ్జాప్రవాహంబు
నకు నెదురేగుట గా నెట్టకేనియుం గేళీమందిరంబునకు వచ్చునప్పుడు. 201

తే. నిబిడవీచీపరంపరానీత యగుచుఁ, గొలనిదరిఁ జేరుజలరుహంబులపరాగ
రేఖయునుబోలెఁ బ్రియసఖీప్రేరణమున, నొయ్యనొయ్యన సతి కేళిశయ్యఁ జేరె.

తే. తల్పమునకు సఖీప్రయత్నమున వచ్చు, నభినవోఢకు నడుగడుగామ డయ్యె
దలఁపుపురపురగొనఁ దత్తటిలుతదీయ, కాంతునకుఁ దత్క్షణము బ్రహ్మకల్ప మయ్యె.

క. మరుఁడును లజ్జయు డెందము, సరిపాలం బంచికొనఁగ సాధ్వసమునఁ
దత్పరిశిష్టాంశము గొనియే, వరతల్పమునకు నవోఢ వచ్చెఁ గడంకన్. 204

వ. ఇట్లరుగుదెంచి ప్రాంతరత్నస్తంభంబు డాపుగొని సఖీజనంబులమరువున లజ్జావనత
వదనారవింద యగుసుందరిం గడచి ముందటికి వచ్చి తనను మ్రొక్కినపాలికం
జూచి నృపాలతిలకుం డాఁగినమనగప్రమోదంబు మొగంబున దరహాసంబు మొలపింప
ని ట్లనియె. 205

ఉ. పాలిక! యేమివార్త? ధరపై ధర కేమిటివార్త! దేవ! నీ
వేలఁగ నొవ్వగోరుకొను దీవనుభీతియె దక్క మానెఁ గా
కేల భయంబు! సేయుపని యెవ్వరుమాను మనంగఁ గర్త? లీ
వేలిక వొంట రెంట నయ మిమ్మని కాకిటు విన్నవించుటల్. 206

చ. ఇది తఱి యయ్యెఁ జంద్రుఁ డుదయింపఁ డదే? ముదయింపకుండు టె?
ట్లుదయముపై మొగుల్పొదివి యున్నది యింతియె కాక యద్దెసం
బొదలెడునాఁకటన్ బడలెఁ బొమ్ము చకోరము లంత యేల పై
నొదవెడు మేఘము ల్దొలఁగ కుండఁగ వచ్చునె శీతరోచికిన్? 207

వ. అని యిట్లు నర్మగర్భంబుగా నన్యాపదేశవచనసందర్భంబులం దనతలంపున కనుగుణంబులు గాఁ బ్రత్యుత్తరంబు లిచ్చినప్రౌఢతనంబునకు మెచ్చి పాలికకు నితరసఖీజనంబులకుం గర్పూరవీటిక లొసంగిన నచ్చెలువలు విభునిహృదయపరిపాకం బెఱింగి యొక్కొక్క నెపంబునం గన్నియ మోఱంగి యందఱుం గ్రీడామందిరంబు వెలువడిన యనంతరంబ. 208

## నవోఢాసంగమవర్ణనము.

క. కెలనిమణికుడ్యతలమునఁ, బొలసినతననీడ దోడిబాల యనుచు న
చ్చెలువవిభుఁ డంత నొయ్యనఁ, బలికించినఁ దెలిసి యులికిపడి వెడలు నెడన్. 209

ఆ. చెట్ట యొడిసిపట్టి సెజ్జకుఁ దివియుచో, నడుగు బిగ్గఁ ద్రొక్కి యతివ యపుడు
కూర్మి విభునిమీఁద గొనయ మెక్కించుచో, నల్ల వంగుమరునివిల్లువోలె. 210

చ తలిమముఁ జేరకున్న మదిఁ దత్తఱ మెత్తి విభుండు బాలికన్
నిలువునఁ గౌఁగిలింప రమణీరమణీయశరీరయష్టి ము
త్పులకిత మైనఁ బొల్పెసఁగె భూవరకల్పకబాహుశాఖలన్
వలగొని యున్నకోరకితవల్లిమతల్లియుఁ బోలె నయ్యెడన్. 211

సీ. వెడలి పోఁ దలఁచుచో నొడిసి కేల్పట్టినఁ, దిరిగి నెచ్చెలిఁ జూచుదీనదృష్టి
శయ్యకుఁ దిగుచుచోఁ జను దేక బిగ్గరఁ, జరణాంబుజము ద్రొక్కు చండితనము
బలిమిఁ గౌఁగిట గ్రుచ్చి తలిమంబుఁ జేర్చుచో, నొడఁబాటు చాలనినిడుదయూర్పు
ముంగేల వంచినమొగ మెగయించుచో, మెయికొను నేత్రనిమీలనంబు
గీ. మాటలాడక చేకొన్నమౌనముద్ర, యైదు నివి పంచబాణుని కైదుతూపు
లయ్యెఁ బతిడెందమునఁ గాఁడునట్టు లేయ, నంగనామణిగవిక్రొత్తసంగమమున. 212

సీ. తలవంచుటయె కాని తప్పక కనుప్రేమ, ఘన మని లోచూపుగతము వెట్టె
మౌనముద్రయె కాని మాటాడువేడుక, గడు సని ముఖకాంతి మడియ వేయ
నడ్డగించుటె కాని యాలింగనప్రీతి, బలు వని కంపంబు బాస సేయఁ
బైవెట్టుమియె కాని పైకొనుతమికల్మి, సత్తని పులకలు సాక్షి పలుకఁ
గీ. గరుణముగ నేఁడఁ జొరవియె కాని మనసు, కరఁగినది యని చెమటపై కంటఁ జాట
హృదయనాథుని వదిడక్క నేలకొనియె, బాలికామణి యపుడు దాఁ బ్రథమరతిని.



చ. బలిమి రసాతిరేకమునఁ బయ్యదకొం గెడలింపఁ గంపముం
దళుకును గల్గుతొల్కరిఁ గనంబడుక్రొత్తమెఱుంగుఁబోలె న
ప్పొలఁతిమెఱుంగుమేనదియు భూవరుతాల్మి మఱుండుఁ దెంపఁగాఁ
బెలుచ నొర స్వెడల్పి జళిపించుకృపాణిక యయ్యె నయ్యెడన్. 214

క. కొల్లలు గో నట్ట్రాడెడు, వల్లభుదృఙ్మధుపతతుల వ్రాలఁగనీక కు
త్ఫుల్లకుచగుచ్ఛములఁ గర, పల్లవపుటయుగళిచేత బాలిక పొదివెన్. 215

తే. కంకణక్రేంకృతులపేరఁ గలహ మాడి, యాధిపుకరములతో బాలహస్తయుగము
సరిఁ బెనంగఁగ నా కేల జగడ? మనుచు, జాఱుగతి నీవి తనుఁ దానె జాఱె సతికి.

తే. పయ్యెద బలము దూలినఁ బఱఁతి బాహు, శక్తిఁ గుచదుర్గములఁ గాచి జాఱునీవిఁ
బట్టఁ బోయిన రాజుచేఁ బడియె రెండు, భేదమున నెంతకార్యంబు గాదు తలఁప?

తే. ముగ్ధ యగుఁ గాక యే? మింత ముగ్ధ గలదె? బాల జఘనాంశుకం బింక నేల పెనఁగ?
రాజవరునకు రోజదుర్గములు రెండుఁ, జేపడియె నట్టె యిఁకఁ గ్రిందిసీమ యెంత?

క. ఒడిసి జఘనాంశుకం బపు, డెడలించినవిభునిదృష్టి కెడయీనిమతిన్
బడఁతుక లజ్జావశమునఁ, గడువడితోఁ బొదవి బిగ్గఁ గౌఁగిటఁ జేర్చెన్. 219

ఉ. చూడనిచూడ్కియు న్బలుకఁ జూడనివాక్కును గౌఁగిలింపఁగాఁ
జూడనికేలుగంటి యిడఁ జూడనిమోవియు మాఱుసేయఁగాఁ
జూడనిచెయ్వుఁ బైకొనఁగఁ జూడనికాయముఁ గల్గి తొల్తొలిన్
జేడియసంగమంబు నృపుచిత్తముఁ దత్తఱ పెట్టె నింపునన్. 220

చ. వెఱపు నలంతికంపమును వీడనివ్రీడయు మాఱుసేయఁగా
నెఱుఁగమి యేపులేమి షరియె తైడుచొక్కులగోలు ముందుగా
మఱుపుమొగంబు నోరయును మాటుగ నొప్పులఁ గప్పుచూడ్కియుం
దెఱవ నవాగ్రసంగతిఁ బ్రతిక్రియ లై యలరించె భూవిభున్. 221

సీ. కేలితోఁ గేలుకెంగేలఁ గీలించుచోఁ, బులకోద్గమము వెంట వెలువరించి
యొయ్య నొయ్యన మీఁదఁబయ్యెదఁ దివియుచోఁ, జొడము కంపముతో నెడలఁ దూఁ
కడునించు మెత్తనికౌఁగిటఁ జేర్చుచోఁ, గ్రమ్ములేఁ జెమటలఁ గనఁగఁ జార్చి
వారించి యొల్లనివర్తఁబు లట్లుచోఁ, బాణికెల్ల నెళవులు ఫణికి వైచి
గీ. పలుదెఱంగుల మదిసిగ్గు వెలితిపఱచి
దినకరాన్వయుఁ డొకకొన్నిదినములకును
బొలఁతియెడఁ బూన్కి కొడఁబాటుపొందుఁ గాంచె
నిగ్రుచుకోర్కులఁ దనడెంద మివతళింప. 222

సీ. పదిప్రశ్నముల కైనఁ బ్రత్యుత్తరముఁ బొందఁ, జూచువీనులకింపు రేఁచిపెట్టి
నిరువదిపాంచల కెదిరించు నొకచూపు, కనుబండువను సంచకరువు గాఁగ
ముప్పదికౌఁగిలింపులఁ గాంచుబిగి యెందుఁ, జొఁకుచోఁ గొనగోరు సోఁకఁ జేయ
నలువదిమనవులఁ గలయొక్కయొడఁబాటు, పారవశ్యమునకుఁ బరిసనముగ
గీ. సడ్డగింపును గాక సయ్యాట లేక, యంతరాళంబు లొకకొన్నియహము లహహ!
వేఱ యొకకొంత రుచి గొల్పె విభునిమదికిఁ, గిసలయాధరతో రహఃక్రీడనములు.

సీ. నెమ్మోవి దాఁచెడి నెపమునఁ జెక్కులు, చుంబింప నెడ మిచ్చు సుదతి నేర్పుఁ
గినిసి చెక్కులు దాఁచికొనియెడి నెపమున, మోము మోమునఁ గూర్చుముదితవెరవు
వెడలెడితననీవి సవరించు నెపమునఁ, గౌఁగిటి కొదవించు కాంతతలఁపుఁ
గరములఁ జనుదోయి గప్పు నెపంబున, నీవిక సందిచ్చు నెలఁతమతముఁ
గీ. దొడిఁబడక గానఁ బడనీక యొడలు నులియు, నెపము మైఁ గౌఁగిటి కెదుర్చు నీరజాక్షి
యుపమయును భూమివల్లభునుల్లమునకుఁ, గ్రొత్తచవి గొల్పె మఱి వేఱొకొన్ని నాళ్లు.

ఉ. చేసినచోఁ బ్రతిక్రియలు సేయ నెఱుంగమి మున్ను తోడుతోఁ
జేసినచేఁతకు న్మరలఁ జేయఁగ వేడుక సేసి యంతటన్
జేసినఁ జేయఁ జొచ్చెఁ జెలువెయ్యుల నంతట బ్రోడ యై తుదిన్
జేసెఁ బయోజనేత్ర పతి సేయక యున్ రతిఁ జేయుచెయ్యులన్. 225

సీ. ఈక్షింపఁగా నేర్చె నిక్షింపుఁజూపుల, మోవిఁ గూర్పఁగ నేర్చె మొలకనవ్వు
పాలయింపఁగా నేర్చె భ్రూలతానటనంబు, విన నేర్చె నర్మోక్తి వీను లాని
యెదురొత్తఁగా నేర్చె నిఱియఁ గౌఁగిటియందు, మొగమెత్తఁగా నేర్చె మోవిఁ గమువ
గర మెత్తి యీ నేర్చెఁ గర్పూరవీటిక, నలరింపఁగా నేర్చె నంఘ్రి లెత్తి
గీ. నేర్చె గరువింప మెచ్చింప నేర్చె నేర్చె, మొగము గనుపట్టి యలుకమై మ్రొక్కుగొనఁగ
జెలువపతిచేతిరతికళాశిక్షణమునఁ, బంచబంగాళముగ లజ్జఁ బాఱఁదోలి. 226

వ. ఇట్లు క్రమక్రమప్రవర్ధమానంబు లగు ప్రణయంబులచందంబునం బ్రోడతనంబులు సమ
ప్రవృత్తంబు లై. 227

సీ. మెఱఁగి కన్గొనుచోట మెఱుఁగుపై మతి దప్పి, పోక యొండొరుల నాపోక చూచి
సిగ్గునఁ బలుకుచో సిగ్గుపై మతి దప్పి, యుచ్చ నొండొరుఁతో ముచ్చటాడి
నెపమునఁ బొందుచో నెపముపై మతి దప్పి, కాంక్ష నొండొరు బిగ్గఁ గౌఁగిలించి
తాలిమి నెఱపుచోఁ దాల్మిపై మతి దప్పి, కాయ్యమై నొండొరుఁ గడవఁ గరఁగి
గీ. గుట్టు చెల్లింపలేక లోగుట్టువడని, తమమతులకూర్మి నివ్వెఱతమక గదురఁ
భావిలుతుచేతిచిత్రంపుబొమ్మ లగుచు, జంపతులు సల్పిరంగజస్వైరవిధులు. 228



ఉ. సిగ్గునకుం బికాపికలు చిత్తసమున్నతి పేరివార్తకుం
గగ్గులకాళ్లు శంకలకుఁ గన్నెనియొగ్గులఁ బుట్టునల్కకు
న్నగ్గిసముగ్గిసల్ నిలుపుసైరణకు న్దననీనిరొత్తికో
ళ్లగ్గజయానకుం బతికి నయ్యె యభీష్టరహఃప్రసంగముల్. 229
చ. అలిగినవేళ నయ్యెడి నిజాంగజతాపము పేరియెండలున్
గలసినవేళ నయ్యెడి మొగంబులనవ్వుల పేరివెన్నెలల్
దలఁచుటె కాని యవ్విభుఁడు దన్వియు సంతతకేలిలోలతన్
దలఁప నెఱుంగ రెన్నఁడు దినంబులయెండలు రేలవెన్నెలల్. 230
సీ. మాధవీమధుపానమత్తాలినీగాన, విభవాకులోద్యానవీథికలను
జంద్రికానిర్ధూతజలదపథోపేత, శశికాంతకలధౌతసౌధములను
గాదంబినీజాలకలకలవాచాల, శైవలినీలోలసైకతములఁ
గలితలీలాయత్నకల్పితగిరినూత్న, కాంతి నానారత్నకందరముల
గీ. మఱియు వివిధవిహారైకమందిరముల, నిచ్చనిచ్చలు గ్రొత్తలై యెచ్చరించు
ఖేలనంబులఁ దెప్పలు దేలుచుండె, నెలఁతయును దాను మాంధాతృనృపవరుండు. 231

ఆశ్వాసాంతము.

ఉ. ఆర్తిక్షీణగజేంద్రరక్షణకళావ్యాఘాతవిఖ్యాతిమ
త్కార్తృత్వప్రతిమల్ల పల్లవసతీకౌమారహారక్రియా
ధూర్తాగ్రేసర సహ్యసంభవ లసమ్వ్యశ్యఘాంతరంగస్థలీ
మూర్తోస్మద్విధభాగధేయ శరదంభోజాతపత్రేక్షణా. 232
క. డోలాలీలాందోళన, ఖేలాస్వగతాగతాభివీక్షణజనితో
ద్వేలప్రమదాంబుధిక, ల్లోలప్లవదస్మదాదిలోక స్వాంతా. 233
భుజంగప్రయాతము.—
అభద్రాంధకారోదయద్భానుభావా, శుభైకాశ్రయీభూతశుద్ధస్వభావా
యభక్తావళీదృష్టశ్యహఃకాలతారా, స్వభక్తాగ్రభూపారిజాతావతారా. 234

గద్య. ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరోజసేవకోపసేవక నరసింహనామధే
యప్రణీతం బైన కవికర్ణరసాయనం బను కావ్యంబున నాయికానిరూపణంబును, యౌ
వనవర్ణనంబును, విప్రలంభంబునందు దశదశానిరూపణంబును, వివాహంబును, నవో
ఢాసంగమంబు నన్నది తృతీయాశ్వాసము.





# చతుర్థాశ్వాసము.



రంగనిలయ వలయా
కారాభయముద్రితైకకరకిసలయ లీ
లారసనిరంకుశస్వే
చ్ఛారచితజగత్ప్రసూతిసంస్థితివిలయా.

## వసంతర్తువర్ణనము.

ఉ. భాసురలీల నయ్యె నిలపై మధుమాసము గర్వితేక్షుబా
ణాసకృతాట్టహాసము భయాకులపాంథవిముక్తదీర్ఘని
శ్వాసము కోపనాధృతినివాసము కోకిలకీరషట్పదో
ల్లాసము దత్తభూరుహవిలాసము సర్వమనోవికాసమై.

ఉ. ప్రాయము భూరుహంబుల కపాయము మంచున కాపతత్పవి
ప్రాయము పాంథకోటికి నుపాయము చిల్కలకున్ సమాపనా
ధ్యాయము కోపనాధృతికి దాయము చల్లనిగాలి కెన్నఁగా
నాయము పుష్పబాణునకు నామని నేమని ప్రస్తుతింపఁగన్?

చ. తెగినమనోభవుం దిరుగఁ దెచ్చి కుజంబుల కెల్లఁ బ్రాయము
ల్మగుడఁగ నిచ్చి యన్యభృతమండలిమూఁగతనంబు వుచ్చి ము
జ్జగముల వార్త కెక్కినవసంతభిషగ్వరుఁ డాప్తుఁ డయ్యెనుం
దగుగతి మాన్ప లేఁడ మఱి దక్షిణవాయువునందుఁ జాడ్యమున్.

క. తొలఁగి చిరకాలమునకుం, గలసినమాధవునిమీఁదఁ గనలి వనశ్రీ
తలిరుల నెఱ్ఱంబాఱుముఁ, గలకంఠప్రథమవాక్యగతులం గొణఁగెన్.

ఉ. ఆసమయంబున న్మధుసమాగతలక్ష్మి వనప్రవేశముం
జేసినవేళఁ జూడ బొలిచెం బికషట్పదభూతతృప్తిగాఁ
బోసినమాంసపుంజములపోలికఁ బల్లవితామ్రసంచయం
బాసవపాత్రలయ్యె వకుళాగ్రదళమ్ముకుళప్రతానముల్.



ఉ. పొన్నలు నవ్వెఁ గ్రొన్ననలపుష్పరసంబునఁ గేసరంబు లు
త్పన్నజుగుప్స మై నుమిసెఁ బాటలము ల్గసుమోదయంబుచేఁ
గన్నెఱ చేసెఁ దిట్టెఁ గలకంఠరుతంబులఁ జూతము ల్వృథా
మున్నుగ నన్నిటం గడచి మోదుగుపువ్వులవిఱ్ఱవీఁగినన్. 7

చ. చిగురులచేతఁ గోయిలలఁ జిత్రఫలంబులచేతఁ జిల్కలం
దగుపువుఁదేనెచే నలులఁ దావులచే మలయానిలంబులన్
మొగడలచేఁ బ్రసూనశరు మోదితుఁ జేసి యభీష్టదంబులై
పొగడిత కెక్కెఁ గల్పకముఁ బోలె రసాలకుజంబు లామనిన్. 8

సీ. వివిధవనీరమావిమలసాంద్రకటాక్షవీక్షాపరంపరావిలసనములు
మలయమారుతచరన్మత్తేభచరణావలంబితాయతశృంఖలాలతికలు
పథికజనావలీప్రతిసమాకర్షణప్రద్యుమ్నముక్తదోర్గ్రప్రగ్రహములు
మధుజగన్మోహనమంత్రవాదికరాబ్జవలమానవలినాక్షవలయితములు

గీ. ప్రథమకౌమారనవపరిపాకకలన, వికసదభినుతతరులతాగ్రకరమంజు
మంజరీమధుమధురిమోన్మాద మెసఁగ, మెలఁగె బహువిధగతులఁ దుమ్మెదలగములు. 9

చ. పనివడి హారదంతురితపాండ్యవధూకుచశైలసంధులన్
ఘనముగ డస్సి చోళనవకంజముఖీరతిఘర్మవారి నా
ని నెఱిని గుంతలీసురభినిశ్వసనంబుల నూఁత గొంచు నో
య్యనఁ జనుదెంచె నంత మలయాచలశీతలవాతపోతముల్. 10

క. మమ్మురపుందేనెలజడి, చెమ్మలపనవీథు లెల్లఁ జెన్నగుటఁ జుమీ!
కమ్మవిరితావిమోపరి, తెమ్మెర లొయ్యొయ్య వెఱచి తిరుగుట లెల్లన్. 11

చ. చలువలపుట్టినిండ్లు నవసౌరభలక్ష్ముల కంతరంగముల్
మెలఁపులకున్నివాసములు మెచ్చులచేరుగడల్ విరక్తతా
కలనల కెత్తుకోళ్లు తమకంబులకుం గయిదండ లామనిన్
మలయుచు వచ్చె గంధగిరిమంధరబంధురగంధవాహముల్. 12

సీ. రేల వెన్నెలలు పండ్రెండుసూర్యులచూపు, బీఱెండలై కాసి నీరసింప
దక్షిణానిలము లుద్ధతి నేడుదెఱఁగులఁ, బెరిగెడు గాడ్పులై పెల్లగింపఁ
గెంజాయ దిక్కులఁ బింజించు చిగురులు, కాలానలార్చులై కాఁకఁ బెనుప
నలి శుకపికగర్జ లడరఁ బూదేనియ, ఘోరాంత్యవృష్టియై కురిసి కలఁప

గీ. విరహవేదన లెసఁగి యుద్వేలగతుల, నద్భుతముగ నేకార్ణవ మగుచు ముంప
నఖిలసుఖకారి యగువసంతాగమంబు, పథికలోకంబునకు మహాప్రళయ మయ్యె.

ఉ. పూచినపువ్వు లెల్ల సతిఁ బొందె మనోభవునంపకోల లై
వీచినగాడ్పు లెల్లఁ బొదలె న్మలయాచలమారుతంబు లై
యేచినపల్కు లెల్లఁ దగియెన్ బికభృంగశుకస్వరంబు లై
చూచినరూప మెల్ల మదచుంబిత మై విలసిల్లె నామనిన్. 14

చ. ప్రసవశరప్రతాపశిఖిఁ బర్వఁగఁ జేయుటచే నిదాఘ మై
కుసుమరసాతివర్ష మునకున్ గుదు రౌటఁ బయోదకాల మై
రసికమనోంబుజంబు లలరంగ శర త్తయి తాన శైశిరో
ల్లసనముఁ జూపి పాంథసతులన్ వణఁకించె వసంత మత్తఱిన్. 15

### మాంధాత యువతులఁ గూడి వనవిహారము సల్పుట.

వ. ఇట్టివసంతసమయంబున మహీరమణశేఖరుం డొక్కనాఁడు విహారకుతూహలంబునం బ్రేయసీసమేతుం డై గణికాగణంబులు విటవిదూషకాదిక్రీడాపరికరజనంబులు నర్మవాహనారూఢు లై కొల్చి రా విరచితోచితవివిధవిచిత్రక్రీడాలతాగృహాలంకృతాంతరంబునుం గేళీశైలశైవలినీప్రముఖనానావిహారప్రదేశోపశోభితంబును వసంతవిలసితస్వవిలాసాపహసితనందనంబును నగునగరోపవనంబు సొత్తెంచె నప్పుడు. 16

ఉ. ఇంచుగతిం బరాగ మెగయించియు వెంటన వచ్చుతేంట్ల మ్రోఁ
గించియుఁ గమ్మతావు లొలయించియుఁ బైమకరందబిందువుల్
నించియు మెచ్చి తన్ బొగడు నేర్పు లొసంగుచు నెల్లవారికిన్
బంచవిధేంద్రియంబులకుఁ బండువు చేసె వనీసమీరముల్. 17

వ. ఇట్లభినుతప్రమదవనసమీరంబు లెదురుకొనం గ్రీడావనమధ్యంబు తఱిసి వివిధమధురతరులతావిశేషంబులం గలుగునభినవకుసుమకిసలయఫలపరాగమకరందమిళిందశుకపికమిథునసంపదల నుత్కర్షించుచుం గలయ మెలంగి పుష్పాపచయముఖేచ్ఛావిహారంబులకు నందఱ నద్దినం బెల్ల నచట నిలువ నియమించి పాలికాదిసఖీజనంబులు గొలువ విమలాంగియుం దానును వసంతునింటికి విందువచ్చురతీసహాయుం డైనమన్మథుండునుం బోలె నొక్కయభ్యంతరవనాంతరంబు చొచ్చి యందు. 18

సీ. నవలీల మలయగంధవహుండు వివిధపు,ష్పామోదముల నుపాయన మొసంగఁ
గలకుహూరుతములఁ గలకంఠములు సవి,నయభంగి విజ్ఞాపనంబు చూపఁ
బరిపక్వఫలరసప్రణతిమైఁ దరువులు, కిసలయాంజలిపుటీక్రియ ఘటింపఁ
గలితప్రసూనసంగతి వల్లికలు తల్ప, రచనామహోపచారము నొసర్ప
గీ. లలనతో రాజు వనవీథికల సుఖించె, మంజరీపుంజనిష్యందమానమధుర
మధురసాస్వాదసమ్మోహమధుపగీతి, మాధురీధుర్యమాధవీమండపముల. 19



### పుష్పాపచయకేళీవర్ణనము.

వ. అంత నిటఁ దరుణీతరుణజనంబులు పుష్పాపచయవినోదంబులం దగిలి విహరించు నప్పుడు. 20

సీ. అలరుల కెత్తుచో నఱచేతికెంజాయ, లొదవి కోయిలల నోరూరఁ జేయ
నునుమేను లలసి మ్రానులమీఁద నొరగుటల్, తీవలఁ బ్రాఁకినతెఱఁగు దెలుపఁ
జెలికత్తియలలీలఁ బిలుచునున్నలుకులు, మదకీరములముద్దుమాట లార్ప
బుగబుగ వలచునూర్పులతావు లెసఁగి క్రొ,న్ననలకు వింతవాసన లొసంగ
గీ. నిక్కి కొనగొమ్మ లందుచో నీవి జాఱి, బయలుపడి యొప్పునాభికూపములసొబగు
లంగలతలకు నరవిరు లై చెలంగ, సతులు పుష్పాపచయకేళి సలిపి రర్థి. 21

చ. చనుఁగవకంటె గుచ్ఛములు చక్కనయే? యధరంబుకంటె నే
ననుచు చిగుళ్లు? నీదువచనంబులకంటె నె చిల్కపల్కులున్?
వనమున నాకువింతలఁటె వస్తువు? లంచు నివృత్తుఁ డయ్యెఁ దో
డన యొకఁ డల్కమైఁ దనపడంతుక క్రమ్మఱి యింటి కేఁగఁగన్. 22

చ. పొడవున నున్నపల్లవునిఁ బూవులు వేఁడుచు నొక్కనెయ్యపుం
బడఁతుకహస్త మెత్తుటయుఁ బయ్యెద జాఱె కుచోదయాద్రిపైఁ
బొడిచి వినూత్నరాగరుచిఁ బొల్పవహించునఖాంకచంద్రుచే
ముణిఁగె నొకంతలో సవతిముద్దియపిండుముఖారవిందముల్. 23

చ. అందినవారు పుచ్చుకొనుఁడా! యని చేవిరిబంతి యెత్తినన్
జందనగంధు లిద్దఱొకజాణనివీఁపు నురంబుఁ జన్నులా
సందునఁ జిక్కి నొక్కుచును సారెకు నిక్కఁగ శంబరారిచేఁ
జెందలిరాకువాలునొఱచేఁ బెడపోటనుబోని వ్రేటునన్. 24

చ. ఇరువురయందు మున్నొకతె కిచ్చిన నొక్కతె యల్గు నంచు మీ
యిరువురలావు గాన నగునీవిరిఁ గైకొనుఁ డంచుఁ బల్లవుం
డిరువురముందఱన్ బడఁగ వేసినఁ దక్కపటం బెఱింగి మ
మ్మిరువుర సాటి సేయఁ దగునే? యని యొక్కట నల్గి రిర్వురున్. 25

చ. తనప్రియుమీఁద నొక్కలత తార్కొని గుచ్ఛయుగంబు మోఁపినన్
గినిసి సపత్ని గా దని సఖీజనసాక్షి నెఱింగినట్టియం
గననికటంబునన్ సవతి కాంతునిపైఁ బడి పెన్నురంబునన్
జనుఁగవ మోఁపినన్ గినియఁ జాలద వేఱొకతీవ యన్నమతిన్. 26

చ. పిలిచితి నన్ను వేఱొకతెపేరున నే నివి యొల్ల నంచు ము
న్నలిగె నొకర్తు పల్లవున కవ్వల నొల్లక రోసినట్టియా

యలరుల నిచ్చెదే యనుచు నల్గె సపత్నియు నట్ల కాదె ధూ
ర్తులు తుద నెల్లవారలకు దూరుల పో తలపోసి చూచినన్. 27

చ. తనుఁ బెరపేరఁ బిల్చి యిడఁ దత్కుసుమంబులఁ బూఁచి మోమునన్
గినుకున వ్రేసె నొక్కసతి కేసరరేణువు రాలె నంచుఁ జేఁ
గనుఁగవ మూసికొన్న వెతఁ గౌఁగిటఁ జేర్చుచుఁ గేలుపుచ్చి చూ
చిన నగుధూర్త పల్లవునిచేఁతకు గాసిలి యల్గెఁ గ్రమ్మఱన్. 28

ఉ. నేరవు నీవు కొప్పిడఁగ నే ఘటియించెదఁ బువ్వు లంచు నం
భోరుహలోచనన్ దిగిచి ముందర నుండఁగఁ బంచి యొక్కరుం
డీరస మొందు తోడిసతి కివ్వలమోము మలంచి చుంబనా
చారముచే ఘనప్రియము సల్పె సఖుల్ తన నేర్పు మెచ్చఁగన్. 29

ఉ. సవతి మొగంబు చూచుచు నొసంగినపల్లవుమీఁదికిన్వనన్
దవిలిన నెవ్వఁగం దనువు తప్తము గాఁ దలవంచి యున్న య
య్యువతికరంబులోనివిరు లూష్మతఁ గందుట చెప్ప నేటికిన్?
గవిగొను దానియూర్పులసెకన్ గసుగందె వనంబుపువ్వులున్. 30

చ. చిగురులఁ గర్ణపూరములు సేయుతలంపునఁ గోయునంతలోఁ
దగ వతి యవ్వలన్ విటుఁడు తాను సపత్నియుఁ గూడుకొన్న నె
వ్వగ నొకపువ్వుఁబోఁడి వలవంతల వేఁగుచుఁ జేత నున్న యా
చిగురులె సెజ్జ చేసికొనియెం దనతాపభరోపశాంతికిన్. 31

చ. తలిరుల నెల్లఁ గోసి కరతామరసద్యుతి వెల్లి గొల్పఁగా
నలరుల నెల్లఁ గోసి నఖరాంచలదీప్తులు పై నిగుడ్పఁ గాఁ
జిలుకల నెల్లఁ దోలి తమచిన్నియెలుంగులభంగిఁ జూపఁగాఁ
జెలువము క్రొత్త యై సతులచే వనవాటిక యొప్పె నయ్యెడన్. 32

తే. తమయలంకారములకు నై తరుణు లెల్లఁ, గ్రొవ్విరులుఁ గ్రొంజిగుళ్లును గోసి రైన
దాన వనవాటికయుఁ బోల్ప తఱుఁగ దయ్యె, దారయయ్యింతులొకయలంకార మగుట.

చ. అనుఁగువిటుల్ ప్రసూనముల నాభరణంబులు గూర్ప నేర్పుమై
ననువు లెఱింగి మేనికళ లారసి మర్మము లంటు వేళలన్
దనువులఁ బుట్టు చిత్తడుల దట్టము లై దిగజాఱెఁ గాంతలం
దనయము రేఖ లై వనవిహారపరిశ్రమఘర్మతోయముల్. 34

చ. పొలఁతులకున్ వనీవిహృతిఁ బుట్టినసేదలు దొల్కరించినన్
వలిచనుఁగొండలం బొడమి వచ్చుపరిశ్రమవారివాహినీ
విలసనరేఖకున్ వళులు వీచిపరంపర లయ్యె నిమ్ననా
భులు తిరు లయ్యె వాలుకలపుంజము లయ్యె నితంబబింబముల్. 35



సీ. కుచకుంభభారభంగురమధ్యలతికలు, పునరుక్తగుణయుక్తిఁ బూనుకొనఁగఁ
గరఁగినతిలకరేఖలతావులకుఁ జొక్కి, నట్లు కురుల్ నొసల్ గ్లత్తుకొనఁగ
వ్రేఁకంబులకుఁ దోడు విరులవ్రేఁగులకల్మి, వీడెడుక్రొమ్ముళ్లు వెన్ను లొరయ
మఱి నిసర్గము లై నమందయానంబులు, తొట్రుపాటున వింతతోడవు దాల్పఁ
గీ. దఱచుటూర్పులు తమకమ్ముతావివలన, నలుల కలరులు గ్రోలినయరుచి మాన్ప
సతులు పుష్పాపచయకేళిఁ జాల నలసి, కోరి రాత్మల నంభోవిహారకేళి. 36

## జలక్రీడాభివర్ణనము.

చ. బడిబడిఁ బ్రాంతదీర్ఘికలఁ బద్మసుగంధిపయస్తుషారముల్
జడిగొన నల్లనల్లఁ బయిఁ జల్లుచు వాడినపువ్వుఁబోంట్లకున్
బడలిక లార్చి చేకొనియెఁ బ్రస్తుతు లయ్యెడ మందమారుతం
బెడరున నైనచుట్టమున కెవ్వరు సాటి జగత్త్రయంబునన్. 37

ఉ. పల్లవధూర్తు నెన్నడుము పార్శ్వ మొగిం గుడిచంట నొత్తి దో
ర్వల్లరి మూఁపునం బెనఁచి వ్రాలి యురంబునఁ జెక్కుఁ జేర్చి సం
ధిల్లెడుచూడ్కితోన నడదేరఁగ నెచ్చెలిపిండు సన్నిధిం
జెల్లె విదగ్ధతాగరిమ సేద నెపంబునఁ బద్మనేత్రకున్. 38

చ. తరుణుల కింపు లై తనరెఁ దత్సమయంబులయందుఁ బార్శ్వచా
మరములు గల్గి భర్తృముఖమారుతపాతము లుష్ణవారణో
త్కరములు గల్గి యైనఁ బ్రియకాముకహస్తపటావకుంఠముల్
పరిజన మున్న నైన నిజపల్లవదత్తకరావలంబముల్. 39

క. పద్మప్రకాశలక్ష్మీ, సద్మంబులఁ గంకణప్రశస్తముల దళ
త్పద్మాస్య లంతఁ గాంచిరి, పద్మాకరములను బోని పద్మాకరముల్. 40

చ. కొలఁకులు చేర వచ్చి యనుకూలతటంబుల నిల్చి ముగ్ధ లా
నలికులవేణు లయ్యెడ నిజావయవప్రతిబింబశోభగాఁ
దలఁపుచు నల్లమల్ పొదలఁ దప్పక చూడఁ దొణంగి రందులో
జలజములన్ మృణాళములఁ జక్రయుగంబులఁ గండుమీనులన్. 41

చ. గుఱి గడవన్ మరందములు గ్రోలి మదంబునఁ జొక్కి వల్లభ
న్మాఱఁగి పరాలినీరతికి మోదమునం జని తొంటియట్ల కా
నెఱుఁగక యుండఁ దమ్మివిరియింటికి వచ్చినభృంగపల్లవున్
నెఱతన మెన్ని పల్లవుని నీరజలోచన దాఁచెఁ గిన్పునన్. 42

సీ. కదళికలనుకంటె కరభంబులనుకంటె, నిభకరంబులఁ బోల్ప నిహ్హ దనువు
చక్రంబులనుకంటె శకటాంఘ్రులనుకంటె, నిసుకతిప్పలఁ బోల్ప నిహ్హ దొప్పు

గుచ్ఛంబులనుకంటెఁ గుధరంబులనుకంటె, నిఱిజక్కవలఁ బోల్ప నిప్పు డొనరు
నద్దంబులనుకంటె నమృతాంశుఁడనుకంటె, నెలదమ్మిగమిఁ బోల్ప నిపుడు దగవు

గీ. నాఁగఁ బొలిచి రంగనలు నీటియాటల, కెచ్చరించి తఱియు నెడఁ గొలఁకుల
తోయసంగమమునఁ దొడలను బిరుదుల, వలిచనుంగవలను వదనములను. 43

చ. అమితవిలాసినీకుచరథాంగకసంగతి గల్గ దీర్ఘికా
సముదయ మప్పు డాత్మగతచక్రయుగంబులఁ బాయఁ ద్రోచెఁ బ్రాం
తములకుఁ బత్త్రిదేశసవిధాతరళోర్మిభుజాపరంపరన్
దను కొకమేలు గల్గ దిగఁ ద్రావరె యాశ్రితులన్ జడాశయుల్? 44

చ. కువలయపత్త్రనేత్ర యొకకుంభను చాలఁ దరింపఁ జేయ ని
క్కువముగ నీ కయత్నకుచకుంభయుగం బది గల్గ నీఁదనే
రవె! భయ మేల! రమ్మని కరంబుల నీడ్చిన వ్రాలుభీరువున్
వివృతభుజాంతరస్థలనివేశితఁ జేసెఁ బ్రియుండు నవ్వుచున్. 45

క. నిలువున నీఁదుచు రమ్మా, కొలఁదియ యన నేగి మునుఁగుకొలఁదిన యిరుచే
తులఁ బట్టి యెత్త భయమునఁ, గలకంఠి యొనర్చె విటునికంఠగ్రహమున్. 46

తే. ఇంతిదరినుండి చివ్వన నెగసి యుఱుక, నురువుకొని నీరు వలయమై పొరలి విరియ
నడుమ నుదయించెఁ జక్కనినగుమొగంబు, మథ్యమానాంబునిధిఁ జందమామవోలె. 47

తే. ఒత్తిగిలి యీఁద నీటిపై నొంటిఁ దోఁచు, కొమ్మవదనాంబుజముపొంత కుచము గాంచి
కవదొఱంగినచక్రవాకం బొకండు, తోడిప్రియసతి యని ప్రీతిఁ గూడుకొనియె.

చ. అలరి యొకింతమాఱుమొగమై యుఱచేతుల నొగ్గి కొన్న న
చ్ఛలమునఁ గాముకుండు పయిఁ జల్లెడునీటిమెఱుంగుఁదుంపరల్
చెలువచనుంగవన్ బొలిచెఁ జేరి తదీయనఖాంకచంద్రులన్
గొలిచి వినూతనద్యుతులు గొల్పెడుతారకపఙ్క్తులో యనన్. 49

క. అనులేపనములు గరఁగిన, చనుఁగవల నఖాంకురములు సతులకుఁ దగు నా
ననపూర్ణవిధులవలనను, ఘనమై జాఱిపడె యొప్పుకళలో యనఁగన్. 50

ఉ. చల్లెడునీటిపై మలయజంబు గరంగిన నింతిచన్నులన్
బల్లవితోరుకాంతి గనుపట్టెడుకెంపులు చూచుశంకమైఁ
బల్లవుఁ డొక్కఁ డివ్వలిసపత్నిమొగంబున నీరుతోడుతో
గల్లిపడ న్వడిన్ బెడమొగం బగునట్లుగఁ జల్లె నార్చుచున్. 51

తే. ధవుఁడు చల్లెడుకరవారిధార లెట్టు, లోర్చెనో కాని తరలాక్షియొద్ద సవతి
తత్కుచాఘాతఘట్టనోత్పతిత మగుచు, నొక్కతుంపర పైబడ్డ నోర్వ దయ్యె. 52



క. మును జలము సవతిపైఁ జ, ల్లినఁ గినుకం గొలనువెడలులేమ విటుఁడు వె
న్కొని యొకబిసతంతువునం, దనువు దవుల వ్రేసి పట్టు దా నన నిలిచెన్. 53

ఉ. క్రొవ్వన నప్పయోరుహముఖుల్ జలఖేలన మట్లు సల్పఁగాఁ
ద్రెవ్వినహారరత్నవితతద్యుతికాంతుల మ్రింగి పూఁతలుం
బువ్వులుఁ జూపుమన్ బయలు వూనె సరోవరసంఘ మట్లపో
యెవ్వఁడు నల్పలాభమున కేల వహించుఁ బరార్థలాభమున్? 54

చ. అతివలు పల్లవుల్ జలవిహారము చాలిచి నిర్గమింపఁ బ్ర
వ్యుతవివిధాంగరాగకుసుమోత్కరభూషణభూషితంబు లా
యతపరిమర్దనిర్దయహతాకృతికంబులునై కొలంకు లు
ద్ధతసురతాంతముక్తమృదుతల్పతలంబులఁ బోలెఁ జూడఁగన్. 55

క. ఖేలనము చాలి వెడలెడు, నాళీకవిశాలలోచనం బాయుటకుం
జాలక తారను వెడలెడు, పోలిక మునుమును తరంగములు దరి కెక్కెన్. 56

ఉ. త్రస్తకురంగలోచనలు దర్పకముద్రలు చాటుగాఁ గృత
స్వస్తికహస్తయుగ్మములఁ జన్నులు చెక్కులు గప్పి పార్శ్వప
ర్యస్తకచాగ్రభాగముల నంబుపరంపర జాఱ నంసవి
న్యస్తనతాస్యలై వెడలి రంబురుహాకరతీరభూమికిన్. 57

ఆ. సతులమేన గాఢసంశ్లేషసుఖమున, నార్ద్రితరములైన యంశుకములు
కరఁగిపోయెఁ గాక కాదేని ప్రకటంబు, లగుట యెట్లు వారి యవయవములు. 58

తే. వర్ణమాత్రంబునన కాక హారిదముల, వర్ణగుణమున గెలువంగ వలసి పోలె
నూటిధారాళవర్ణంబు చూపె నపుడు, కరనిపీడితకామినీకచభరములు. 59

తే. బహురసార్ద్రితఁ దమ్ము నంటి పాయలేని, వసనములు డించి సతులు నీరసములైన
క్రొత్తమణుఁగులు వేడ్కఁ గైకొనిరి యహహ! ప్రియముగై కోరునూతనప్రియలు సతులు.

చ. స్మరపరిదత్తహస్తములు సర్వసమీక్షణభాగధేయముల్
తరుణిమరత్నసానువులు దర్పకదర్పలతావసంతముల్
వరహృదయానురాగరసవార్ధివివర్ధనపూర్ణచంద్రమః
కరములు వేడ్కఁ గైకొనిరి కాంత లలంకరణంబు లయ్యెడన్. 61

## సూర్యాస్తమయవర్ణనము.

తే. శ్రీసమగ్రత నట్లు కైసేసి యున్న, సుందరీజనముల కర్థిఁ జూపఁ దగిన
యరుణమణిమయ మగునిల్వుటద్ద మయ్యె, నస్తగిరిపేరిపేటియం దహిమకరుఁడు. 62

తే. కాంతి దిగఁబాఱఁ బ్రాచిముఖంబునందు, బద్మినీముఖవికసనప్రౌఢి సడలె
భానుఁ డప్పుడు మధ్యస్థభాన ముడిగి, కాంక్ష నపరానుషక్తి రాగము వహింప, 63

తే. పద్మినీభోగలబ్ధసంస్పర్శనమునఁ, గలితమైనపరాగరాగమునఁ బోలె
భానుకరములు దివసావసానసమయ, సమధికోత్ఫుల్లపల్లవచ్ఛవి వహించె. 64

చ. వెనుకొనుచుక్కపరంపరలవెల్లువలన్ బతితాభిసారికా
జనములు త్రోవఁద్రోవ నలచక్రయుగంబులు గాతరావలో
కనములఁ ద్రిప్పఁ ద్రిప్పఁ జనఁ గ్రమ్మఱ నేరక పోలెఁ బశ్చిమా
వనిభృదధిత్యకన్ నిలిచె వారిజబాంధవబింబ మయ్యెడన్. 65

తే. తొంటితేజంబు దూలినఁ దూలనిమ్ము, కాలగతి దాఁట శక్యంబె ఖరకరునకుఁ?
జాలదా భాగ్య మిది? యెల్లజగము మ్రొక్క, నస్తమయవేళ నుదయంబునందపోలె.

చ. చరమధరాధరాగ్రమునజాఱెడువేళఁ బతంగుఁ డంగజ
త్వరితమనస్కులై నిలిచి తన్నుఁ గనుంగొనుసౌధశేఖరో
పరితరుణీజనంబుముఖపద్మములన్ వికసింపఁ జేసె స
త్పురుషులు తార దుర్దశలఁ బోవుచు నైనను బ్రోతు రాశ్రితున్. 67

తే. అహిమభానుండు చనుదేర నస్తశిఖరి, సరవి నర్పించుకుంకుమాక్షతము లయ్యెఁ
బరిణతాతపసంధానభాసమాన, శిఖరసానుఝురోద్ధూతశీకరములు. 68

ఉ. క్రొత్తగ దీర్ఘికానికటకుంజగృహంబులఁ దల్పకల్పనా
యత్తము లైనమత్తకరు లాత్మకరాగ్రము లెత్తి పల్లవో
పాత్తమనస్కులై త్వరఁజి యాడఁగఁ జొచ్చెఁ బరిభ్రమించుభూ
భృత్తరువాటికావిటపబృందమిళజ్జరఠాతపంబులన్. 69

వ. అప్పుడు. 70

సీ. మొగడలబిగిపీడుతొగల నంకూరించు, క్రొత్తనెత్తావి మూర్కొనుచు నులుకు
నిష్ప్రభం బై నీట నీడఁ దోఁచినభాను, బింబంబు గని భీతి బీఱువోవు
బాష్పంబుచూడ్కిఁ గప్పఁగఁ గూడి యుండియు, వికలకంఠముగ నొండొకటిఁ బిలచుఁ
గనిగాటు గఱచినబిసనాళములఁ జంద్ర, కరశంక సంధిల్లి మరలఁ గ్రాయు
గీ. నీడ లను బుద్ధి నొండొంటిఁజూడ కవలి, నీడ లొండొంటిఁగాఁ జూచి కూడ నరుగు
భావివిరహవ్యథాభయభ్రాంతివలన, శోకపరవశ మై చక్రవాకయుగము. 71

ఉ. కుత్తుక లెత్తి బిట్టులికి క్రుంకురవిం గని దీనవృత్తితో
నొత్తినభావిదుర్భరవియోగభరంబున నొండొకంటిమో
మత్తమిలం గనుంగొనురథాంగయుగంబుల దృష్టి గప్పఁ బో
మిత్తుగఁ గన్నునిర్గోదవి మించినచీఁకటికం టె మున్నుగన్. 72

ఉ. అంతరభక్తి మజ్జనకరాబ్జము లబ్జములు న్మణుంగఁ గాఁ
గాంతులరాక నంగనలకన్నుఁదొగల్ తొగలున్ దలిర్పఁ గా
దొంతరగా వియోగినులదుఃఖతమంబుఁదమంబుఁ బర్వఁగా
నంతట భానుబింబ మపరాంబునిధానములో మునింగినన్. 73

క. బలు పగచీఁకటిరాకకుఁ, దలఁకెడుమతి నాకసంబు తనమణిజలసం
స్థలమున నిక్షేపించిన, పోలుపునఁ బశ్చిమసముద్రమున రవి గ్రుంకెన్. 74

చ. అనలముఁ దేజమున్ బ్రకుపితాంబుజనేత్రల రాగమున్ రథాం
గనివహమున్ ద్రితాపమును గాల్కొననిల్వఁగ లేమి పుంశ్చలీ
జనముఁ బ్రవర్ధమానకరసఖ్యవియోగులచిత్తవృత్తి గా
దినకరుఁ డస్తమించినఁ దదీయగుణంబులు చేరె నిన్నిటన్. 75

సీ. ఇనకరాకులజగజ్జరతాలవృంతంబు, నిద్రాణపద్మినీనిశ్శ్వసితము
కైరవిణీబోధనారంభజృంభంబు, తిమిరమత్తేభపూత్కృతినిపాత
మాగచ్ఛదతనుధ్వజాంచలచ్చలనంబు, విరహిణీప్రాణాభివిగళనంబు
సాంధ్యరాగసుపర్ణచలగరుత్కలనంబు, చక్రవియోగాగ్నిచర్మభస్త్రి
గీ. రతిసముత్సుకసువదనారభ్యమాణ, ముఖ్యనేపథ్యవాస్తవామోదముదిత
మధుపమఘురారవోద్గీయమాన మగుచు, మెలఁగె నయ్యెడ సాయంసమీరణంబు. 76

సీ. కలపంబు లొడఁగూర్చుకన్యకాజనముల, రమణీయమణికంకణములరవలి
ప్రియులఁ దోతెమ్మన్నఁ బిలిచి తే నరుగుచే,డియలనున్గులుకుమట్టియలయులివు
నడయాసజోకొట్టునవకంపుటల్లుండ్ర, తటిమిపోనాడునత్తలయదల్పు
కై సేఁతలనొసంగుకమ్మఁదావులసోలు, నెలదేఁటిసిసుఁగులయించుమ్రోఁత
గీ. కలుపుబావలరాక యక్కలకు నెఱుఁగఁ, బలుకుచిలుకలకల్కిసఖులును గలసి
మరుఁడు విడిసినదండుసంభ్రమముఁబోలెఁ, గలకలిత మయ్యె గణికానికాయవాటి.

ఆ. ధర్మపథ మొకింత దలఁపక పద్మలో, చనము లొగి మొగిడ్చి సంజప్రొద్దు
నిదురవోయెఁ బద్మినీజాతి దానఁ బో, సిరి దొలంగి మిగులఁ జెట్టవట్టె. 78

క. కలువలకు వచ్చునిందిర, తలుపులు ముద్రించి యున్నతామరసగృహం
బులు పాడగుటన్ మూల్గుచు, నలిభూతము లందులోన నధివసియించెన్. 79

## —— సాంధ్యరాగవర్ణనము. ——

క. మెలఁకువలు చాలి తమతమ, నిలయంబుల కెగసి వచ్చు నెమలిపించ్ఛో
జ్జ్వలరుచులు సాంధ్యరాగా, కులతిమిరోదయము మున్ను గొలిపెన్ దెసలన్. 80

క. ఇనుఁ డేగుచుఁ జీఁకటివెను, కొనుశంకం గాపు వెట్టికొని పోయినయ
త్యనురక్తికిరణబలమో!, యన సంధ్యారాగ మొదవె నపు డపరదిశన్. 81

క. సురుచిరకుసుంభవర్ణాం, బరకలితపయోధరాతిభరభంగుర యై
వరుణదిశ యపుడు నూత్న, స్మరానురాగంబు గొలిపె జనులకు నెల్లన్. 82

## నక్షత్రవర్ణనము.

తే. శర్వరీచంద్రపరిణయసముచితాంకు, రార్పణక్రియఁ గలయ వియద్విభాగ
పాలికలఁ దోఁచుక్రొత్తజాజాలమొలక, లనఁగ దారక లొండొండ యంకురించె. 83

## అంధకారవర్ణనము.

చ. కనుఁగొన నింగిఁ దార లని కల్వల తోఁ డని చంద్రికామృతం
బని యొకసృష్టి చూపుటకు నై సమయం బను నైంద్రజాలికుం
డనుపమితానుభావమున వందఱమాడ్కి-లు గప్పుపొం టె వీ
చినయల నెమ్మిసంచియనుచిం దలఁపించె నవాంధకారముల్.	84

ఉ. తారకశంఖహారయు నుదారతమోసితకంచుకావృతి
స్ఫారయు నై నయారజనిభైరవి భైరవఖేలనంబు పెం
పారఁగ వారుణీకలిత మై రుచి మించినసాంధ్యరాగసం
భారము పేరిభూరినవమాంసతతిన్ గబళించె నంతటన్.	85

చ. నలుపులయిక్కలంజియలనమ్మినరో వెలపంట జక్కవల్
తలఁపనికీడుకానియవ దాయము క్రొవ్విరితమ్మిలచ్చికిన్
వెలిచవిగోరుదుండగపు వేడుకకత్తెలనోమునోఁత గూం
బలమణిహంబు జారులకుఁ బండువ చీఁకటి పర్వె నుర్వరన్.	86

శా. కస్తూరీతిలకంబు లై హరిశిలాకల్పంబు లై కజ్జల
ప్రస్తారక్రియ లై నవాగురుమషీపంకానులేపంబు లై
శస్తానీలపటావకుంఠనము లై జన్మించె దిఙ్మానవా
రీస్తోమంబులయందు నూతనతమోరేఖాంకురశ్రేణికల్.	87

ఉ. లోకమునన్ గులాచలము లున్నతరూపకులంబుఁ జూడఁ గా
నేకవిధంబు కాఁగ నుదయించినచీఁకటిచేత నయ్యెడన్
బైకొని వచ్చుదుర్విటులభావము వేఱుగనీక సామ్యమున్
గైకొన కున్నె వృత్తగణికావళిదంతురగండపాలికల్?	88

చ. ఎరియక దంతురస్థలుల నే శయనింపఁ దమాలపల్లవా
స్తరణము లై యనావృతి నశంక వసింపఁగ నీలిచేల పెం
దెర లయి యొండొరుం బిలిచి తేరఁగ నర్మసఖీజనంబు నై
యరుదుగ జారదంపతుల కత్యుపకారము చేసెఁ జీఁకటుల్.	89

సీ. కలయిండ్ల కరిగెడుకన్నంపుదొంగల, నీలికాసెలదీప్తి నిండెఁ గాక
గద్దించి చనుదుండగపు వేడ్కకత్తెల, మైలచీరలచాయ మలసెఁ గాక



ముకుళితవికసితాంబురుహోత్పలములకు, నెడయాడునలికాంతు లెసఁగెఁ గాక
విటులకై మెండాడువీథులజంతల, పెనుఁగాటుకలకప్పు బెరసెఁ గాక
గీ. వాడఁబాఱెడువిరహిణీవదనసమితి, కందుపొందున నగునల్పు గలసెఁ గాక
కానినాఁడింతవట్టు మీఁ గలదె మొదల?, ననఁగ జీఁకటి యంతంత కగ్గలించె.	90

సీ. కరఁచి చిప్పలఁ బట్టుకత లెఱుంగము గాక, వ్రాయంగ నిది మషీరసము గాదె?
యిది గుణంబులు సేయునిర వెఱుంగము గాక, నీలాలసరులు గా నింపరాదె?
కరపటంబులఁ బెట్టువెఱ వెఱుంగము గాక, వనితల కిది నవాంజనము గాదె?
కడవలఁ గొని ముంచుగతి యెఱుంగము గాక, చేలల కిది మంచినీలి గాదె?
గీ. పోవఁ డే నిది రవి నైనఁ బొదువుఁగాదె? యంక మను పేర నురముపై నచ్చు ద
గాక శశి నైన దిగమ్రింగుఁగాదె? యనఁగఁ, బ్రబల మై గాఢతమతమగపటలి యవ్వ.
తే. అరుక వెన్నాడి రాజశుద్ధాంతగణముఁ, దారకల బందెఁ గొని యెందు మాఱు లేక
యంధకారంబు జృంభితం బైన దీప, కలిక లతిభీతి శరణాభిగతము లయ్యె.	92

వ. ఇట్టిగాఢాంధకారం బుదయించుటకు మునుమున్న.	93

## జారవిటవిటీవర్ణనము.

సీ. మడమలు మోనంగ మైలచీరలు గట్టి, కర్ణముల్ మోవంగఁ గాటుక లిడి
మోఁచేతిపట్టులు మోవ గాజులు దొడి, గలకముల్ మోవఁ గొప్పులు ఘటించి
వెడలి గద్దువ మోవ పీడియంబులు చేసి, కాంతుఁ జెంపలు మోవ గంధ మలఁది
చెక్కిళ్లు మోవంగఁ జెవుల నాకులు వెట్టి, బొమలు మోవఁగఁ జుక్కబొట్టు దీర్చి
గీ. భావభవుచేతివిడివాటుబడియుద్రుడ్లు, సంజపొద్దున బలుపిశాచములఁ బోలె
మెదల భయము గ జనుఁ బట్టి వదల రైరి, వీథు లరికట్టి పురి గట్టివేశ్య లపుడు. 94

సీ. చిటికలు వ్రేయుచుఁ జిఱుపాట పాడుచు, జార్చి పయ్యెదఁ గూడఁ జేర్చుకొనుచుఁ
గన్నరూపము నెల్లఁ గరసంజ్ఞఁ బిలుచుచు, నెటకేనిఁ జనువాని కెదురు సనుచుఁ
గడచి పోవచ్చినఁ గౌఁగిటఁ బట్టి నీ, వా? యంచు నదలి మోహంబు రేఁచి
చూపిన వెలకు నంతే పో! యనుచు జంకె, వేయుచు రోయుచు వెంటఁబడుచు
గీ. రూక లడుగుచు చుదిఁబచ్చనాకు కైన, నొడఁబడుచు హస్తగత మైననొడియ నడిచి
దొడ్డబందాటమునఁ గోకఁ దొలిసికొనుచు, గుడిసెజంతలు తెరువాటుగొట్టి రపుడు.95

చ. ముడిఁగిముసుంగుతో వెనుక ముందును జూడక వచ్చి లోనికిం
దొడుకొని పోయి వ్రేల్మిడిన ద్రొబ్బినఁ బెంపునకుం బసిండికిం
జెడి తముఁ దార తిట్టుకొని ఛీ యని కేలు విదిర్చి రోయుచున్
గుడిసెలు దాటి వెల్వడరి క్రొత్తగుసిగ్గరిమిండ లయ్యెడన్.	96

ఉ. కాంచినవారు గారు బిగికౌఁగిలి మెల్లనిచొక్కపుల్క లా
లించినవారు గారు నెలతేమలకున్ రతి నొక్కవృత్తి దోఁ
పించినవారు గారు తమిపెక్కువతో వెల లిచ్చి తీర్చి ర
ప్పుంచశరుండు పూఁట యగుపత్రము లేనిఋణంబు హాళికుల్. 97

ఉ. ఒత్తిలి రిత్త పైకొనుచు నొంటన రెంటన నిద్ర పుచ్చుచున్
మెత్తన లేచి దీపము శమింపఁగఁజేసి శయింపఁ బ్రక్కలన్
దొత్తులఁ బెట్టి వచ్చి తమతొల్లిటిమిండలఁ గూడికొంచు నో
ర్మొత్తిరి క్రొత్తరోయిడినమొప్పెల గద్దరిలంజ లయ్యెడన్. 98

సీ. పథికులఁ గని తానుఁ బథికుఁ డై యొకకొంత, నడచి ముందరివారిఁ గడపి మరలు
వరములు దయసేయ వలరాచదేవర, వలగొనుగతిఁ జుట్టి వచ్చు నిల్లు
లోలకఁ జెవి యొగ్గి లోనిచప్పుళ్లకు, డిల్లమై వడి నిగిడించు నూర్పు
కడయింట నత్త మేల్కని బిట్టు దగ్గిన, నిరుగాల నిలువక యేగు బెగడి

గీ. యడిగినంతయు రో యిచ్చినట్టిక్రొత్త, కోడెఁ జేకొని తను వెళ్లఁ గొట్టుటయును
భ్రాంతి తనవల్వలంజియఁ బాయ లేక, క్రీడ యించుక లేనిచేబోడిబోజుఁగు. 99

వ. మఱియును. 100

మ. కుటిలాకారత వామదక్షిణకరాంగుళ్యగ్రజిహ్వాసకృ
ద్ఘటితస్ఫోటనముష్టిఘట్టనదటద్ఘట్టాదినానావిధో
ద్భటఘోషంబులతో నదూరపదవీపాంథావలీశృంఖలల్
ఘటచేటీగతిసంభ్రమంబు లెసఁగన్ గ్రం డై పురీవీథులన్. 101

వ. తదనంతరం బాగాఢాంధకారంబున. 102

ఉ. కోటలు బొమ్మరిండ్లు మఱి కొండలు తాఁపలు దివ్యదృష్టికిన్
గాటుక లంధకారములు గాఁ జని కందువపట్లఁ బాంసులా
పాటలగంధు లొంది రుపభర్తలతో మణితాదు లైనజం
జాటము లేనికూటముల సాహసకల్పలతాఫలంబులన్. 103

చ. కులసతిశిష్టమార్గమునకు న్నది నిల్పిన దాఁటరామికిన్
గులము మహాంబురాశి పతి కొండ గృహాంగణ మంధకూప మా
కులసతిదుష్టమార్గమునకు న్నది నిల్పినయేని దాఁటగాఁ
గుల మొకగోష్పదంబు పతి గుండు గృహాంగణ మాటప ట్టగున్ 104

చ కనఁబడువార లెల్లఁ దనుఁ గన్నిడిరే సవి విన్నపల్క లె
ల్లను దనుఁ గూర్చియే సవి తలంకున గొంకుచు నైన సాహసం



బునఁ దగ వచ్చి యట్టె వెఱవోవఁగఁ గౌఁగిటఁ జేర్చు బిగ్గరన్
వనిత ముహూర్తమాత్ర ముపవల్లభునిం దొలుక్రొత్తఱంకునన్. 105

చ. పడఁకకు మింక నిచ్చటికి వచ్చితి వేవురు గానకుండ వి
డ్వడు మిది నీవికంచు లికవీడినఁ బైచెమటాఱుఁ గాని లో
సడియకు మంచుఁ దెల్పి నవజారిణి నొక్కఁడు తొంటిమేనఁలం
బడిసినభాగధేయపరిపాకము గాఁ గదియించెఁ గౌఁగిటన్. 106

సీ. శ్రవణయోగ్యం బైనశబ్ద మొక్కఁడు లేక, ప్రియము గొల్చెడువలంక్రియలు లేక
సరస మై మృదు వైనశయ్యగల్గుట లేక, యర్థసంగ్రహము పై నర్థి లేక
పరుఁడు పట్టినచోటఁ బ్రత్యుత్తరము లేక, ప్రాణహానికిఁ గొంకుపాటు లేక
వర్ణగౌరవలాఘవములపై మతి లేక, వృత్తభంగమునకు వెఱపు లేక

గీ. తారుదారయ తక్క నెవ్వారు నొరులు, దడన రోకమూలఁ బడి ప్రసిద్ధములు గాకఁ
యపు డవిద్వత్ప్రబంధంబు ననుకరించె, జారిణీజారనవరహస్సంగమములు. 107

వ. ఇట్టిజారచోరవిహారంబులు చెల్లుచుండ మఱియును. 108

చ. అలిగినవారు పట్టియడియాసల మోసలఁ జేరి చొచ్చి పో
నులికినవారు పండువుల నూడనిఁ బాడినవారు వింతరో
వెల గొని తమ్ము నత్త లిలు వెల్వడఁ దోలినవారు నాదిగాఁ
గలవిటు వెల్ల నొక్కయెడఁ గాల్కొనిగోష్ఠి యొనర్చి రయ్యెడన్. 109

## వేశ్యామాతృగర్హణము.

సీ. భావింపఁ దీర్ఘపురేవు కాఱుమొసళ్లు, చెఱకుపైఁ గ్రొవ్వాఁడికఱకుఁబేళ్లు
గెంటనితేనియజుంటిపై యీఁగలు, పూచినమొగలిపైఁ బొరలుముండ్లు
పంటచేలకు నాఁగఁబడినయోదంబులు, గందంపుఁదీవెలకాలఫణులు
కదలక పెన్నిధిఁ గాచుదయ్యంబులు, రచ్చరావులబొమ్మరక్కసియలు

గీ. లంజతల్లు లనఁగ లక్షింపఁగా నిట్టి, కట్టిఁడులకు నలువ కరుణ లేక
బాఁతిమాలినట్టిబ్రతుకులు నిడుపు గాఁ, జేసి విటులగోడు వోసికొనియె. 110

ఆ. గణికవలని దెంతఘన మైనసుఖ మేని, దానితల్లివలనఁ దప్పిపోవు
మదిఁ దలంప నెట్టిమధురాన్న మేనియు, నీఁగ దొరలె నేని నిందు కెట్లు. 111

సీ. భావజు విడిచినపాడింటిపై బొల్లి, పాదుట్రుగతి మేనఁ బలిత మొదవ
నంటుండకుండఁ బ్రాయము దుల్పుకొనుమాడ్కి, పడుచన్ను లేచి చప్పట్లు చఱవ
ననుభవేచ్ఛావిలాసాదులఁ దిగిచిన, కొట్టునాఁ జేయూఁతకోల యూఁది
యుండుటఁ గష్ట మే నొల్ల మే ననునట్లు, పలుమాఱు విడువక పడఁతి పడఁక

గీ. నున్నలంజతల్లిఁ గన్నచో నల్లుర, గుండె భగ్గు రనుచు నుండ దెట్లు?
తేరిమాడ వెరచి చేరదు మృత్యువు, దానఁ గాదె చావు దప్పి మనుట. 112

వ. మఱియు నుడుగువోయినమ్రాఁకునుంబోలెఁ బండ్లు డుల్లి, ప్రాంతవలయునుంబోలెఁ గన్నులు చెదరి, పిఱికిబంటునుంబోలె నిలువక బొమ్మలు వదలి, గర్వగ్రంథియుంబోలె వినక, పాడిల్లునుంబోలె వెన్నొరగి, ముదిరిన మొగలిచెట్టునుంబోలె నేలమోవం జన్నులు డిగి, యొంటరికాపుప్రజయునుంబోలె నిండెలు దొలంగి, యినుపముట్టునుంబోలెఁ గాలిసత్వం బుడిగి, కూలినబావి తెఱంగున నడవలేక, మోఁపరితలయునుంబోలె బట్టగట్టి, తగవుగోరియుంబోలెఁ గూడఁబెట్టుచు, ముట్టంబడినరోగంబునుంబోలెఁ జొరవయీక జరానివాసంబగుచు లంజతల్లి పెక్కేండ్లు బ్రతుకుటకు విటులపాపంబ కారణంబు.

## వారవనితాదూషణము.

సీ. చంక్రమక్రమశీల శాఖామృగంబులు, భద్రద్విపశ్రవగప్రాంచలములు
ధారాధరోదరోదయతటిల్లతికలు, వహ్నిసముజ్జ్వలజ్జ్వాలశిఖలు
గోపురోపరిపతాకాపటముఖములు, పరిదృశ్యపిప్పలపల్లవములు
తరుమరుచ్చలదళాంతరగతాతపరేఖ, లూర్మిమాలిసముద్యదూర్మిలతలు
గీ. వెలచెలువలచిత్తవృత్తు లాజన్మచం, చలతరంబు లింత తెలిసి తెలిసి
నేర్తు ధనము లిత్తు నిలుపుదు ననిపాఱు, విటుఁడు శుద్ధమైనవెఱ్ఱి గాఁడె. 114

క. రూపముచెలువది చిత్తరు, రూపంబులయందుఁ గలదు రుచి గొని సతి దక్
బైపడనిచోట మన సిడు, పాపపువిటుకంటె లంజబందయుఁ గలఁడే? 115

ఉ. ఒక్కని విన్నదాఁక మఱియొక్కరుపైఁ దలఁపైనదాఁక వే
ఱొక్కనిఁ గన్నదాఁకఁ దను నొక్కఁడు పైకొనిపోఁకుదాఁక నొం
డొక్కనిఁ దక్క చూపి తగు లూడ్చెడునంతటిదాఁక మిండచే
రొక్కము చెల్లుదాఁక నె సరోరుహరోచనలందుఁ గూరుముల్. 116

క. మధురములాడెడునాలుక, విధురమతిం బులుసు గొనఁగ వేడుకపడున
ట్లధికుఁడగువిటునిఁగూడియు, నధముని మదిఁ గోరకుండ దంగన యెట్లున్. 117

తే. కువిటుఁ దగిలినమది చాటుగొనదు గాని, వెలసతికిఁ గూర్మి రసికుపై విఱుగఁ దఱుచు
హేయ మగుముట్సు మెక్కిన నిందుఁగాక, యెందుశునకంబునకు నెయ్యి యిందు దెట్లు?

తే. విటుఁడు రో యిచ్చి వేశ్య నిల్పుటయె కాని
యొరులఁగోరెడు గుణమెట్లు నుడుపలేఁడు
డొల్లునీరంబు నాఁకట్టఁ జెల్లుఁగాఁక
డొల్లుగుణ మది మాన్పంగఁ జెల్లునెట్లు? 119



వ. బలిమిం గట్టకట్టి యాకఁట్టంబడియును బ్రవాహంబునిజప్రవహణంబు విడువక ప్రవహణద్వారంబుల వెదకుచుం జిరకాలంబు నిలిచి యేనియుం గనుమగలిగినం బ్రవహించుచందంబున వారవనితమనంబును ధనప్రదానాదిసకలప్రయత్నంబుల నిలుపంబడియును మార్గాంతరంబులు వెదకుచుం బెక్కుదినంబులు నముపువడియును నెడవు గలిగిన నొండొక్కనిం గూడుకొనునది స్వభావగుణంబు. 120

సీ. ధనమాస వేఱొండు దలఁపద యే నది, జలజలోచనకు నౌషధపుఁగూర్మి
ఘనునొద్ద నుండియుఁ దన కాసపడియె నేఁ, బొలఁతుక కదియె యారోపకూర్మి
తగిలినచో నెల్లఁ దహతహ నొందె నేఁ, బోటికి నది యలవాటఁ గూర్మి
తనకట్లకెలనికిఁ దనమేలు చూపు నేఁ, జేడియ కదియు వైశికపుఁగూర్మి
గీ. తనదుపైత్యభ్రమంబున ధరయు దిరిగి, నట్ల యగుభంగి విటుని మోహమునఁ దోఁచుఁ
గాన నిక్కంపుఁగూరిమి గణికయందుఁ, బొరయదిలఁ జొర్సెనే నది తెరువుపెసర.

## చంద్రోదయవర్ణనము.

తే. అనుచు నీరీతి ముచ్చట లాడుకొనఁగ, విటకుమారులదుర్గోష్ఠి వినఁగ వినఁగ
యామినీకాంత కుదయించునలఁతినవ్వు, తెఱఁగుతో నంతఁ దూర్పునఁ దెలుపు దోఁచె.

క. ఎల్లయెడయుఁ జీఁకటిచే, నల్లనయై తోడిమపట్టు నాఁ దూర్పునఁ బా
టిల్లెడుచిఱుగెంపున నభ, మల్లో నేరేడుఁబంటియాకృతిఁ జూపెన్. 123

వ. తదనంతరంబ. 124

సీ. అంగసంభవుపోషితాలంభవిధిఁ బ్రతిష్ఠింప మండెడుహోమశిఖి యనంగఁ
దిమిరాఖ్యభూతతృప్తికిఁ బ్రాచి యనుచేఁట, నఱికినమెడపట్టునఱ కనంగ
నాతపత్రకల్హారలక్ష్మికి నిశాంగన, యిచ్చుమడఁతచెంగావి యనఁగ
గౌముదీసుధ వోయఁ గాఁ జకోరములకు, నలువ యెత్తెమరత్నకలశ మనఁగ
గీ. జారతస్కరలోకసంహారమునకు, సమయ మనియెడునలికలోచనుఁడు చాలఁ
గినిసి తెఱచినయలికలోచన మనంగ, నిండుఁగెంజాయఁ బూర్ణచంద్రుండు వొడిచె.

క. సమధికవిరహవ్యథఁ బడి, భ్రమసినకోకంబు లుదయపాటలుఁ జంద్రుం
గమలాప్తుఁడు వొడిచినసవి, నిముసము మిథ్యాప్రమోదనీరధిఁ దేలెన్. 126

క. తొలిఁదొలిఁబొడమెడువెన్నెల, మొలకలఁ బైకొని చకోరములు మేయంగాఁ
గలువచెలికాఁడు పొడిచిన, తొలుదెసయుం దనము కొంత దొలఁగక యుండెన్.

క. ముంగోలుమొలకవెన్నెల, లం గలఁగంబడుతమంబులం గలగగనో
త్సంగము గంగాయమునా, సంగమముం దలఁపు చేసె సజలాకృతియై. 128

ఉ. చెందినకూరిమిం దిమిరచేలము వీడఁగ నైంవపోపల
స్యందమునం జెమర్చి కమలాక్షుముల న్మొగిడించుయామినిం

జందురుఁ డంగరాగరుచి జారఁ గవుంగిటఁ జేర్చి పొందె స్వ
చ్ఛందతఁ దారకాకుసుమసంకుచితాంబరతల్పమధ్యమున్. 129

తే. ఇంచుకించుక శశి యుదయించనపుడు, తఱుచుఁ జీఁకట్లు భీతిమైఁ దఱిసి డాఁగె
ముకుళితాంబుజపుటకుటీమూలములనొ?, సభయమూర్ఛితవిరహిణీస్వాంతములనొ! 130

చ. సుదతులనున్నగ్రొవ్వెదలు చొచ్చెనొ? కాంతలరోమరేఖలం
దొదిఁగెనొ? పుష్పకోమలులయోలపునాభుల లీన మయ్యెనో?
ముదితలచూడ్కిఁ జేరెనొకొ? ముగ్ధలఱెప్పలలోన డాఁగెనో?
వెదకిన లేకపోయె నభివృద్ధతమంబు విధూదయంబునన్. 131

క. ప్రమథపతిమూ ర్తిచంద్రుఁడు, తిమిరగజాసుర వధించి తిత్తొలిచినత
త్సమధికచర్మముఁ దాల్చిన, క్రమమున నంకంబు కడుఁ బ్రకాశిత మయ్యెన్. 132

చ. కరమిళనంబుచే ముఖవికాసము గల్గఁగఁ జేసి వెల్వడన్
దెరు వఱి చిక్కియున్నయలతేంట్లను లోపలికందు వాపివి
స్ఫురితపరాగహాసపరిపూరితఁ జేసి మధుచ్ఛలంబునన్
గరఁగఁగఁ జేసె మానసము కైరవిణీప్రియుఁ జంద్రుఁ డయ్యెడన్. 133

చ. అనుపమకాలచక్రఘటయంత్రవశంబునఁ జంద్రమండలం
బనుఘటికంపుగుండ్రఁ గలయంబడ నొల్కుచు సాంద్రచంద్రికాం
బునిధిసముద్ధృతామృతము ముంచె జగం బనుపేరిసస్యము
న్దినకరతీవ్రతాపనిహతిం గలవా డఱి తొంగలింపఁగన్. 134

సీ. పైసుధారోచిబింబము తక్రమునయందు, మునిఁగి తేలెడువెన్నముద్ద గాఁగ
మహివిశ్రమించుదంపతులు పాల్కడలిలో, భాసిల్లుదివ్యదంపతులు గాఁగ
నింగినాడుచకోరనివహంబు మిన్నేటఁ, గలయ నీఁదెడునంచకొలము గాఁగ
దెసలఁ గైరవసముత్థితపరాగము వజ్ర, మయశైలతటులపై మంచు గాఁగ
గీ. మీఁదఁ దొట్టి క్రింద మిక్కుటం బై యంత, రాశి మెల్ల నిబ్బరముగ ముంచి
యెల్లకడలయందు నెల్ల మై పండువె, న్నెల జగంబునత్తి నిండి వెలిఁగె. 135

క. కడలేనియచ్చవెన్నెల, నడుమం జంద్రుండు మంథనగమునఁ దరువం
బడుపాలకడలి మును దాఁ, బొడమి పయిుందేలువిధముఁ బొందుగఁ దెలిపెన్. 136

ఆ. పాలకుండవోలె బ్రహ్మాండ మప్పుడు, జీర్ణచంద్రికాభిపూర్ణ మగుచుఁ
బాలుగ్రోల మీఁదఁ బైకొన్నఫణిఫణా, బింబ మనఁగ నిందుబింబ మలరె. 137

తే. మించి వెన్నెల జగ మెల్ల ముంచినపుడు, తఱచుఁ జీఁకట్లు భీతిమైఁ దఱిసి డాఁగె
ముకుళితాంబుజపుటకుటీమూలములనొ?, సభయమూర్ఛితవిరహిణీస్వాంతములనొ. 138



చ. కరఁగెడుచంద్రకాంతములఁ గాలువ లై ప్రవహించునీటనో?
విరియునవోత్పలావళుల వెల్లువ లై చనుపుప్పొఁ దేనెనో?
తొరఁగువియోగిబాష్పములతోరపుటేఱులచే సమృద్ధినో?
పొరిఁబొరి నింగి మ్రింగుచును బొంగెఁ బయోధి విధూదయంబునన్. 139

ఉ. పిల్లల కెల్ల మేపి మును పేర్చినవెన్నెలతీఁగెలేఁగొనల్
కొల్లఁగఁ దారునుం బతులుఁ గుత్తుకబంటిగ మేసి గూండ్లలో
వెల్లులు గూడఁ బోసికొను వేడుకఁ బుక్కిటఁ బట్టి చీఁకటుల్
జల్లునఁబాఱఁగా నుమియుఁ జాఁగినకోరికలం జకోరికల్. 140

వ. అప్పుడు. 141

## యువతీశృంగారకేళివర్ణనము.

క. ఇతరశరంబులు గాఁ డని, యతినలయభిమానకవచ మతనుఁడు సించెన్
సితకరశాణసముత్తే, జితకువలయసాయకములచే నట్టియెడన్. 142

తే. తప్పు లోనరింప కైన నాతప్పు లెన్ని, తారు మును ద్రోచిపుచ్చుటే తప్పటంచుఁ
బ్రియుల దోతేర సఖుల నంపిరి వనితలు, తప్పు తమ దని ప్రణయంబు చెప్ప నేల?,

ఉ. త్రోచినమీఁదటన్ మరలఁ దోకొని వచ్చుట కెన్నిభంగుల
న్నేచినదాన వీ వయిన నిన్నిటు వంపఁగఁ జాల నిక్కువం
బోచెలి! నీవ నే నగుచు నుండుటఁ బోయిననిన్ను నన్నకాఁ
జూచి యతండు లాఘవము చూపెడునో యని యేమి సేయుదున్? 144

ఉ. ద్రోహములేనిచోట విభుఁ ద్రోచినద్రోహఫలంబు గాదె న
న్నీహరిణాంకుఁ డింత యెరియించుట? వెన్నెల కోర్చునంత నే
సాహసి నెట్లు? నాయెడఁ బ్రసన్నకృపామతి వై లఘుత్వసం
దేహము లేక వల్లభునిఁ దెచ్చువిదగ్ధవు నీవు నెచ్చెలీ! 145

చ. ఎడయెడమాట లేల? చని యేన ముఖాముఖిఁ బిల్తుఁ బిల్వఁ గాఁ
నొడఁబడి రాఁడ యే నతని కొప్పనసేయుదుఁ బ్రాణ మన్న నీ
నడుమన నన్ను జీవము గొనం దలకొన్నది యోవయస్య! యీ
విడువనివేలమై కురియువెన్నెలచిచ్చున కేమి సేయుదున్? 146

తే. అనుచుఁ బ్రియదూతికలతోడ నాడికొనఁగఁ
బలుకు లవి చాటువడి వించుఁ బతులు లోని
తుకతుకలు మాని క్రొత్తవేడుకలు వొదల
బయలువడి వల్లభల సిగ్గుపఱిచి రపుడు. 147

చ. తడయుట కోర్వలేక యొకతన్వి మనఃపరికల్పనంబుచే
నెడపక వల్లభుం డెదుటి కేర్పడ వచ్చినయట్లు తోఁపఁగా
నుడుగనికోర్కులం బొరలుచుండి యతం డరుదేరఁ గాంచియుం
దడియక యుండె నెప్పటివిధంబునఁ గౌఁగిటఁ జేర్చునంతకున్. 148

చ. నెలకొనురత్నకుడ్యమున నీడయె వల్లభుఁ డంచుఁ గిన్కమైఁ
జొలఁతి పరాఙ్ముఖత్వమునఁ బొందినఁ దా నపరాధి గాన సం
కిలి వెనుకన్ వసించి పరికించువిటుండు నయత్నసిద్ధ మై
కలిగెఁ దదాభిముఖ్య మని కౌఁగిటఁ జేర్చె లతాంగి లజ్జిలన్. 149

చ. తనహృదయం బగల్చుటకుఁ దానుఁ బతిన్ హృదయం బగల్పఁగా
వనిత తలంచెఁ గాక కడువంచన చేసినవాఁడు చేరినన్
గినుక తొలంగి పోవఁ జనుఁ గేలఁ దెమల్చినమాత్రఁ గర్కశ
స్తనములు వీఁపున న్సోలవఁ దారొకని కౌఁగిటఁ జేర్ప నేటికిన్? 150

ఉ. పట్టకుఁ బట్ట కేల ననుఁ బట్టెద వోరి! బిగించి కౌఁగిటం
బట్టెదవే! వృథా యెరియఁ బట్టగు నీకయి మత్కుచద్వయీ
ఘట్టనచేత నిప్పు డెఱుఁగం దలపోయవు గాక యెవ్వతెం
బెట్టినవాఁడవో హృదయపీఠిక దానికి నొత్తు డొఁ జుమీ!. 151

క. తద్రసనఖాదిముద్రా, ముద్రితు నినుఁ దగవు మాలి ముట్టుదునట్రా?
యుద్రేకింపక తల శఠ! ముద్రించినసొమ్ము పరులు ముట్టం దగునే? 152

క. తలఁ పెత్తి యొండుపేరం, బిలిచినఁ దప్పేమి? నీకుఁ బ్రియ మగుసతిగాఁ
దలఁచుట చాలదె? నాక, ప్పొలతుఁకనామంబుఁ దాల్చుపుణ్యము గలదే? 153

క. ద్రోహముసేయమికి వరా, రోహ మది న్నమ్ము నీదురోమావళికృ
ష్ణాహిం బట్టుదు నిదె యని, సాహసికవిటుండు నీవిసడలం దొడికెన్. 154

చ. ఘనకుచకుంభయుగ్మ మిది గైకొన నీక వియోగవార్ధిలో
నను మునిఁగించుభావమున నాజలజాయతనేత్ర! శయ్యపై
ననయము నల్కమై నకట! యవ్వలిమోమయి? తైన నేమి నీ
వినుతకటీతటీపులినవీథి వసింపఁగ గల్గెఁ జాలదే! 155

క. మన్నించి యిట్లు నన్నుం, దన్నియశోకుఁడుగఁ జేయుతలఁ పిది యొప్పన్
నన్ను దయఁ జూచి యిఁక నో, కన్నియ! వెసఁ దిలకితాత్మఁ గా జేయఁ గదే?. 156

క. ఈరీతిఁ గుటిలవాక్య, ప్రారంభవిజృంభణంబు ఫలముగ నలుకల్
దేరుటయుఁ గలసి చూపిరి, పౌరవిటీవిటులుసీధుపానక్రీడల్. 157



## మధుపానక్రీడావర్ణనము.

తే. వారుణీసక్తహృదయాలవాలవీథి, నంగనలయందు మదలత యంకురించి
పాటలాలోకనశ్రీలఁ బల్లవించెఁ, గుసుమితం బయ్యె నిర్హేతుహసితలీల. 158

క. మది సిగ్గు వెఱికి వ్రేయఁగ, మదనుఁడు మధురసము నించి మఱిపాఁ తగలం
గదలింప నూఁగుపోలిక, సుదతికి మధుసేవఁ దనువు సొరుగఁగఁ జొచ్చెన్. 159

తే. తొట్రుకొనునడ్డులును వెడద్రొక్కుఁబల్కు, లుల్లముల సిగ్గెఱుంగమియును ఘటించి
జవ్వనులకును మరల శైశవము దెచ్చె, వారుణియు నెట్టిసిద్ధౌషధీరసంబొ? 160

సీ. కోపంబు లేక భ్రూకుటి ఘటియించుఁ బో,లింపంగ లక్ష్యంబు లేక చూచుఁ
బిలువ కుండఁగ నైనఁ బలుకు నో హో! యని,బయలూఁత గొనఁజూచుఁ బౌఁజఁజూచుఁ
గారణం బొండులేకయు నవ్వు వికవికఁ,గ్రాలెడునీడపై సోలఁజూచుఁ
జేరువ నెచ్చెలిఁ బేరెలుంగునఁ జీర, మనసు లేకయుఁ బాడు మానిమాని

గీ. ప్రస్తుతముగానివెడతొక్కుఁబలుకు పలుకు, మ్రోయుఁదేఁటులతోఁగూడిముచ్చటాడు
నుబ్బి జాబిల్లిఁ బిలుచు రాకున్ననలుగు, మగువ యొక్కతె మధుమదోన్మత్త యగుచు.

తే. శశవిషాణంబు దీర్ఘ మై సంభవించె, వికసితం బయ్యె గగనారవింద మపుడు
మధురసాస్వాదనోన్మత్తమత్తకాశి, నీకలోక్తిప్రసంగాభినీత మగుచు. 162

సీ. మ్రాఁగన్నువడి వెడదూఁగుమేనున మింట, నొఱగుచుఁ బడఁ బాఱి యులికి తెలియు
నెఱిబొమ్మ లెగయించి నిలువుఁజూపులఁజూచి,కోపించి యలు లంచుఁ గురుల జడియుఁ
దలఁపున గుఱి లేక తనుఁ దాన మెచ్చుచుఁ, జప్పుడు గాఁగఁ జేచఱచి నవ్వుఁ
గార్య మొకండు లేకయ పిల్చి నెచ్చెలి! యే మన్న మఱి చెప్ప నెఱుఁగ కుండు

గీ. చన్ను లెడగాఁగఁ బయ్యెద నవదరించు, హస్తతాళంబు లిడి మస్త మభినయించుఁ
గడమవడఁ బల్కుఁ బలుకు లాకస్మికముగ, మగువ మదిరారసోన్మాదమహిమవలన. 163

క. హాలారసపానంబునఁ, జాలఁగ నున్మత్త యగుచు శంకింపక పై
వ్రాలి విటుఁ గౌఁగిలింపఁగ, బాలామణి లజ్జ యొద్ది పఱఁతులఁ జేరెన్. 164

సీ. అభిముఖ్యంబున నలరెడుచూపులు, నారాచధార లై నాటుకొనఁగఁ
బెనఁగొల్పినప్పుడు బిగియానిచేతులు, పాశబంధములట్లు బలిమి చూపఁ
బ్రత్యుత్తరమునకుఁ బాఱెఁతి యాపలుకులు, జాతహుంకృతుల మై సందడింప
నెగయించిపట్టిన నెదురనివసనంబు, లగపడ్డచక్కియ యప్పళింపఁ

గీ. జెట్టఁ గబళించి తిగిచినఁ జేరఁబడని, సతులు మధుపానమున లజ్జ సడలి తార
పల్లవులఁ బట్టి కేళితల్పముల కీడ్వ, మదవతీనామ మపుడు సమర్థ మయ్యె. 165

సీ. ముసముస మని చుట్టుకొనవెండుర్రికలు వట్టి, హుమ్మనిమట్టియ లులియ దాఁచి
తుదనాల్కఁ దొరలనితొక్కుఁబల్కులఁ దిట్టి, కటికిచన్ను లురంబు గాఁడ నదిమి

గ్రుచ్చి చేతుల మేనుముచ్చుట్టురాఁ జుట్టి, దొమ్మియూర్పులతావి గుమ్మరించి
తమిగోల్లఁ దనువు జూదపుటిండ్లుగా వ్రచ్చి, చొక్కున మోవినంజుళ్లుగఁ గఱచి
గీ. మధుమదోన్మత్తలై యల్క మఱచి సఖులు, సూరెలకుఁ దాఁటఁ బతులపై సోలునట్టి
చేడియల మన్మథుఁడు వెఱ్ఱిచెఱకువింట, నేసె నుమ్మెత్తవిరులచే నేసరేఁగి. 166

మ. అనుకూలక్రియ చూప నేరక బలవ్యాకృష్టిచే వక్ర యై
యనుమానాకులతం బదంబు మృదుశయ్యం గూర్పఁగా లేక చా
ల నిగూఢంబుగ భావమున్ సుకవితాలక్ష్యస్థితిం జెంది యై
న నవోఢాంగన చేసె వల్లభున కానందంబు డెందంబునన్. 167

తే. మదనునభ్యుదయైకకర్మంబు జరపఁ, గోరుకొను కామినులుఁ గాముకులును మొదటఁ
జేసి రుదితస్మితంబులచేఁ గపోల, పాలికలయందు నంకురార్పణవిధంబు. 168

ఆ. యువతిఁ దివియనీక యున్నపయ్యెదతోన, లీలఁ దిగిచి కౌఁగిలించె విటుఁడు
తత్తఱించి వాని దర్పకుం డోరతోన, విసరి యడిద మెత్తి వ్రేయ కున్నె? 169

క. విన దయ్యెఁ బ్రియము తుదిఁ గై, కొన దయ్యెన్ మ్రొక్కు కాముకుఁడు వెఱవక పై
కొని కౌఁగిలింప వనితకుఁ, గొనకొని కన్నీటితోన కోపము వెడలెన్. 170

తే. మగనికౌఁగిటిబిగిచేత మగువయతితి, హారలత ద్రెవ్వటయు ముత్తియములు చెదరె
నటన చూప గణంగునన్నాతిచన్ను, లెదురెదుర నిచ్చుపువ్వుదోయిలియుఁ బోలె. 171

తే. ఉన్నతస్తనకుంభము లురము దన్ని, పట్టె నొకకేలఁ గౌఁగిటఁ జుట్టిపట్టి
యుపరకరమున విటుఁ డేమి యుందఁగలఁడె? చంద్రముఖినీవితనుఁ దానె జాఱెఁ గాక.

క. అంగనముఖచంద్రునకు భు, జంగముఖగ్రహణ మొప్పుసమయంబున స
ర్వాంగములకు ఘర్మోదక, సంగతిచే మజ్జనంబు సలుపఁగఁ గల్గెన్. 173

చ. త్రివళితరంగసంగతులఁ దేలుచుఁ గ్రుంకుచు నాభిదీర్ఘికన్
వివృతకటిస్థలీపులినవీథిఁ జరించుచుఁ గౌఁగిలింప నూ
రువు లనుపేరనంట్ల కడరం బ్రియపల్లవుహస్త మప్పుడా
యువతికుచంబుల న్బొరలి యూష్మలచేతఁ దపించెఁ గావునన్. 174

ఆ. పాక మెత్తఁగి కేళిభవనంబు వెడలెడు, సఖులతోనె వెడలి చనియె నప్పు
డేణశాబనయనహృదయంబు లజ్జయుఁ, గాముకునిమనంబుకరకరియును. 175

చ. జనితరతిత్వరం జెలులసన్నిధిఁ బయ్యెదయంటు భర్తపైఁ
గినిసి యదల్పు మైబోమలు గీల్కొనఁ జేసి యలీకదీనతా
భినయము చూపుకాంతమదిఁ బ్రేమవిపాకముఁ దెల్పె నీవి స
య్యనఁ దనుఁ దాన జాఱె దరహాసముతోఁ జెలు లెల్ల వెళ్ళెడన్. 176



క. అలసినవల్లభు మెచ్చక, మెలఁత రతి న్విక్రమింప మెయికొనియెడున
క్కొలఁది మరుఁ డలయఁ బువ్వుల, విలు గొని రతిదేవి సమరవిధిఁ గైకొనియెన్.

సీ. నెచ్చెలిరాక రానేర దింతకు మున్ను, తాన యై రతులకు దఱుము పెట్టె?
చేపట్టి తివియక చేర దింతకు మున్ను, పౌరుషంబున నెట్లు పైనటించెఁ?
బయ్యెద దివనీక పట్టు నింతకు మున్ను, సిగ్గు నేసంగతి దిగ్గనాడె?
నడిగిన మాఱుమాటాడ దింతకు మున్ను, రతికూజితంబు లేగతి రచించె
గీ. నబల యఁటె పేరు సుకుమార మట్టె తనువు, తరుణిరతినిర్దయత్వంబు దలఁచునపుడు
కొసర దఁట యింత యైనఁ బైకొనఁగ నింక, నాతిదీనోక్తు లెట్లుగా నమ్మవచ్చు?

వ. ఇవ్విధంబునం బ్రశాంతలజ్జాప్రపంచంబును బర్యస్తనిరస్తసమస్తశంకాకళంకం
బును బరిహృతపరస్పరమనోంగవచనంబు నగుట నిష్కంటకమదనసామ్రాజ్యం బై
నిఖిలేంద్రియనిరంకుశస్వారాజ్యం బై యవలోకనాలాపనాలింగనాధరాస్వాదనాదుల
యందు ముఖ్యోపసర్జనభావంబు లేక యొండొకంటికిం బ్రోదు లై యుపక్ర
మోపరమంబుల కంతరంబులు గలుగక చోఁకుఁజోపెల్లనుం గశానిలయంబును
నగపడుచక్కియెల్లనుం జుంబనస్థానంబును జేయుచెయువులెల్లను బారవశ్యజనకం
బులును నగుచుఁ బరిరంభనిర్దయత్వంబునుం బ్రణయరసభావార్ద్రత్వంబును గుచకచ
గ్రీవక్రౌర్యంబునుం గరుణోక్తిదైన్యంబునుం బౌనగపుణ్యభేదనంబును బరివర్ధితా
ఖిలాభిలాషైక్యంబునుం గలిగి యఖిలాంగవిభ్రమాస్పదం బయ్యును ననంగవిలసితం
బును నవిరతోద్గతసకంపసీత్కృతం బయ్యును నపాకృతచేలంబును బహుబంధసంబంధ
బంధురం బయ్యును నిర్లేపభావభాసితంబును నఖాంకచంద్రకళోదయనిధానంబయ్యును
నద్వితీయానువాదార్హంబును సుమయసముచితం బయ్యునుం దర్శితవైపరీత్యంబు
నగుచుం బ్రవర్తిల్లునంత. 179

సీ. ఉపధానవినిమయం బొండొకచూపుటఁ, బెరకేలు లక్కునఁ బ్రిదిలి బిగియఁ
బలుచోఁకుటలు వ్రేఁకఁ బడుమోవు లెఱుఁగమిఁ, గముచుట కులికి సీత్కార మీఁగ
నభినవనఖరేఖ లఱుక్రమ్ముచి త్తడి, సోఁకెడుచుట్టున సుక్కఁబడఁగ
వీడ్వడఁ గ్రోలుచు వెడలించునూర్పులు, ప్రాణంబు లేకంబులగుటఁ దెలుపఁ
గీ. బారవశ్యంబు లాచ్ఛాదపటము గాఁగ, సాంద్రనిజబాణజాలజర్జరితు లగుచుఁ
బడుగుఁబేకయు నైనదంపతులఁ జూచి, యెలనగవు నవ్వి మరుఁడు వి ల్లెక్కుడించె.

చ. మెలఁతలు వల్లభు ల్మొదల మెచ్చుగ నుండిరి నాకతంబునన్
నిలువునఁ గత్తికోఁత లయి నిద్దపుమోవులు నజ్జునజ్జులై
యలజడి వాడి వత్తు లయి రక్కట యే నిఁక నున్న నేమి గాఁ
గలదొ? యిదేల? పోదు నను కైవడితో నిశి యేగ నేగినన్. 281

## ప్రభాతవర్ణనము.

క. ఏకతపుమతకములనా, నాకరణాసననిరూఢి నటియించుమదో
త్సేకమిథునంబులకుఁ గృక, వాకుస్వర మంత భరతవాక్యం బయ్యెన్. 182

తే. ధవళకిరణుండుచరమది క్తటమువెంట,నల్లనల్లనఁ దిగజాఱె వెల్ల నగుచు
సురతపరవశఖేచరీవిరళచికుర, భారమున జాఱువాఱుపూబంతివోలె. 183

చ. దలమఱిపోవువెన్నెలవిధంబది రక్తపటీరచర్చ గాఁ
జలకనితారకావళి విసూత్రితహారమణివ్రజంబుగా
నలతొలుసంజకెంపు పదయావకచిహ్నలు గాఁగ నంబర
స్థలి యలరారె వేకువ నిశాశశిభుక్తవిముక్తశయ్య నాన్. 184

తే. వేగునంతకు విటవిటీవివిధసురత, బంధబంధురగతులు తత్పరతఁ జూచి
మెచ్చి తలలూఁచునట్లు కంపింపఁ జొచ్చె, వేగుఁబోకటగృహదీపికాగణంబు. 185

ఆ. దశలు తుదకు వచ్చి తల లల్ల నల్లన, వణఁకవణఁక నపుడు వార్ధకంబు
తేటపడువిభాతదీపంబులకు మేనఁ, బలిత మనఁగ వెల్లఁబాటు తోఁచె. 186

చ. వలిగొను మంచునం దడిసి వారిజినీకలికాపుటీకుటీ
బిలములు దూఱి తేనియలవెల్లువఁ దోఁగుచు వచ్చి యంతటన్
దలిమము లజ్జగించుమిథునంబులయందు వియోగవహ్నిఁ గా
ల్కొలిపెఁ దదూష్మలం బొరలఁ గోరియుఁబోలె విభాతవాతముల్. 187

చ. నయమున నూతగీతులు వినం బడ హారము లింపు నూప వీ
డియములు క్రొత్తలై తగఁ బటగ్రహణత్వరమాణవల్లభా
వయవములందుఁ జూడ్కు లొదవన్నును గాడ్పులు సోఁడుముట్ట నిం
ద్రియములపండు వయ్యెను సతీపతికోటికి వేగుఁబోకటన్. 188

చ. చిడిముడితోడఁ జేల మొకచేఁ గటిమండలిమీఁదఁ జేర్చుచున్
వెడవెడ జారునిం గనలి వేనలిఁ దక్కురమూలకాంతి వీ
డ్వడఁ బెరకేల నిల్పుచును వాడుఁగనుంగవ సోలశయ్యపైఁ
బడఁతులు లేచుసంభ్రమము భర్తల నువ్విళు లూర్చెఁ గ్రమ్మఱన్. 189

ఆ. దించి సురతవేళ దిగఁ దన్ని విడిచిన, పగఁ బటంబు లంతఁ బద్మముఖులు
తత్పతలము డిగుచుఁ దమఁ దార తిగిచిన, విటులవెనుకఁ జొచ్చి వెడల కుండె. 190

చ. అలసతచేఁ ద్రపాగమసమాకులభావముచేత నైనయ
వ్వలువపలపిండు వాయఁ గని వారక మీవల రాచవేడ్కలన్
మెలఁగెడువేళ వీడ్వడిన మీ కిది యుక్తమె? యంచు హాసముల్
సలిపిరి గేలిపెట్టుచును జంపతులం జెలిపిండు వేకువన్. 191



తే. రేయి నిజనాథుల నభిసరించి పోయి, తెల్లవాఱంగ మరల నేతెంచి రనఁగఁ
దఱుచుఁజీఁకటు లంతంత దలఁగి పోవఁ, దెల్లమిగఁ గానఁగా నయ్యె నెల్లదిశలు. 192

క. నిజవరపరిరంభణమున, రజనీహారములు ద్రెవ్వి రాలినముక్తా
వ్రజములొకో! యనఁ దగి భూ, మిజదళములఁ జెలువు గొలిపె మిహికాలవముల్.

## సూర్యోదయవర్ణనము.

క. ఒక్కింతయపుడు తూరుపు, దిక్కునఁ దొలుతెలుపు దోఁచె ధృతి చెడి పగలన్
జొక్కెడుజక్కవలపయిం, దెక్కలిదైవంబు కన్నుదెఱచె ననంగన్. 194

క. అందముగ మీఁద దినమణిఁ, బొందించి విభాత ముఖభోరము కిడఁగాఁ
గుందనపు మొగపుఁ గూరుచు, చందంబున నంతపూర్వసంధ్య జనించెన్. 195

ఆ. తప్పులేకరాజు తనుడించియపరఁజెం, దుటయుఁ దాను మిగుల దోష యగుటఁ
బ్రాచి యోక మెఱుఁగఁ బాలఁబుట్టెడువాని, పోల్కి నెఱ్ఱ నగుచుఁ బ్రొద్దువొడిచె.

సీ. పద్మినీవిస్తీర్ణపద్మప్రశస్తహ, స్తము లిందిరకు మందిరములు గాఁగఁ
గలయంగఁ గుముదినీకుల మెల్ల నభినవ, కోశసంపత్తిచేఁ గొఱలుకొనఁగఁ
గమనీయచక్రవాకద్విజవ్రజ మెల్లఁ, బరిణయోత్సవయుక్తిఁ బరిణమింపఁ
జింతితవివిధార్థసిద్ధిచేత సమస్త, జనములు సంతోషజలధిఁ దేల
గీ. నాత్మవసువితీర్ణి ననురాగయుక్తి నై, విశ్వ మెల్లఁ బల్లవింపఁ జేసి
యుదయశిఖరిపేరియున్నతనూత్నసిం, హాసనాగ్రసీమ నలరె నినుఁడు. 197

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు 199

## మాంధాత పరిజనముతోఁ బురమున కేతెంచుట.

క. కృతకాల్యకృత్యుఁడై భూ, పతిశేఖరుఁ డపు డశేషపరిజనసంసే
వితుఁ డగుచుఁ బ్రమదవనని, ర్గతుఁడై పురి కేగుదెంచెఁ గడుముద మొదవన్. 199

## ఆశ్వాసాంతము.

ఉ. స్వర్ణసువర్ణచేల ధనవర్ధితనిర్ధనవత్కుచేల గో
కర్ణకులేంద్రకుండలితగాత్రశయాన ఖగేశయాన సం
పూర్ణకృపావలోక పరిపోషితలోక నిజాంకవర్ణనా
కర్ణనబంధురక్షణ ప్రకల్పితసంశ్రితబంధురక్షణా. 200

క. చోళేంద్రధర్మవర్మనృ, పాలప్రాంగణనిధాన పరిఖేలవదు
త్తూలకవేరసుతాపరి, ఖాలంకృతరంగమండలాధీశమణీ. 201

తురంగవృత్తము. తరుణరవికరవికచసరసిజదర్పమోచనలోచనా
శరధినిరవధినిఖిలజలహృతిసాంద్రకంధరబంధురా
గిరిమథనజమధువిధుకరశ్రితకీరవాహనమోహనా
స్ఫురదచిరరుచిరుచిరచిరరుచిపోషకాంబరడంబరా. 202

గద్య. ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహసేవకోపసేవక నరసింహనామధేయ ప్రణీతం బైన కవికర్ణరసాయనం బను కావ్యంబున వసంతవర్ణనంబును, వనవిహారజలక్రీడలును, సూర్యాస్తమయతమస్తారకాజారవిటవిటీవర్ణనంబును, జంద్రోదయంబును, మధుపానరతినిరూపణంబును, ప్రభాతసూర్యోదయంబులు నన్నది చతుర్థాశ్వాసము.



# పంచమాశ్వాసము.



శ్రీరంగప్రియమందిర
భూరంగాకస్మికాత్తభూషణ లంకా
భూరమణనిరంతరవీ
క్షారతికరుణారసప్రసాదాభిముఖా.

వ. ఇవ్విధంబున నిరంకుశస్వేచ్ఛావిహారంబులం బ్రవర్తిల్లుచు నొక్కనాఁడు. 2

సీ. కమ్రకంకణఝుణత్కారసంకులము గా, సుందరీజనము వీచోపు లిడఁగ
నర్మసంగతి నంతరాంతరంబుల మంత్రి, సామంతహితవీరసమితి గొలువ
వివిధప్రదానాదివిజయాదినిజగుణప్ర,కరంబు ప్రౌఢపాఠకులు చదువ
స్వమహితైశ్వర్యానువాదరూపంబుగాఁ, జేయెత్తి విబుధు లాశీర్వదింప
గీ. వేత్రధరనిష్ఠురోక్తివైచిత్రు లెసఁగ, నంగచోళకళింగవంగాదివివిధ
సకలదేశాధిపతులు దర్శనము వడయ, నిండుకొలువుండె మాంధాతృనృపవరుండు. 3

## వసిష్ఠాదిమహర్షులు మాంధాతకడ కరుదెంచుట.

వ. ఇట్లు కొలువుండునంత వసిష్ఠప్రముఖమహర్షు లరుదెంచినం బ్రహర్షపులకితాంగుండగుచు సాష్టాంగదండప్రణామంబుచేసి పురోనిర్దిష్టమార్గుండగుచు నంతఃపురంబునకుం గొని చని యచట మహార్హమణిమయాసనంబుల నాసీనులం గావించి తానును విమలాంగియు నర్ఘ్యపాద్యమధుపర్కాదు లగుసపర్యలం బరితుష్టులం జేసి ప్రసన్ను లగు నత్తపోధనసత్తములకు నందఱకుం గృతాంజలి యగుచు నృపకుంజరుం డిట్లనియె. 4

క. తపములు నిర్విఘ్నములే? యుపహతిగంధంబుఁ జొఁక కున్నవె వనముల్!
కృప ననుఁ గృతార్థుఁ జేసితి, రిపు డైనం గృత్య మాన తిచ్చుట యొప్పున్. 5

వ. అనిన వా రెల్ల నుల్లసితవదనారవిందు లై. 6

చ. మనుకులచంద్ర! కేవలము మాకు నొకం డన నేల? విశ్వభూ
జనములయందు నార్తి యనుశబ్దము లేదు భవాదృశాధిపుం

గని విని మున్నెఱుంగ మిఁకఁ గల్గెడుశంకయు లేదు లేదు మా
కనఘ! భవద్విలోకనజహర్షము దక్కఁగఁ దక్కువాంఛయున్. 7

వ. విశేషించియు నీచేయువినయాతిరేకంబునం బొడమెడుపరమప్రసాదాతిశయంబు మదీయమానసంబుల వరప్రదానోన్ముఖంబులం జేసి వేగపెట్టెడు నగుటం గోరినయది సర్వప్రయత్నంబుల నొడఁగూర్చువారము, నీకెద్ది యభిమతం బెఱింగింపు మనినం బొంగి నృపపుంగవుండు పునఃప్రణతుం డై. 8

సీ. పూర్వాస్తశైలముల్ పొలిమేర లగుధాత్రి, కొడయుండ నేన వేఱొకఁడు గలుగఁ
డేకరాజక మైనయీవిశ్వధాత్రి న,ధర్మంబు శబ్దమాత్రంబు లేదు
విత్తాధిపతి కైన విస్మయం బొనరించు, విత్తసంపద కింత వెత్తి లేదు
మానసంబున నేని మఱి దేహమున నేని, యొదవునాధివ్యాధి యొకఁడు లేదు
గీ. నాకు వెక్కసించునాయీమహైశ్వర్య, మింకఁ బరుల కైన నేమి చెప్ప
నేమి కొదవ గాన నెట్లు గా నా కిది, ప్రార్థనీయ మనుచుఁ బలుకనేర్తు?. 9

క. కావున సంపద్విషయం, బై వేఁడుకొనంగఁ దగినయది లే దంత
ర్భావమున నాకుఁ దెలియం, గావలసినయర్థ మొకటి కల దతిహిత మై. 10

తే. లక్షితము సేయ దేశకాలస్వభావ, విప్రకర్షంబు లేక యీవిశ్వ మెల్లఁ
గరతలామలకంబు గాఁ గనునతీంద్రి, యప్రబోధంబు గలపుణ్యు లరయ మీరు. 11

క. మీ యెఱుఁగనియర్థము లే, దీయెడ నను మీ రనుగ్రహింపుదు రేని
న్నాయడుగునర్థమునకుఁ గృ, పాయతమతి నొసఁగవలయుఁ బ్రత్యుత్తరమున్. 12

## మాంధాత మునులం దనపూర్వజన్మవృత్తాంతము నడుగుట.

సీ. అస్మదీయం బైనయాంగికం బగుతేజ, మతిలోక మై యున్న దద్భుతముగ
భావంబు నట్టుల భగవత్పదాంభోజ, భావనామృతపానపరవశంబు
మీకోడ లైనయీ మెలఁతను నాయట్ల, తనుకాంతిహరిభక్తు లనుపమములు
విశ్వైకవంద్య! యీయైశ్వర్యమును నాకుఁ, జోద్య మైన దనన్యసులభ మగుట
గీ. నిట్టిమహిమలఁ బొంద మున్నెట్టివార, మేమి సుకృతంబు చేసితి మింకమీఁది
భవమునందును నీపెంపుఁ బడయుటకు ను, పాయ మెయ్యది? వివరించి పలుకవలయు.

వ. అనిన నందఱు నట్టివిచిత్రప్రశ్నంబునకుం దగినయుత్తరంబు చెప్పుటకు నరుంధతిపతి ననుమతించి నియమించిన విజ్ఞానఖని యగునమ్మహాత్ముండును నివాతప్రదీపంబురూపం బున ముహూర్తమాత్రం బుపరతబహిరింద్రియుం డై యోగసమాధివశంబున నయ్యర్థంబు గాంచి ప్రసాదసుముఖుం డగుచు నభిముఖుం డై మునిసభామధ్యంబున నందఱు విను చుండ నమ్మహారాజచంద్రున కిట్లని చెప్పం దొడంగె. 14



## వసిష్ఠుఁడు మాంధాతపూర్వజన్మవృత్తాంతముఁ దెలుపుట.

క. శూద్రుఁడ వై తొలుమేనున, నద్రిక్తచరిత్రనిష్ఠురోక్తుల లోకో
పద్రవము చేసితివి నృప, భద్రేభ! సమస్తబంధుబాహ్యుఁడ వగుచున్. 15

క. ఈసతియు నాఁటిభవమున, నీసతి యై నీవు దన్ను నిరసించిన న
త్యాసక్త యగుచు విడువక, చేసె భవత్ప్రీతికొఱకుఁ జెన్నంటిపనుల్. 16

సీ. పైతామహం బైనచేతిరొక్కము చెల్లు, నంతకు నుద్వృత్తి నట్లు దిరిగి
పేద వై కృషి చేసి పెట్టినసస్యంబు, లెల్లఁ బొల్లైనఁ గొన్నాళ్లు నవసి
గతి లేక దాస్యంబు గైకొని దానిచే, గ్రాసంబు నడవక కడుఁ గృశించి
కడఁ దిరపంబ వై కాంతయు నీవును, దేశంబులం దెల్లఁ దిరిగి తిరిగి
పంచపాది గీ. యంత కొకపట్టణమున విష్ణ్వాలయంబు
చేరి యొకకొంద ఱచట వసించి పరమ
యోగివరు లుండ నిచ్చలుఁ జాఁగి మ్రొక్కి
నిండుమతిఁ జేసితివి వార లుండునెలవు
లూడ్చియును నీరు చల్లియు నూడిగములు. 17

వ. ఇట్లు మహాభాగవతసందర్శనంబునం జిత్తంబు సన్మార్గప్రవృత్తం బై దినదినంబును వదీయసేవాచరణంబునం దద్గృహతదాలాపశ్రవణంబులవలన నంతఃకంతకుం బూర్వదుష్కృతంబులవలన డెందంబులు నిరుపాధికవిష్ణుభక్తిప్రవణంబు లై. 18

సీ. ఉపభూమి నెవ్వ రే నుమిసినవీటికా, చర్వితాదుల నెత్తి చల్లి చల్లి
ప్రాకారవీథులఁ బ్రతివేళ యందును, నొదవెడుచెత్త వో నూడ్చి యూడ్చి
కుండలసలిలంబు గొని వచ్చి దుమ్ము వోఁ, గలయంపి దోడ్తోన చిలికి చిలికి
మండలవేదికామండలంబుల గోమ, యంబునఁ జల్లగా నలికి యలికి
తే. పొలిచి గుడిచుట్టుఁ దగియున్నఁ బొంగి పొంగి, మాసి కనుపట్టుటకు నాత్మ రోసి రోసి
యంతరంగంబునందుఁ దాదాత్మ్య మొదవి, చేసితిరి మీరు విష్ణుసంసేవనంబు. 19

వ. మఱియును. 20

తే. హరిసమీపప్రదీపిక యారకుండ, భోజనానీతతైలంబుఁ బోసి తీవు
నిజపటము చించి యీపడంతియును వ్రత్తి, యోజితము చేసి వెలిఁగించె నొక్కనాఁడు.

వ. ఇట్లు ఫలాభిసంధిరహితంబు లైనహృదయంబులతో మీర లిరువురు సకలఫలసాధనం బైన భగవద్భజనంబు సేయు చుండు నం°. 22

శా. సేవార్థంబుగ వచ్చె నచ్చటికి నిస్సీమక్రమకూరిరనా
నావాహద్విపవీరయోధరథసన్నాహంబుతో రత్నభూ

హావిస్ఫూర్తులతోఁ గళత్రశిబికాచంచత్సహస్రంబుతో
సౌవీరాఖ్యమహీమహేంద్రుఁడు మదస్తంబేరమారూఢుఁడై. 23

క. వచ్చిన యద్ధరణీధవు, నచ్చెరు వొదవించువిభవ మది గనుఁగొని సం
పచ్చరితార్థుం డితఁ డని, మచ్చుట నొందితిర మీరు మోహమువలనన్. 24

క. అది కారణముగ నిష్ట, ప్రదమై హరిసేవ నేటిభవమున నీయ
భ్యుదయం బొనర్చె భగవ, త్పదసేవ చతుర్విధేష్టఫలదము గాదే! 25

క. తనువులఁ బవిత్రకాంతియు, మనముల విజ్ఞానరూపమధురిపుభక్తిన్
జనియింపఁ జేసె మీ కి, ట్లనుపమదీప్రప్రదాన మది నృపతిలకా! 26

వ. అట్లగుట నింక ముందటిభవంబునకు నిట్టియైశ్వర్యం బొకం డేల ధర్మార్థకామమోక్షంబులం దేది గోరిన నట్టిచతుర్విధఫలంబులకు భగవత్సేవాచరణం బొకండు సాధనం బగుట వివిధాఖిలకర్మంబులు భగవత్సేవాచరణరూపంబులు గాఁ గావింపు మభిమతం బొనరించు ననిన నాశ్చర్యహర్షకలితాంతఃకరణుం డగుచు నృపశ్రేష్ఠుండు వసిష్ఠున కిట్లనియె. 27

## వసిష్ఠుఁడు మాంధాతకుఁ గర్మస్వరూపముఁ దెల్పుట.

తే. వివిధఫలబీజ మైయేకవిధము క్రియయు, వివిధకర్మంబులకు నేకవిధఫలంబు
గలుగునట్లుగ తరుబీజఫలములందు, నీదృశవ్యత్యయము గంటి మెట్లు నెచట? 28

ఆ. ఇదియె కాదు శాస్త్ర మెఱిఁగించు ప్రతికర్మ, మునకు భిన్నభిన్నముగ ఫలంబు
నట్లు కాఁగ దెలియ నానతి యిమ్ము క, ర్మస్వరూప మెల్ల మౌనిచంద్ర! 29

క. అన విని భూవరుప్రశ్నం, బున కెంతయు మెచ్చి మౌనిపుంగవుఁ డనియెన్
జనవర! క్రియాస్వరూపం, బనయము బుధులకును గహన మది విను తెలియన్. 30

వ. కర్మంబులు దృష్టద్వారోపకారకంబులు నదృష్టద్వారోపకారకంబులు నన రెండుదెఱంగులై యుండు. దృష్టద్వారోపకారకంబులెల్ల లౌకికంబులు, నదృష్టద్వారోపకారకంబులెల్ల వైదికంబు లనం బడు. అట్టివైదికకర్మంబులు నిత్యనైమిత్తికకామ్యప్రభేదంబులం ద్రివిధంబులై యుండు. అందుఁ జేయకుండినం బ్రత్యవాయం బైవర్ణాశ్రమాదిప్రయుక్తంబు లగుచుఁ బ్రతిసమయంబునం జేయవలయునవి నిత్యంబు లనంబడు. అట్టివయ్యుఁ గదాచిత్కకర్మనిమిత్తంబులయందుఁ జేయవలయునవి నైమిత్తికంబు లనం బడు. చేయకుండినం బ్రత్యవాయంబు లేనియవి కామ్యంబు లనంబడు. అందు నిత్యనైమిత్తికంబులకుఁ గర్తృభేదంబున విహితత్వంబును సహకారిత్వంబున నాకారభేదంబును గలదు. అట్టికర్త యతిరిక్తఫలకామియు ననతిరిక్తఫలకామియు నన ద్వివిధంబు. అనతిరిక్తఫలకామి యన నీశ్వరాజ్ఞారూపంబులైనయవి యాచరించుటయ తనకు



ఫలంబుగాఁ దదతిరిక్తఫలంబు గోరనియతండు. అతనికిం గేవలవిహితత్వాకారంబున సిద్ధించు. అతిరిక్తఫలకామి యన నాచరణంబ కాక తదతిరిక్తం బైనఫలం బపేక్షించునతండు. అతనికి నాచరణీయత్వంబు విహితత్వాకారంబున సిద్ధించుచు నభిమతఫలసాధనభూతకర్మాంతరాధికారజనకంబు నగుట సహకారిత్వాకారంబు నసహకారిత్వాకారంబునుం గా నుభయాకారంబుల సిద్ధించు. ఇంకఁ గామ్యకర్మంబులు నియతఫలంబులు ననియతఫలంబు లన ద్వివిధంబులు. అందు నియతఫలంబులనఁ దమకు విహితంబులైనఫలంబులందె కాని ఫలాంతరంబులందు వినియుక్తంబు గానియవి. అనియతఫలంబు లనం బూర్వోక్తనియతఫలంబులకు వ్యతిరిక్తంబుగా సంకల్పానురూపఫలంబులం బొడమించునవి. ఇట్టినియతానియతఫలంబునుం గర్తృగతగుణత్రయభేదంబున సాత్త్వికంబును రాజసంబును దామసంబు నన మూఁడుదెఱంగులై యుండు. అందు సాత్త్వికఫలంబు బ్రహ్మవిద్యానిష్పత్తి, రాజసంబున స్వర్గాదిప్రాప్తి, తామసంబునం బరహింసాదికంబు. అట్లు గావున నిందు దృష్టద్వారోపకారకంబు లైనలౌకికకర్మంబులుంబోలె నియతఫలంబు లైనకామ్యకర్మంబులు ఫలబీజన్యాయంబున నన్యథాసిద్ధిజన్యజనకభావంబుఁం గలవి గాని యితరకర్మంబు లెల్లం గర్తృసంకల్పానురూపఫలప్రదాయకంబు లగుట వివిధఫలోత్పాదనంబునకు నేకకర్మంబ బీజంబుగా నేర్చు. వివిధకర్మంబులు నేకఫలోత్పాదకంబులు గా నేర్చు. అనిన నర్థాంగీకారంబునం బార్థివోత్తముండు వెండియు నిట్లనియె. 31

సీ. అధికారజనకంబులై నిత్యనైమిత్తి,కములు కామ్యము లంగకములు నంట
యాకామ్యములు దేవతారాధనాకృతు, లందు నదృష్టంబు లనుట దత్త
దారాధ్యహితదేవతానుగ్రహములఁ ద, ద్యాగంబునను ఫలావాప్తి యనుట
సకలఫలప్రదుం డొకఁ డెట్టులొకఫలం, బెట్లు పల్వు రనుగ్రహింప వెలయు
గీ. ననుట వివిధదేవతారాధనాకార, కర్మవితతియం దొకండు నిఖిల
ఫల మనేకఫలము బహుకర్మముల కిచ్చు, ననుట పొసఁగ కున్న దాత్మ ననఘ!. 32

వ. అనిన నతనిప్రజ్ఞావిశేషంబునకు నలరి యారాధనస్వరూపంబుగతి నారాధనీయస్వరూపంబు వినక యీసందియంబు దెగదు విను మని యిట్లనియె. 33

## ఉపాస్యబ్రహ్మస్వరూపనిరూపణము.

తే. భగవదారాధనక్రియాప్రకర మెల్ల, నిఖిలకర్మసమారాధనీయుఁ డతఁడ
యఖిలవివిధఫలప్రదాయకుఁ డతండ, యఖిలదేవతలకు నంతరాత్ముఁ డతఁడ. 34

ఉ. దేవత లెంద ఱండఱుఁ దదీయశరీరము లట్లు గానఁ ద
త్సేవ తదర్చనంబ యని సేవకు లాత్మ నెఱుంగ కున్నఁ ద

త్సేవ తదర్చనం బగుట సిద్ధము గాన విభుండ యిచ్చుఁ ద
ద్దేవతమాత్రభక్తియును దత్తదభీష్టఫలంబు దానికిన్. 35

క. యజ్ఞముల కెల్ల భోక్తయు, యజ్ఞఫలప్రదుఁడు నతఁడ యని యెఱుఁగమి న
ల్పజ్ఞు లగునితరదైవము, యజ్ఞులు గూలుదురు కుడిచి యల్పఫలంబుల్. 36

క. తమభజియించినదైవము, తమకుం బ్రాప్యంబు గాన దైవంబుఁ దద
న్యముఁ గొల్చుమూఢమతులకు, సమకొను ఫల మల్పతమము సవినాశంబున్. 37

ఆ. ప్రాగనాదికర్మబద్ధు లైతుచ్ఛకా, మములచేత విష్ణు మఱచి జనులు
కేవలముఁ దదన్యదేవతామాత్రాను, షక్తు లగుచుఁ గొలుతు రుక్తవిధుల. 38

తే. క్షణికము నుపాధిబంధతుచ్ఛంబునైన, త్రిగుణమయభోగ్యజాతంబు దృష్టిఁ దగిలి
నిత్యనిరుపాధినిరవధినిఖిలరూప, భోగ్య మగునాత్మ నెఱుఁగ దెప్పుడును జగము.

తే. నిరధికానందనిత్యు లాహారిగుఱించి, యితరులగుఱించి సంఛిన్నహీనసుఖులు
కర్మ మొక్కండ ఫలవిభాగములు పెక్కు, చిత్ర మిది చూడు సంకల్పమాత్రభిదను.

వ. అట్లగుట నంతరాత్మ నెఱుంగనియప్పుడు తత్తద్దేవతారాధనరూపంబు లైనవివిధంబు లగుకర్మంబు లంతరాత్మ యొక్కండ భగవంతుం డని యెఱింగి తదారాధనరూపంబులుం గా నొనరింప నభిమతైకఫలబీజంబులు గా నేర్చు. అభిమతవివిధఫలప్రదాయకభగవదారాధనరూపం బగుట నేకర్మంబును వివిధఫలంబులకు బీజంబునుం గా నేర్చు. కావున నవశ్యంబును మొదల నారాధనీయుం డగుభగవంతు నెఱుంగవలయు. కేవలదేహాత్మాభిమానమూలంబు లగుభగవద్విషయరాగద్వేషాదులు కర్మహరంబులు గా నేర్చుఁ గానిఁ దత్త్వజ్ఞతాభిమానంబున భగవంతు నన్యథారూపంబున నొండె విపరీతరూపంబున నొండె నెఱింగె నేని తన్మూలతద్విషయద్వేషం బధోగతికారణం బగుట గణింప నేల? తన్మూలరాగకార్యంబు లగుతదారాధనస్మరణకీర్తనాదులు విఫలంబు లగు. ఇంతియ కాదు. తాదృగ్విధవిరుద్ధజ్ఞానంబునం బ్రత్యవాయంబు నగుట యథావస్థితవస్తుజ్ఞానంబున నెఱింగి యారాధింపవలయుభగవత్స్వరూపం బాకర్ణింపుము. 41

సీ. సర్వశరీరనిష్కర్షికేతరసర్వ, శబ్దాభిలాష్యుండు సర్వకార్య
సర్వహేతువు సర్వశాస్త్రీయధర్మస, మారాధ్యదైవం బఖిలఫలదుఁ
డఖిలాత్మలకు వాస్తవాభిగమ్యుఁడు ముము, క్షువుల కాశ్రయము ముక్తులకుఁ బ్రాప్య
మఖిలప్రకారనిరతిశయభోగ్యంబు, వివిధవేదాంతైకవేద్యతముఁడు

గీ. నిఖిలవిషయంబులకుఁ బ్రత్యనీక మగుట, సకలకల్యాణగుణగణాస్పదుఁడు నగుట
లక్షితస్వాన్యవస్తువిలక్షణుండు, విభుఁడు పురుషోత్తముఁడు రమావిభుఁడు వెలుఁగు.

సీ. అగులక్షణము లనన్యాధీనచేతనా, నాధారభావముల్ వ్యాప్తి మీఱ
నవబోధసత్యసుఖామలత్వాదులు, రూఢస్వరూపనిరూపకములు



సిద్ధస్వరూపవిశేషధర్మజ్ఞాన, శక్తివైరాగ్యాదిషడ్గుణములు
షడ్గుణానంతవిస్తారభేదములు సౌ, శీల్యాదినిత్యనిస్సీమగుణము

గీ. †లఖిలజగదుదయపాలన హరణములును, నిగ్రహానుగ్రహంబులు నియతకరుణ
నాచరించుట ముఖ్యకృత్యంబు లరయఁ, బరమపదపూర్వ మై యొప్పు బ్రహ్మమునకు.

సీ. శ్రీవల్లభుఁడు సూక్ష్మచిదచిద్విశిష్టతఁ, దాన యీజగదుపాదాన మయ్యెఁ
గ్రమ్మఱ నాత్మసంకల్పవిశిష్టతఁ, దాన జగన్నిమిత్తంబు లయ్యెఁ
గాలాదు లగుసహకారుల కాత్మ యై, తా జగత్సహకారితయు వహించె
మహదాదికారణాత్మతఁ దాన వెండియుఁ, దత్కార్యకారణత్రయము నయ్యె

గీ. సూక్ష్మచిదచిద్విశిష్టవస్తువు నిజేచ్ఛ, నామరూపవిభాగార్హనటనమునకు
స్థూలచిదచిద్విశిష్ట మై తోఁచుఁ గాన, గార్యవస్తువు దాన యక్కైటభారి. 44

తే. ఆత్మసంకల్పమహిమచే నవ్విభుండు, స్వాపృథక్సిద్ధచిదచిద్ద్వయంబునందుఁ
జూపుఁ బరిణామ మాత్మస్వరూపమునకుఁ, గలుగ కుండుటఁ దా నిర్వికారుఁ డగుచు.

ఆ. నిర్వికార మయ్యు నిజవపుర్గపరిణామ, భాజి యైనయట్టిబ్రహ్మమునకుఁ
గలుగుప్రాగవస్థ కారణభావంబు, భావ్యవస్థ కార్యభావ మయ్యె. 46

క. ప్రకృతిపురుషులు తదీయులు, ప్రకృతిపురుషమూల మీప్రపంచం బగుటన్
బ్రకటమతిఁ జూడఁ దదితర, సకలముఁ దజ్జనిత మింతసత్యము సుమ్మీ! 47

క. చేతనము శేష మతనికిఁ, జేతనశేషంబు మఱి యచేతన మగుటన్
జేతనకులమున కఖిలా, చేతనముల కతఁడ సర్వశేషి తలంపన్. 48

తే. తలఁప శేషిత్వకారణత్వములు నెట్టు, లట్లు మఱి బోధశక్తి బలాదిసుగుణ
యుక్తి నాతండ కాని వేఱొకఁడుఁ గలుగ దతనికం టెను బరతరం బై యణువును. 49

ఆ. నలినభవునిపిదప నామరూపవిభావ, నార్హ యగుతమగపదాభిలాష్య
ప్రకృతిఁ దగుఁ దదీయఁ బ్రాపించు నతనిసం, కల్పమున నభూతగణము వింటె. 50

క. ప్రకృతివిచిత్రత నానా, వికృతులఁ బుట్టించి సర్గవేళల మరలం
బ్రకృతివశావశు లగునీ, సకలాత్మలఁ బొడమ నతఁడ సంకల్పించున్. 51

తే. అవిదితాకారమున నంతరాత్మ యగుచుఁ, దన్ను ధరియించి నియమించి తనకు నతఁడ
దేహి యగుఁ గాని జగము దా దేహ మయ్యు, నతని కుపకారకంబు గా దధిపచంద్ర!

క. ధారకుఁ డైనను లేదొక, భారము సంకల్పమునన ధరియించు నసా
ధారణము మాకు మవ్విభు, ధారకభావంబు లేదు తక్కొకరునకున్. 53

క. సాగరనియమం బిందు వి, భాగము సౌదామినీవిభంగము ఘనసం
యోగము రవిగతిపవనస, మాగమ మివి గాదె విష్ణుమాయాప్రౌఢుల్. 54

క. భూతంబు లెల్లఁ దత్తను, భూతము లతఁ డాత్మభావమునఁ దద్వ్రతయో
పేతుం డై పాలుచుఁ దదు, ద్భూతస్థితి విలయహేతుభూతుం డగుచున్. 55

† గీతపాదలక్షణ మేలనోతప్పినది.

మ. చతురాస్యుండును దక్షముఖ్యులు నశేషప్రాణులుఁ గాలముఁ
జతురాకారవిభూతు లీశ్వరునకుఁ సర్గంబునం దెల్ల సం
స్థితికిన్ విష్ణుత యుఁ మనుప్రభృతులుఁ జీవావళుల్ గాలముఁ
హృతికిన్ రుద్రుఁడు నంతకప్రముఖు లయ్యైజంతువు ల్కాలమున్. 56

మ. నలువన్మున్ను సృజించి యాతనికి నంతర్యామి యై దక్షము
ఖ్యులఁ బుట్టించి తదంతరాత్మత నమోఘుం డై జగజ్జీవులం
గలుగంజేసి తదంతరంగగతుఁ డై కావించు నుత్పత్తి నా
ప్రళయం బీశుఁ డనుక్షణంబును రజగప్రారబ్ధలీలారతిన్. 57

మ. విను మాపద్ధరణాదికంబు నెఱపున్ విష్ణ్వాదిభాగస్థుఁ డై
మనుముఖ్యాత్మల కాత్మ యై తెలుపు సన్మార్గంబు శాస్త్రోక్తులన్
జననీరాజగురుప్రదాతృముఖనానాజీవలోకాత్మ యా
య్యై నొనర్చున్ వివిధస్థితి న్విభుఁడు సత్యోద్రిక్తలీలారతిన్. 58

ఆ. అంతరుద్రవహ్నియమముఖ్యులకు సర్వ, జంతుకాలములకు నంతరాత్మ
యగుచు నిలిచి క్రమిత యును దత్ప్రకారసం, హర్త యగుఁ దమగప్రవృత్తి విభుఁడు.

తే. విషమసృష్ట్యాదికర్మముల్ విశ్వపతికి, నిర్ఘృణత్వాదికంబుఁ జెందింప లేవు
సృష్టివైషమ్యహేతువుల్ సృజ్యకర్మ, శక్తులయ కానఁ గేవలసాక్షి యందు. 60

వ. ప్రళయసమయంబునం బ్రలీనజ్ఞాను లగుచు సుషుప్తిసమయంబునకంటె నచిత్ప్రాయు లై ప్రకృతినిర్మగ్ను లై యుండునిఖిలజీవులపయిం గరుణించి చతుర్ముఖశరీరుం డై భగవంతుండు సృజ్యకర్మవిపాకనిరపేక్షుంబు గాఁ గేవలనిరంకుశస్వేచ్ఛామూలం బైన ప్రథమసర్గంబునం గరుణకళేబరాదిప్రదానం బొనరించి నిజనిజానాదికర్మవాసనావశంబున వివిధకర్మజ్ఞానచికీర్షాప్రయత్నవంతు లగువారల కనంతరంబ యనుమంతృత్వంబున నంతరాత్మ యై యుత్తరోత్తరప్రవర్తకుం డై యుండునక్కాలంబున నెల్లజీవులుఁ బ్రబలజ్ఞానసంపన్నులు దీర్ఘాయుష్మంతులు నవితథమనోరథులు నై దైవమనుష్యభావభేదంబులు లేక వర్తించుచు వివిధవిషయానుభవలోభపరాభూతచేతస్కులై తం గర్తృత్వాభిమానంబున నహంకారమమకారగ్రస్తు లై కామచారంబుల నధర్మప్రవర్తనంబు నకుం జొచ్చి కృతయుగంబునకంటెఁ ద్రేతయుఁ ద్రేతాయుగంబునకంటె ద్వాపరంబును ద్వాపరంబునకంటెఁ గలియునుం గా నుత్తరోత్తరం బల్పజ్ఞానశక్తులు నల్పాల్పసుఖులు నత్యల్పజీవితులు నై క్రిమికీటప్రాయు లగుచు నశింప నున్న ననుకంపాయత్తచిత్తుం డై భగవంతుండు తత్తత్కాలంబుల దేవతిర్యఙ్మనుష్యాదిసజాతీయతాంగీకరణంబున నవతరించుచుఁ బునఃపునరుద్ధరణంబున ధర్మప్రవర్తనంబు గల్పించుచు ధర్మాచరణం బొనరించునప్పుడు నిజానుగ్రహరూపపుణ్యఫలంబు గా ననుకూలసుఖసంబంధంబులు గల్పించుచు నధర్మప్రవర్తకు లైనయప్పుడు నిజనిగ్రహరూపఫలంబు గాఁ బ్రతికూలదుఃఖంబు లొదవించి శిక్షించుచుం గేవలాధర్మనిష్ఠు లైనయెడం బునఃప్రళయంబు గలిగించి యుడుపుచు నివ్విధంబున నఖిలభూతహితపరత్వంబునన లీలాప్రవృత్తుం డగుటం జేసి విచిత్రఫలభోక్త లగుజీవులంగూర్చి వైషమ్యనైర్ఘృణ్యంబు లీశ్వరునకుం దొరల నేర వట్లు గావున. 61



చ. కలుగదు కర్మబంధమును గాఁడు నియోజ్యుఁడు లే దవిద్య ప్రాఁ
బలుకులు దెల్పఁ గాన జనపాలనసంహృతు లీశ్వరుండు దాఁ
జలుప గతంబు తత్ఫలము సత్యము లీల యొకండ యెవ్వ యుం
దలఁచినయంతమాత్ర నగు దానఁ బ్రయాసము గల్గ దేమియున్. 62

క. దేవతలును ఋషులుం దను, భావ మెఱుంగరు సుకర్మఫలమునఁ దత్త
ద్దేవర్షిభావబోధ, శ్రీవిభవము లతఁడ వారిఁ జేర్చినకతనన్. 63

క. భూతభవత్ప్రభవిష్య, ద్భూతంబుల నెఱుఁగు నవ్విభుం డతనిఁ గనన్
భూతభవత్ప్రభవిష్య, ద్భూతంబుల లేఁడొకండు భూవర! వింటే. 64

చ. అవనివిభుండు నాకవిభుఁ డండవిభుం డణిమాదిసిద్ధులున్
వివిధసుకర్మశక్తిఁ బ్రభవింతు రతండ యనుగ్రహింప వి
ప్రవరులు బద్ధచేతనసపక్షులు సిద్ధులు ముక్తులున్ ధరా
ధవ! విను మీశితత్వసముదాయము లీశుఁ డతండ వీరికిన్. 65

సీ. అర్కానలాదుల కాత్మ యై దీప్తిచే, వెలిఁగించు నతఁడ యీవిశ్వ మెపుడు
మహి కాత్మ యై మహామహిమచే నిత్యంబు, ధరియించు నెల్లభూతముల నతఁడు
పోషించు నతఁడు సర్వౌషధీసలముల, నమృతాత్ముఁ డగుచంద్రునందు నిలిచి
జఠరాంతరగ్ని యై జంతుభుక్తంబుల, నఱిగించు భోజ్యపేయాదు లతఁడ
గీ. యఖిలజనహృదంతరాత్మ యై సకలప్ర, వృత్తు లతఁడ కలుగఁ జిత్తగించు
నతనితోడఁ బాసి యణు వైనఁ గలుగ దీ, ప్రకృతిపురుషజప్రపంచమునను. 66

క. నీరజగర్భాండంబుల, నారసి చూచినఁ దదీయయత్నము వెలి గాఁ
బూరితుద యైనఁ గదల, న్నేర దిది రహస్యతత్త్వనిర్ణయము సుమీ. 67

క. సర్వావస్థావస్థిత, సర్వాంతశ్చిచ్ఛరీరసహితుల డగుచున్
సర్వప్రకారముల నీ, సర్వము నై యున్నవాఁడు సత్యం బధిపా! 68

మ. అపృథక్సిద్ధము గాన మర్త్యుఁ డని దేహం బెట్లు తద్దేహితో
వ్యపదేశం బగు నట్లు సత్త్వచిదచిద్వర్గంబు నుర్వీపతీ!
యపృథక్సిద్ధవిశేషణత్వమున దేహం బౌట విష్ణుండ కా
వ్యపదిష్టం బగు సర్వవాచకవచోవామ్యం డతం డొక్కఁడున్. 69

ఉ. స్థూలకృశాదిరూపముల దాఁకొను నేకవిధాత్మవస్తువుల్
బోలె జగచ్ఛరీరకతఁ బొల్పుట సర్వవచోభిలాష్యుఁడై
క్రాలినఁ గ్రాలుఁ గాని మురఘస్మరుఁ డొందఁడు హేయసంగతిన్
బాలకృశాదినామములఁ బైకొన కుండుతదాత్మకైవడిన్. 70

ఉ. కారణభూతతంతుమయకార్యవిచిత్రపటంబునందుఁ జె
ల్వారదె శుక్లతాదిగుణ మయ్యయితంతువ? నట్ల యీజగ
త్కారణకార్యతాదశలఁ గైకొన వెన్నఁడు భోక్తృభోగ్యసం
ప్రేరకభావము ల్చిదచిదీశ్వరులం దొకవై పరీత్యమున్. 71

క. భూనాథ! యిట్టితత్త్వ, జ్ఞానము లేకున్న నతని జగదేకవిభుం
గా నెఱుఁగ లేఁ డెఱింగినఁ, గాని తదేకప్రియుండు గాఁ డెవ్వాఁడున్. 72

తే. జనియు నాదియు లేక యీశ్వరుల కెల్ల, నీశుఁడొక్కండ కా విష్ణు నెఱుఁగుఁ బ్రాజ్ఞుఁ
డతని నన్యసజాతీయమతిఁ దలంచు, నతఁడ కడు మూఢుఁ డగు నిశ్చయమ్ము సూవె.

చ. జనితకృపైకహేతువున సర్వసమాశ్రయణీయతార్థమై
మనుజుఁ డనంగఁ బుట్టి యతిమానుషకృత్యము లాచరింపఁ గ
న్గొని యుఁ దమోవిరాజితతను ల్జగదన్యసమానబుద్ధి నా
తనిఁ గలుషించి కూలుదురు తద్వ్యతిరిక్తభవార్ణవంబునన్. 74

మ. తనసంకల్పముచే జగజ్జనవిధ్వంసంబులం జేయఁ జా
లినసర్వేశున కెంత యత్న మగుఁ బోలింపన్ ఖలధ్వంసనం
బనఁగాఁ దత్సకలావతారములు లీలాయత్తముల్ శాపము
ఖ్యనిమిత్తంబు నెపంబు విస్మరణశోకాదు ల్ప్రమోదించుటల్. 75

## వేదవేదాన్తపురాణ స్వరూపనిరూపణము.

వ. ఈయర్థంబు వేదనిశ్చితం బెట్లన వేదపూర్వభాగంబు విధ్యర్థవాదమంత్రరూపంబునఁ ద్రివిధంబు. అందు విధ్యంశంబు ప్రవర్తకనిషేధనియమసంకోచభేదంబునం ద్రివిధంబు. ప్రవర్తకవిధు లన భగవదనుగ్రహహేతుకర్మంబులయందుం బ్రవర్తించుప్రేరకవాక్యంబులు. నిషేధవిధు లన భగవన్నిగ్రహహేతుకర్మంబులయందు నిర్వర్తించునిషేధవాక్యంబులు. నియమసంకోచకవిధు లన భగవద్విస్మృతిహేతువిషయానుభవంబు దొఱంగిననరులకుఁ దాదృగ్విధేంద్రియార్థపరత్వంబు రుచించునట్టిభోగవ్యవస్థావస్థాపకవాక్యంబులు. ఇందుఁ బ్రవర్తకవిధులును నుపాత్తదురితక్షయార్థంబున ననిష్టనివర్తనపూర్వకంబుగా నధికారజనకంబులు, నభిమతార్థసాధనావబోధకత్వంబున నిష్టప్రాపకంబులు నై ద్వివిధంబులు. అందుఁ బ్రథమగణితంబులు నిత్యనైమిత్తికంబులుం, దదనంతరగణితంబులు కామ్యంబులు నవంబడు. ఇది విధిభాగనిరూపణంబు. ఇట్టివిహి



తాచరణాపేక్షితంబు లగుఫలప్రదనిరూపణాదిప్రతిపాదకభాగం బర్థవాదంబును, విహితానుష్ఠేయార్థప్రకాశకంబు మంత్రభాగంబు ననం బడు. అందు నర్థవాదంబు శబ్దప్రధానంబునుం, గేవలతాత్పర్యప్రధానంబును నన రెండువిధంబులు. అందు ప్రమాణాంతరవిరోధంబు లేనియెడ శబ్దప్రధానంబును, తద్విరోధంబుగలయెడం గేవలతాత్పర్యప్రధానంబునుం గా నంగీకరింపవలయు. ఇది వేదపూర్వభాగస్వరూపంబు. ఇంక వేదాంతభాగంబును సద్విద్యాదహరవిద్యాదివిజ్ఞానవిధివిశేషంబుల స్వతంత్రభేదవిశేషాపవర్గవ్యతిరిక్తఫలాంతరవిశేషాదివిశేషంబుల నిహితజ్ఞానవిశేషవిషయజ్ఞేయప్రకారభేదతత్స్వరూపనిరూపణతత్ప్రీతిప్రాప్తిరూపఫలాద్యర్థప్రతిపాదనవిశేషంబుల విహితానుష్ఠేయార్థప్రకాశప్రణవాష్టాక్షరాదిమంత్రవిశేషంబులం గలుగుట విధ్యర్థవాదకమంత్రవిభక్తివేదపూర్వవిభాగంబుతో సమరూపంబ. అందు వేదపూర్వభాగవిహితకర్మవిశేషంబు లెల్ల ఫలప్రదదేవతారాధనాత్మకంబు లై తదారాధనీయదైవతైకశేషంబు లగుట నారాధనాత్మకకర్మవిధిభాగంబునకంటె నారాధనీయదేవతాప్రతిపాదనరూపం బైనయర్థవాదభాగంబె ప్రధానం బగు. ఐనను బ్రాయికంబుగ లోకంబు కేవలకర్మాధికారి యగుటం గర్మకర్తవ్యతావిశ్వాసజననార్థంబును ఫలప్రదం బగుటకుం గేవలకర్మం బనుష్ఠాతయందుఁ గర్మనిష్పాదకదేహాంతరాతిరిక్తుం డై కర్మఫలభోక్త యగుజీవుండు గలం డనుసత్తాజ్ఞానమాత్రంబె కాని తత్స్వరూపనిరూపణాదికంబు నపేక్షింపం దగుటనుం గర్మప్రాధాన్యసిద్ధికై కర్మప్రతిపాదకపూర్వభాగంబునందు నర్థవాదంబు విధివిశేషంబు గా సమర్థింపుదురు గాని వేదాంతభాగవిహితోపాసనాత్మకజ్ఞానవిశేషంబు లెల్ల నుపాస్యస్వరూపైకనిరూపణీయంబు లగుట వేదాంతంబునందు స్వయంపరమపురుషార్థరూపోపాస్యస్వరూపాదిసమర్థనార్థభాగశేషంబ తత్ప్రాప్త్యుపాయభూతతదుపాసనాత్మకజ్ఞానవిధిభాగంబు. ఇట్టికర్మజ్ఞానప్రతిపాదకంబు లగువేదపూర్వోత్తరభాగంబులం బ్రకారవైవిధ్యంబున భగవత్ప్రతిపాదకంబుల. అత్తెఱంగు వినుము. లౌకికవైదికవాచికశబ్దంబు లెన్ని యన్నియు భగవన్నామంబుల. అందు సవ్యవధానాభిధాయకంబులు నవ్యవధానాభిధాయకంబులు నుభయవిధానాభిధాయకంబులు నై మూఁడుదెఱంగు లై యుండు. సవ్యవధానాభిధానంబు లనం బ్రకారభూతప్రకృతిపరిణామభూతపిండవిశేషజీవముఖంబునం బ్రకారిబ్రహ్మవాచకంబు లగుదేవతిర్యఙ్మనుష్యాదిలౌకికశబ్దంబులు. అవ్యవధానాభిధానంబు లన సాక్షాద్భగవద్వాచకంబు లగుపరబ్రహ్మపరమాత్మపురుషోత్తమవాసుదేవనారాయణాదిశబ్దంబులు. ఉభయవిధానాభిధానంబు లనం బుష్కలగుణయోగంబు ముఖ్యార్థంబుచే భగవద్వాచకంబు లయ్యుం దద్గుణలవయోగంబున నౌపచారికంబులై ప్రకారభూతదేవతాంతరసూచకంబు లగుచుఁ బ్రకారిబ్రహ్మవాచకంబు లగునింద్రాగ్ని

వాయువరుణాదిశబ్దంబులు. ఇట్టి త్రివిధాభిధానంబులకు నభిధేయం బైనపరబ్రహ్మం బును గారణరూపంబును గార్యరూపంబు నన ద్విప్రకారంబులఁ బ్రతిపాదింపం బడు. అందుఁ బ్రధానం బైనకారణరూపభగవత్స్వరూపంబును దత్తత్సాధారణవిగ్రహస్థానాదివిశేషంబులుం దదుపాసనావిధానంబులుం దత్ప్రకారభేదంబులుం దత్ఫలం బైనమోక్షంబును నవ్యవధానాభిధానంబులచేత వేదాంతభాగంబుం బ్రతిపాదించు. * తదనురోధావిరోధతాత్పర్యం బైనవేదపూర్వభాగం బుభయవిధాభిధానంబులచేఁ గార్యరూపభగవద్రూపవిశేషంబులుం దదుపాసనవిధానంబులుం దత్ప్రకారభేదంబులు స్వర్గాదులుం బరహింసాదులు నై వివిధంబు లైనతత్ఫలంబులుం బ్రతిపాదించు. మాతాపితృసహస్రంబులకంటె వత్సలతరం బైనశాస్త్రం బనతిశయఫలం బైనమోక్షంబునందుఁ దుచ్ఛదోషదుష్టఫలంబులం దదుపాయంబుల విధించుటకుం దాత్పర్యం బెఱుంగవలయును. వినుము. కేవలసాత్త్వికజనాధికారం బైనమోక్షసాధనంబు చూపినం బూర్వదుర్వాసనావశంబునం దదభిముఖులు గానిరాజసతామసజనులు నిజనిజాభిమతఫలసాధనం బెఱుంగక యనుపాయమార్గంబుల ననుపాయతానుమతిప్రవృత్తు లై ప్రణష్టు లయ్యెద రని సకలాధికారిసాధారణవత్సలం బైనశాస్త్రంబు నిజనిజానాదివాసనావశంబున స్వాభిమతఫలవ్యాప్తమనస్కు లగువిచిత్రాధికారులకుం దత్తదభిమతఫలసాధనంబు సకలఫలప్రదుం డగుభగవంతుం డొక్కండ కాన తత్తత్ప్రకారాంతరవిశిష్టభగవత్ప్రతిపాదనంబునుం దదారాధనభేదంబులను విధించెను. ఏతదభిప్రాయం బెఱింగి సాత్త్వికజనం బిందు స్వోపయుక్తాంశంబుచేఁ బ్రకారిసమారాధనంబు చేసి మోక్షంబు గాంతురు. ఇతరాధికారులు ప్రకారి నొల్లకయు నెఱుంగకయుఁ బ్రకారభూతదేవతాంతరమాత్రంబులయంద యుపాస్యతాబద్ధబుద్ధు లై తత్తదారాధనలబ్ధఫలలుబ్ధు లై నిత్యబద్ధు లై యుండుదురు. అట్లగుట నిఖిలవేదవేదాంతంబులు భగవత్ప్రతిపాదకంబుల, తదుపబృంహణంబు లై పౌరుషశాస్త్రంబు లైనపురాణంబులు వేదంబులుం బోలె మొదలఁ జతుర్ముఖముఖవినిస్సృతంబుల యైనను బ్రథమవక్త యగునతనిగుణానురోధంబున సత్త్వోదయసమయంబునం జెప్పంబడినయవి యథార్థజ్ఞానంబున భగవత్ప్రతిపాదకంబు లై దేవతాంతరప్రతిపాదకపురాణాంతరంబులకు నన్యథాజ్ఞానవిపరీతజ్ఞానమూలత్వంబు దెలుపుచు సాత్త్వికంబు లనంబడు. రజస్తమోగుణోదయసమయంబులం జెప్పంబడినయవి యన్యథాజ్ఞానవిపరీతజ్ఞానమూలంబు లగుటం దత్తద్దైవతాంతరపరత్వప్రతిపాదకంబు లై రాజసంబులుం దామసంబులు ననం బడు. ఇట్టిగుణత్రయమూలప్రతిపాదకవైషమ్యంబునుం దత్తదధికారవిశ్వాసజనకంబు లై తత్తదభిమతఫలప్రదంబు లగుట భగవత్సంకల్పకల్పితంబ యని యెఱుంగునది. 76

* 'తదనురూపాచిరాగతాత్పర్యంబు' అని పాఠాంతరము.



## ఉపాసకస్వరూపనిరూపణము.

తే. వనధి నభిధేయం బయ్యె వలయుపనికి, రేపులన కాని చొరరానిరీతి నధిప!
విశ్వరూపకుఁ డయ్యె శ్రీవిభుఁడు నుక్త, రూపముల సేవ్యుఁ డగు నారురుక్షువులకు.
సీ. ఆరురుక్షుం డన నారూఢుఁ డనఁగను, పాసకుం డిరువు రై పరఁగు నందు
నభ్యాసనిరతాత్ముఁ డారురుక్షువు నాఁగ, నారూఢుఁ డనఁగ నభ్యాసనిరతి
శయదశాసంస్కృతస్వాంతసాక్షాత్కృతే, భగవత్స్వరూపానుభవపరాత్ముఁ
డతనికిఁ దగుఁ గాని యవిశేషసకలప్ర, కారసంయుతరమాకాంతుసేవ
గీ. యారురుక్షువునకు నారూఢుఁ డగునంత, కొనర శుద్ధవిగ్రహుండ కాని
కర్మవశ్యజీవగతుఁ డుపాస్యుఁడు గాఁడు, నిత్యవర్ణధర్మనియతిఁ దక్క. 78
తే. జ్ఞానశక్తివిశిష్టవేషమున నంత, రాత్మ యై ప్రేరకుం డగు నఖిలమునకుఁ
గలుగు మఱిదివ్యశుభసువిగ్రహవిశిష్ట, పాంచవిధ్యంబు విభు వైనబ్రహ్మమునకు. 79

## విరుద్ధశ్రుతిసామరస్యము.

సీ. చిదచిద్విశిష్టతచెప్పినశ్రుతి దాన, తిరుగ బ్రహ్మం బద్వితీయ మనుట
విజ్ఞాతృభావంబు వెలయించి శ్రుతి దాన, మఱియు బ్రహ్మంబు చిన్మాత్ర మనుట
శుభగుణయోగంబు చూపినశ్రుతి దాన, మగుడఁ బరబ్రహ్మ మగుణ మనుట
దివ్యవిగ్రహయుక్తిఁ దెలిపినశ్రుతి దాన, యప్పటియును బ్రహ్మ మతను వనుట
గీ. సదృశ మొకఁడు లేమిఁ జాటుట జడభాగ, హీన మనుట హేయ మైనగుణము
గలుగ దనుట కర్మకార్యదేహంబు లే, దనుట శ్రుతిసమోభయార్థి యనుట. 80
క. సర్వాచేతనచేతన, సర్వావసరానుభూతసర్వావస్థా
సర్వప్రవృత్తిసత్తా, నిర్వాహక మంతరాత్మ నృపమణి! వింటే. 81

## భగవద్విగ్రహస్వరూపనిరూపణము.

సీ. పంచోపనిషదుక్తపరమేష్ఠిముఖశుద్ధ, సత్త్వసంశ్రయపంచశక్తిమయము
నిత్యదివ్యవిసర్గనిస్తులాద్భుతయావ, నాదికల్యాణగుణాస్పదంబు
సముపాశ్రితాత్మీయసర్వతత్త్వాత్మక, భూషణాయుధనిత్యభూషితంబు
సకలలోకస్వాంతచక్షురాకర్షకా, ప్యాయకతాపాపహారకంబు
గీ. స్వేతరసమస్తవైరాగ్యహేతుభూత, మఖిలయోగిమనఃప్రథమావలంబ
మాశ్రితార్థంబు లక్ష్మీసమాశ్రితంబు, విభునకైచ్ఛిక మై కల్గువిగ్రహంబు. 82
ఉ. శ్రీదయితుండు దాల్చుమణి జీవుఁడు లక్ష్మి ప్రధాన మంద్రు కౌ
మోదకి బుద్ధి శార్ఙ్గము సముజ్జ్వలశంఖము లింద్రియాదిభూ

తాదులు చక్రముల్లము శరాదికవర్గము వైజయంతి సో
త్పాదకభూతపఙ్క్తి యసి వైకృతి విద్యయు నయ్యవిద్యయున్. 83

## భగవదవతారరహస్యకథనము.

వ. ఏతాదృగ్విధవిగ్రహవిశిష్టవేషంబునం బరవ్యూహవిభవార్చాంతర్యామిరూపంబు లనం బరమపురుషునకుం బంచప్రకారంబులు గలవు. అందుఁ బరరూపంబు నిత్యముక్తానుభవార్థంబుగా నిత్యేచ్ఛానుగృహీతం బైననిత్యవిగ్రహంబునం బరమపదంబునం బరమవాసుదేవాభిధానంబున వెలుఁగొందుప్రధానప్రకారంబు. ఇట్టిది పరరూపంబు. జగదుత్పత్తిస్థితిప్రళయార్థంబు నుపాసకానుగ్రహార్థంబును నుక్తగుణద్వయద్వయాభివ్యక్తిలక్షణలక్షితంబు లై నిజేచ్ఛావశంబునం గైకొనినసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధవాసుదేవభావంబు లగుచతుర్విధవిభాగవిశేషంబులు వ్యూహంబు లనంబడు. అందుఁ గేశవాదిమూర్త్యంతరగ్రహణరూపంబు లైనయవాంతరవ్యూహంబులు వివిధంబులు. ఇట్టివ్యూహవిశేషంబులు దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనార్థంబుగాఁ దిర్యఙ్మనుష్యవిజాతీయతాంగీకారంబునం జూపునావిర్భావంబు విభవం బనం బడు. అదియును గౌణంబును ముఖ్యంబు నన ద్వివిధంబు. అందుఁ గర్మవశ్యజీవాధిష్ఠానద్వారంబునం దాత్కాలికకార్యార్థంబుగాఁ జూపుగుణావిర్భావంబు గౌణంబు. మఱి దీపంబువలనఁ బ్రతిదీపంబురూపంబున దివ్యవిగ్రహంబుతోడన చూపునావిర్భావంబు ముఖ్యంబు అందును వామనత్రివిక్రమన్యాయంబున నవాంతరాకారాంతరగ్రహణంబు లసంఖ్యేయంబులు. ఇంక నంతర్యామి యన నుపాసనాసిద్ధికై యుపాసకాంతరంగంబులకు విషయం బయ్యెడునుపాస్యవిగ్రహవిశేషంబు. మఱి యర్చావతారం బనం బరవ్యూహాదిసమస్తప్రశస్తలక్షణపరిపూర్ణం బై దేశకాలస్వభావవిప్రకర్షంబులేక యనాలోచితవిశేషాశేషజగజ్జనోజ్జీవనార్థంబుగా మాంసనయనంబులకు ననుభావ్యం బైనపూర్వోక్తసమస్తప్రకారంబులం జూపునవతారవిశేషంబు. అదియు స్వయంవ్యక్తంబు దైవంబు సైద్ధంబు మానుషంబు ననం జతుర్విధం బై యుండు. అందు నప్రాకృతదివ్యవిగ్రహంబున స్వతఃప్రాదుర్భావంబు స్వయంవ్యక్తంబు. శిలాదారులోహాదివిగ్రహంబుల దేవజనంబులచేతం దపస్సిద్ధమహర్షిజనంబుచేతను మర్త్యజనంబుచేతను బ్రతిష్ఠితంబు లైనయవి క్రమంబున దైవంబు సైద్ధంబు మానుషంబు ననంబడు. ఇట్టిపంచప్రకారంబులయందుం బరరూపంబు నిత్యైకప్రకారంబు, అది నిత్యముక్తైకగోచరంబు, వ్యూహరూపంబు వివిధంబు. తత్తద్దేవర్షిమాత్రగోచరంబు, విభవం బనంతప్రకారంబు, అది తత్తత్కాలీనజనగోచరంబు. అందును ముఖ్యవిభవంబు సైద్ధంబు నంతర్యామిరూపంబు నుపాసకేచ్ఛాభేదంబున నైకవిధం బుపాసకైకగోచరంబు. అర్చారూపం బనంతప్రకారంబు, అనాలోచితవిశేషాశేషజగజ్జనగోచరం బఖిలప్రకారసేవ్యంబు. 84



ఉ. దారుశిలాదిభావమున దైవముల న్నిరసించి తామసుల్
కోరుదు రెంతచేరువయొకో తను కాత్మవివేకపాకముల్
వారిధరంబుల న్విడిచి వచ్చినచాతకధూర్తు లంబుధిన్
దార గొనంగ శక్తులె సుధామధురోదకపానసౌఖ్యముల్.! 85

క. కావునసర్వగుఁ డయ్యును, శ్రీవరుఁ డర్చాగతుండ సేవ్యుం డగుఁ ద
త్సేవయు శరణాగతుఁ డై, కావింపక ఫల మొసంగఁ గా లే దధిపా.! 86

## ప్రపన్నస్వరూపనిరూపణము.

వ. దుర్లభాభిమతార్థసిద్ధికిం గృపాశక్తిసంపన్నుం డైనసమర్థునియందు నుపాయాంతరనివృత్తిపూర్వకంబుగాఁ జేయుభరసమర్పణంబు శరణాగతిత్వం బనం బడు. ఇది యభిమతార్థసిద్ధిదం బగుట సకలజగత్ప్రసిద్ధంబు. ఇట్టికృపాశక్త్యాదిగుణవత్స్వరూపం బైనశరణ్యత్వంబునుం భగవద్వ్యతిరిక్తపురుషాంతరంబునం దౌపాధికంబు నల్పాల్పతమంబును నై యుండు. అతని నాశ్రయించువానిశరణాగతత్వంబు నౌపాధికంబు నల్పాల్పప్రయోజనంబు నగు. ఆశరణ్యత్వంబు భగవంతునందు స్వాభావికంబును నిరతిశయంబును నై యతనియందుం దదితరసమస్తపురుషులకు శరణాగతత్వంబు స్వరూపోచితంబును నిరతిశయప్రయోజనార్థంబు నగు. అట్లగుట నీయర్థంబున యథార్థజ్ఞానంబున నిశ్చితంబుగా నెఱింగినసాత్త్వికుం డభిమతార్థసిద్ధికి నితరుల నొల్లక భగవంతు శరణంబు సొచ్చి తదారాధనంబు సేయవలయు. అట్లు చేసె నేని స్వరూపసిద్ధియు దేశకాలమంత్రతంత్రాదిన్యూనాతిరేకంబులవలన వైకల్యంబు లేక యారాధనఫలాభిమతార్థసిద్ధియు నగు. అట్లు సేయం డేని కర్తృత్వాహంకృతిచే స్వరూపహానియు నారాధనవైకల్యంబుచే ఫలహానియు నగు. ఇట్టిసాత్త్వికుండును మిశ్రసత్త్వనిష్ఠుండును శుద్ధసత్త్వనిష్ఠుండును నన ద్విప్రకారుండు. అందు మిశ్రసత్త్వనిష్ఠుం డనం బరమాత్మ యగుభగవంతునకుం గలశేషత్వంబునుం దదితరసమస్తజీవాత్మలకు నైనశేషత్వంబును స్వాభావికంబులుగా నెఱింగియుఁ దదేకభోగ్యుఁడు గాక ప్రారబ్ధకర్మవాసనావశంబునఁ దామసరాజసఫలంబు లభిలషించి తదర్థంబుగా భగవత్ప్రతిపత్తి సేయునతండు. శుద్ధసాత్త్వికుం డనసుజ్ఞానంబుచే భగవదేకభోగ్యుం డై తత్ప్రాప్తిరూపమోక్షంబె యపేక్షించి భగవత్ప్రతిపత్తి సేయునతండు. అందు మిశ్రసత్త్వనిష్ఠుండు నీశ్వరయథార్థజ్ఞానవంతుం డగుటం దత్ప్రభావంబుచేఁ గ్రమంబున ఫలానుభవంబుచేత నీశ్వరానుగ్రహంబుచేఁ బ్రారబ్ధకర్మంబు జయించి శుద్ధసాత్త్వికుం డగు. అట్టిశుద్ధసాత్త్వికుండును ననాదిసుకృతపరిపాకభేదంబున నంగప్రతిపత్తిపరుండును స్వతంత్రప్రతిపత్తిపరుండు నన ద్వివిధం బగు. అందు నంగప్రతిపత్తినిష్ఠుం డన నభిమతభగవత్ప్రాప్తికిఁ గర్మజ్ఞానానుగృహీతం బైనభక్తియోగంబుచే భగవదనుగ్రహంబు వడయంగోరి తాదృగ్విధభక్తినిష్పత్తికై

తదంగంబు గా శరణంబు చొచ్చునతండు. స్వతంత్రప్రపత్తినిష్ఠుం డన నుక్తభక్తి
యోగనిష్పాదనంబునయం దశక్తుండును విలంబాసహిష్ణువు నై యవ్యవధానంబున
భగవదనుగ్రహంబు వడయుటకై ప్రపత్తి సేయునతం డట్లు గావున. 87

**తే.** మహి నసంఖ్యేయపుణ్యజన్మములమీఁద, నాత్మహరిశేషతాజ్ఞాన మంకురించి
ప్రాప్యమును బ్రాపకము సర్వ మతఁడ యనుచు, నతనిశరణంబు చొచ్చుమహాత్ముఁ డరిది.

**తే.** గురుకృపాంజనరంజనస్ఫురిత మైన, శాస్త్రదృష్టిఁ బరాత్మశేషత్వరూప
మైనయాత్మస్వరూపవిధాన మెఱిఁగి, నతఁడు తత్ప్రాప్తికై చొచ్చు హరిశరణము.

**క.** ఒకఁడు భగవంతుఁ డెట్లుగ, సకలేష్టవిధాయి యెట్లు చర్చింపఁగఁ దా
నొకఁడ యగుఁ దత్ప్రపత్తియు, సకలార్థసమీహితార్థసాధన మనఘా! 90

**క.** శరణాగతులకుఁ దక్కన్, బరులకు మోక్షంబు లేదు భవనస్థుఁడు ని
ర్భరుఁడు నన నిరుదెఱఁగులఁ, బరఁగుఁ బ్రపన్నుండు సుకృతపరిపాకభిదన్. 91

**క.** శక్తాధికారి కనితర, భక్తిద్వారమునఁ జేసి పరమోపాయం
బుక్తప్రపదన మితరా, సక్తునకు హితస్వతంత్రసాధన మరయన్. 92

**వ.** అందు నంగప్రతిపత్తిపరునకు నంగభూతప్రపత్తిసాధ్యంబును బరబ్రహ్మప్రాప్తిసాధ
కంబు నగుభక్తియోగస్వరూపం బాకర్ణింపుము. 93

## భక్తియోగస్వరూపనిరూపణము.

**సీ.** వేదాంతవాక్యార్థవిజ్ఞానజన్యంబు, తద్విలక్షణము ప్రత్యక్షసమము
దర్శనోపాసనధ్యానాదిపదవాచ్య, మాత్మాపరోక్షముఖ్యప్రతీక
ముక్తకర్మజ్ఞానయోగనిష్పాద్యంబు, పరభక్తిముఖదశాంతరయుతంబు
యజనవందనకీర్తనాదిపర్యవసాయి, యపునరావృత్తిమోక్షావధికము

**గీ.** తైలధారానవచ్ఛిన్నతాగతంబు, ప్రీతిరూపసమాపన్న మై తనర్చు
సతతభగవత్స్వరూపానుసంస్మరణము, భక్తియోగంబు తత్పదప్రాపకంబు. 94

**వ.** వినుము శాస్త్రార్థతత్త్వజ్ఞానంబుచేఁ గర్మయోగాధికారంబు సంభవించు జపతపస్తీర్థదా
నయజ్ఞాదిసేవనరూపం బైనకర్మయోగంబుచే జితాంతఃకరణుం డై పురుషునకు జ్ఞాన
యోగాకారంబు సంభవించు. పరిశుద్ధాత్మభావనారూపం బైనయోగద్వారంబుచే
నొండె నంతర్గతతాదృగ్విధాత్మజ్ఞానంబున నైనసాక్షాత్కర్మయోగంబుచేతన యొండె
యోగాధికారంబులు గల్గు. ప్రకృతివివిదితాత్మావలోకనరూపం బైనయోగంబుచే నాత్మ
శేషత్వజ్ఞానంబు దృఢం బై భక్తియోగాధికారంబు సిద్ధించు. పరమాత్మైకాంతికప్రీతి
కారితధ్యానకీర్తనయజనవందనాద్యవస్థితిరూపం బైనభక్తియోగంబుచేఁ బరమభక్తిపర
మజ్ఞానాదితదవస్థావిశేషముఖ్యంబున ముక్తుండై పరమపదప్రాప్తుం డగు నట్లు గావున.

**తే.** జ్ఞానకర్మంబు లాత్మదర్శనముకొఱకు, నాత్మదృష్టియు భక్తిసంప్రాప్తికొఱకు



భక్తిభగవత్పదాప్తికై పరఁగు నిందు, లేదొకవిపర్యయసముచ్చయాదిశఁక. 96

**తే.** ధీరహితకర్మమును గర్మదూరమతియు, భక్తివిరహితధీక్రియల్ ముక్తబుద్ధి
కర్మ మగు భక్తియోగంబు గాదు గాన, వలయు మాత్రస్వరాదికాన్వయము చూవె.

**క.** ధీకర్మభక్తియోగము, లేక శరీరమునఁ గలుగ వెవ్వారికి నా
ధీకర్మంబులు జననా, నేకసహస్రములమీఁద నిచ్చున్ భక్తిన్. 98

**సీ.** శాస్త్రార్థబోధంబు సంభవింపక యైన, నొకఁ డెవ్వఁడేఁ గర్మయోగి యగుట
కర్మయోగావృత్తి గలుగ కేనియు నొకా,నొకఁ డెవ్వఁడే జ్ఞానయోగి యగుట
యుక్తాత్మభావనాయోగంబు లేకున్న, నొకఁ డెవ్వఁడే యోగ యోగ్యుఁ డగుట
యాత్మావలోకనం బభ్యసింపక యైన, నొకఁ డెవ్వఁడే భక్తియోగి యగుట

**గీ.** ప్రాగ్భవాగమవిజ్ఞానఫలము చూవె, పౌర్వజననాకలితకర్మఫలము చూవె
ప్రథమజన్మాత్మభావనాఫలము చూవె, ప్రాగ్జననయోగపరిణామఫలము చూవె. 99.

## త్యాజ్యసంసారరూపనిరూపణము.

**వ.** వస్తువివేకంబు లేక విషయవిరక్తియు భగవద్భక్తియుం బొడమ వట్లగుట భజనీ
యభగవత్స్వరూపనిరూపణం బయ్యె నింకఁ ద్యజనీయసంసృతిస్వరూపంబు
వినుము. జీవుండు జ్ఞానస్వరూపుండును జ్ఞానగుణకుండును నిర్మలుండును భగవ
చ్ఛేషతైకరసుండును భగవదేకభోగ్యుండును నయ్యు ననాదికర్మరూపావిద్యాసం
కుచితగుణభూతజ్ఞానుం డై స్వస్వరూపపరమాత్మస్వరూపంబుల విషయీకరింప
నెఱుంగమి సహజానందవిముఖుం డయి యనాదినిజకర్మానురూప భగవత్సంకల్ప
కల్పితప్రకృతిపరిణామవిశేషం బైనకళేబరంబుచే బద్ధుం డై బంధనకళేబరంబుఁ
దన్నుంగాఁ దలంచుకొని యింద్రియాధీనజ్ఞానుండును విషయాధీనసుఖుండును
నై సర్పదష్టునకు నింబపత్రంబులు మధురంబు లై తోఁచువిధంబునఁ గర్మ
బద్ధుం డైనతనకు జడప్రకృతిపరిణామవిశేషంబు లగు హేయవిషయంబులు భోగ్యంబు
లై తోఁపఁ దదనుభవలుబ్ధబుద్ధి యగుచుం గర్మాచరణం బొనరించుచుఁ దత్ఫలంబు
లైనసుఖదుఃఖంబు లనుభవించుచు వాసనావశంబునం గ్రమ్మఱ రుచి పుట్టి యుత్త
రోత్తరంబు కర్మం బొనరించుచు ననలతప్తస్థాలీసంసర్గకారణంబున నుదకం బుష్ణ
భావబుద్బుదాదికంబు నొందుచందంబున నచిత్సంసర్గదోషంబున హేయదుఃఖాది
కంబునకు నాస్పదం బై సంచరించు. తత్క్రమం బాకర్ణింపుము. అనాదిపూర్వ
కర్మకారణంబున సకలభావంబులయందుం దత్తద్దేవమనుష్యాదిరూపంబున జరాయు
జత్వంబునుం, బక్షిసర్పాదిరూపంబున నండజత్వంబును, గీటకాచరాదిరూపంబున
నుద్భిజ్జభావంబును, యూకాదిక్రిమిరూపంబున స్వేదజత్వంబునుం గాఁ జతుష్ప్ర
కారంబులఁ బుట్టుచుండు. ఇందు మనుష్యభావంబు దక్కం దక్కిన పుణ్యపాప
కర్మాధికారంబు లయినసకలభావంబులయందుఁ దత్తద్భావప్రయుక్తకేవలసుఖదుఃఖం

బులఁ బొందుచుఁ, బుణ్యపాపకర్మాధికారం బైనమనుష్యభావంబునందు బహిరంతరింద్రియవ్యాపారరూపం బైనజాగ్రద్దశ యప్పుడు జీవవ్యాపారద్వారకేశ్వరప్రయత్నసంస్పృష్టంబు లైనవిషయంబు లనుభవించుచుఁ, దదనుభవపరిశ్రాంతబహిరింద్రియోపరమరూపం బైనస్వప్నదశయందుఁ దత్తత్కాలమాత్రంబులు దత్తత్పురుషమాత్రానుభావ్యంబులుం గాఁ గేవలేశ్వరప్రయత్నసంస్పృష్టంబు లైనవిచిత్రవిషయంబుల నంతఃకరణంబుచేత నే యనుభవించుచుఁ, దదుభయదశావిషయవిశేషానుభవవ్యాపారపరిశ్రాంత బహిరంతరింద్రియోపరమరూపం బైనసుషుప్తిదశయందు నిస్సంబోధుం డగుచు, బాహ్యాభ్యంతరంబులు మఱచి విశ్రమస్థానం బైనపరమాత్మయందు నుపరతుం డై విశ్రమించుచు, నతనిచే స్వస్థుం డై వెండియు భోగార్థంబు బోధితుం డై మేల్కనుచు, అర్ధమరణరూపం బైనమూర్ఛయందు నచిత్ప్రాయుం డై జ్ఞప్తిసంకోచంబు నొందుచు, ఉత్క్రాంతిరూపం బైనమరణదశయందుం గ్రమంబున బహిరింద్రియంబు లంతఃకరణంబునందు నంతఃకరణంబు ప్రాణంబులందుఁ బ్రాణంబులు దనయందుఁ దాను భూతతన్మాత్రంబులయందుఁ దన్మాత్రంబులు పరమాత్మయందును బరిణమింప నిస్సంబోధుం డై బాహ్యాభ్యంతరంబులు మఱచి, బాహ్యాంతఃకరణభూతతన్మాత్రసంయోగరూపం బైనసూక్ష్మశరీరంబుతో నుత్క్రాంతుం డై హృదయస్థానసంబంధం బగు నేకోత్తరశతనాడికాదిగణంబునందు ముక్త్యైకనిర్గమద్వారం బైనమూర్ధన్యనాడి దక్కం దక్కినశతనాడీద్వారంబులవెంట నేదే నొక్కంట నేత్రశ్రోత్రాదిశరీరప్రదేశంబుల వెడలి, కేవలపాపపరుం డేని యాతనాతనూబద్ధుం డై నియమమార్గంబునం గింకరాకృష్టుం డై చని, నిరయంబు లనుభవించినపిదపం బరిశిష్టకర్మాంతరవశంబున 'జాయస్వ మ్రియస్వ' యనుసంకల్పమాత్రంబునఁ బునఃపునర్నిష్కృష్టజన్మమరణంబులం బొరలుచు, ఇష్టాపూర్తాదిపుణ్యకర్మపరుం డేని సూక్ష్మశరీరంబుతో ధూమాదిమార్గంబునం గా నుత్తరోత్తరప్రాపితుం డగుచుఁ, గ్రమంబున ధూమరాత్ర్యపరపక్షదక్షిణాయనపితృలోకాకాశచంద్రస్థానంబులకుం జని, చంద్రప్రాప్తిచేత నమృతమయశరీరుం డై తత్తదనుగుణపుణ్యలోకంబులం దత్తదధిదేవతాకింకరుం డగుచుఁ దత్తత్సమానభోగంబు లనుభవించి, పుణ్యావసానంబునం గర్మాంతరప్రారంభంబునం గ్రమ్మఱ సూక్ష్మశరీరంబుతో నవరోహణక్రమంబున డిగ్గి, క్రమంబునం జంద్రాకాశవాయుధూమాభ్రమేఘంబులకు వచ్చి, మేఘంబుననుండి వర్షం బై పురుషునిం జెంది, పురుషునియందు రేతోరూపంబునం బరిణమించి, యోషిత్కుక్షిం బడి, యందు గర్భం బై పొదలి, క్రమ్మఱ జీవత్వంబునం జన్మించు. ఇట్టిసంసారావర్తగర్తంబునం బరిభ్రమించుచు. 100

ఆ. గర్భజన్మబాల్యకౌమారతారుణ్య, వృద్ధతాదు లైనవివిధదశల
నొకట నైన సుఖము నొందలేఁ డన్నిట, నవధి లేనివగల నంచుఁ బ్రాణి. 101



సీ. మలమూత్రపంకిలమాతృగర్భంబున, నతిసుకుమారదేహము దపింప
ముడియకట్టుగ వీఁపునడుము నెమ్ములు వంగి, యుల్బపరీతుఁ డై యుండి లోన
నత్యుష్ణలవణకట్వమ్లాదితన్మాతృ, భోజనంబులకాఁకఁ బొక్కి పడుచుఁ
బరితృప్తి యుడుపఁ జాఁపఁగ సమర్థుఁడు గామి, సర్వాంగముల నొప్పి సంఘటిల్ల
గీ. నూర్పు వెడలక విజ్ఞానయుక్తిఁ బూర్వ, జనిశతంబులఁ దలపోసికొనుచు నిట్లు
కాంచు దుస్సహగర్భదుఃఖంబు మొదలఁ, బ్రాణి ప్రాచీనకర్మనిబంధనమున. 102

సీ. ప్రేరకోత్కటసూతిమారుతాహతి గర్భ, మున నధోముఖుఁడుగాఁ బొరలఁబడుచు
దేహసంకోచకద్రాహిణానిలముచే, నానాస్థిసంధిబంధములు నొగుల
శుక్లమూత్రపురీషశోణితావృతి బ్రుంగి, ముఖము విచ్ఛిన్న మై మొనల వెడలఁ
గేశమూర్ఛాయుక్తిఁ గ్రిమివోలె నెట్టకేఁ, దల్లిదుర్గంధరంధ్రమున వెడలి
గీ. జగతిఁ బడి బాహ్యవాయుసంస్పర్శనమున, నెఱుక చెడి కావుకావున నేడ్చుఁ బ్రాణి
యంపమునఁ గోయుగతి ముండ్లఁ ద్రెంపునట్లు, యోనియంత్రప్రపీడచే నొడలు నొవ్వ.

చ. మలమున బ్రుంగుఁ డైనతలిమంబుపయిన్ శయనించి మేను చీ
మలు దిన మక్షికల్ గఱవ మానుప నేరక యొత్తిగిల్లి పై
నొలసినతీఁట గోఁకికొన నోపకయే వ్యవహారమజ్జనా
దులును బరేచ్ఛఁ గైకొనుచు దుఃఖము నొందు శిశుత్వవేళలన్. 104

క. గురుజననిరోధభా, కరణంబులవలన నిలుపు గానక క్రీడా
పర మగుహృదయము దుఃఖా, కర మై తపియించుఁ బ్రాణి కౌమారమునన్. 105

సీ. ఎవ్వండ? నెందుండి యెచటి కేమిటికి నే, బద్ధుండ నైతి నేబంధనమునఁ?
గారణం బెయ్యది? కాదు కారణ మెద్ది?, యెద్ది కారణజన్య? మేది కాదు?
ధర్మ మే దేది? యధర్మంబు నే దిప్పు?, డెందు వర్తించెద? నెందు నిలువ?
నేది కృత్య? మకృత్య మెయ్యది? గుణసంపి, శిష్ట మెయ్యది? దోషజుష్ట మెద్ది?
గీ. యనువివేకంబు లేక ప్రాయమునఁ గ్రొవ్వి, పశువువోలె శిశ్నోదరపరుఁడు నరుఁడు
సంచరించుచు నజ్ఞానసంభవంబు, నధికతర మైనదుఃఖంబు ననుభవించు. 106

క. కరణకళేబరపాటవ, కర మగుప్రాయంబు తనకుఁ గలుగుటకు దురా
చరణమ ఫల మగు శిశ్నో, దరపరుఁడు సుఖంబ కాఁగఁ దలఁచు న్వగయున్. 107

శా. అజ్ఞానం బనఁ గాఁ దమోవిలసనం బజ్ఞానకార్యోదయం
బజ్ఞానానుగుణంబ కాన గళితోక్తాచార మాదానికిన్
బ్రాజ్ఞుల్ ప్రాప్యఫలంబు నారకము గా భాషింతు రట్లౌటచే
నజ్ఞానాదుల నిందు నందు నిజ మై ప్రాపించు దుర్దుఃఖముల్. 103

సీ. మృగపక్షిరాక్షసోరగనరాదులచేతఁ, బరఁగుతాపం బాధిభౌతికంబు
శీతోష్ణవైద్యుతవాతవర్షాదులఁ, దనుకుతాపం బాధిదైవికంబు
గుల్మజ్వరచ్ఛర్దికుష్ఠశూలాదుల, నవమానకామలోభాదిదశల
శారీర మై మనోజనిత మై యిబ్భంగి, నడరుసంతాపమాధ్యాత్మికంబు
గీ. పండితోత్తమ! యిట్టితాపత్రయంబు, ప్రాక్తనం బైనకర్మనిబంధనమున
ననుభవించుచు శోకార్తుఁ డగుచు నరుఁడు, బాల్యమున బ్రాయమున వృద్ధభావదశను.

వ. వెండియు జరాప్రాదుర్భావంబున శిథిలం బై కుదురుప ట్టెడలి లివలివం గదలురదనపఙ్క్తులును, జిగి దెగి బిగి వదలి స్రగ్గి వగ్గువడి తరంగితాయమానం బైనసర్వాంగీణచర్మంబును, బయలువడి నిలువునం దేటెనబీఁటనరంబులను, అంతర్గతకనీనిక లై దూషికామూషితాస్రనిస్సృతిం జెనకులం జిత్తడగొలుపుచు దూరితసైఖర్యంబు లై వెలికుఱికినకన్నులును, పుంజికొని వెడలి నిడుద లై యుడుగక రసగిలునాసాకేశంబులును, లాలావినిర్యాసంబులు సెలవుల నురుఁగుకొన దుర్గంధధురంధరం బైనవక్త్రకోటరంబును, ప్రస్ఫుటీభూతసర్వాస్థిస్థలంబును, పరిభుగ్నపృష్ఠాస్థిపరంపరాకంబు నయి కంపమానం బగుశరీరంబునుం గలిగి యెదుర నిలిచినం బొడగానక బెట్టు పిలిచిన వినక యాఘ్రాణించియుఁ గంధంబు గొన సమర్థుండు గాక చప్పరించియుం జవిపొం దెఱుంగక జఠరానలంబు కుంఠితంబగుట నల్పాహారుండును నల్పాల్పవిహారుండును నై యెట్టకేనియుం దడవున లేచుచు నెట్టకేనియుం దడవునఁ గూర్చుండుచు నెట్టకేనియుం దడవునఁ జేష్టించుచు ననుభూతవస్తువుల నాక్షణంబ మఱచుచుఁ బ్రవృత్తిప్రయత్నాక్షమంబు లైనసకలకరణంబులచే మరణంబునకుం గాలుచాఁచియుఁ బూర్వజన్మవ్యాపారంబులునుం బోనితనప్రాయంబునాటిపోకలు దలంచుకొని యుస్సు రని వేఁడినిట్టూర్పుతోఁ బరితపించుచు సకృదుచ్చారణంబున మిగుల నలయుచు శ్వాసకాసమహాయాసంబున వేఁగుచు నంతనం గంట బొట్టు వెట్ట నెఱుంగక వేఁగించుచు సంచారంబులకు నాకాంక్షించుచుఁ జవులు గొనంగోరుచు నోరుబు లేవ నెత్తం బరులు శయినింపఁ జేయ నఖిలశౌచవిరహితత్వంబున నిల్లరోఁతలకు నెల్లయై భృత్యు లవమానింపం బరిజను లపహసింప బాంధవులు ముక్కు విఱువం బుత్త్రులు వేసరం గళత్త్రం బోకిలింప నివి మొదలుగా వార్ధకదుఃఖంబు లనేకంబు లనుభవించి యంతమీఁద నత్యంతదుస్సహం బైనమరణం బనుభవించుఁ దత్ప్రకారం బాకర్ణింపుము. 110

సీ. హస్తాంఘ్రికంధర లవశంబులై త్రెళ్లి, కలయ నంగంబులఁ గంప మొదవి
పలుమాఱు మూర్ఛిల్లి పలుమాఱు దెలివొంది, తనకళత్త్రాదులతగులు మిగిలి
మరణావయవపీడ మర్మము ల్ఛేదిల్లి, ప్రాణానిలంబులపట్టు వదలి
తెల్లగ్రుడ్డులు తేలగిల్లి తీపులు పుట్టి, దోసము ల్పొందుగఁ దొట్టగిల్లి



గీ. పొడమగుట్టిత్తి తాల్వోష్ఠపుటము లెండి, తాపమున దప్పి నాఁకటఁ దప్తుఁ డగుచు
దుస్సహాక్లేశమున మహాతురత యొదవ, నొరలుచును దేహ మొకభంగి నుత్క్రమించు.

ఉ. వేదన మీఱ నిత్తనువు వీడ్కొని జీవుఁడు తీవ్రశోషణా
పాదకయాతనావపురుపస్థితుఁ డై యమదూతపాశదం
డాదులపీడ నుగ్రపథయానము నంతకదర్శనాదినా
నాదురవస్థలం బొగిలి నారకబాధలఁ బొందు మీఁదటన్. 112

సీ. మొఱలు పెట్టఁగ ఱంపములఁ ద్రెంపఁ బడువారు, పుటపాకములకాఁకఁ బొక్కువారు
వెడఁదగొడ్డండ్లఁ బచ్చడిసేయఁబడువారు, పుడమిఁ బాఁతిన నుక్కిపోవువారు
కొర్ల వ్రేసిన గుచ్చుకొని వ్రేలఁబడువారు, నుప్పురొంపులఁ గ్రుక్క నఱియువారు
క్వథితతైలములఁ బక్వము సేయఁబడువారు, దెంచనంబుల వ్రేయఁ ద్రెళ్లువారు
గీ. పులులఁ బత్తులు భక్షింపఁ బొరలువారు, గలిగి శతధాసహస్రధాకారభిదలఁ
గలుగ దెన్నిక నిరయప్రకారములకు, దుఃఖ మేకైకమును గడు దుస్సహంబు. 113

క. నిరయానుభవముపిదపం, బరిశిష్టం బైనపూర్వపాపఫలంబుల్
బొరయుటకుఁ గూలఁ గ్రమ్మఱ, నరపశుమృగఖగనగాదినానాయోనిన్. 114
తే. వినుము దుఃఖంబు నిరయసంస్థునకె కాదు, శతమఖస్థానమునయందుఁ బతనభీతి
నున్నదినములు నిర్వృతి నొందలేక, కూలుఁ బుణ్యంబుతుదిఁ జాల కుతిలపడుచు. 115

క. నరలక్ గర్భము జన్మము, మరణము నిరయమును మఱియు మఱియు నయి నిరం
తరసంసృతిచక్రంబున, దొరలి నరుం డొందు సర్వతోదుఃఖములన్. 116
తే. సుతకళత్త్రాదిసకలవస్తువులు నగల, బ్రుంగువడనిసుఖంబు చేయంగఁ జాల
వేల నిన్నియు? సంసారి కెద్ది యిష్ట, మదియపో దుఃఖతరుబీజ మనఘచరిత! 117
క. బ్రదికెడునంతకుఁ బురుషుఁడు, ప్రిదులక నిలు వెల్లవగలఁ బెనగొనియుండన్
గుదురుకొని దూదిమాఁగుడు, బొదివినకార్పాసబీజమునకుం బ్రతి యై. 118

సీ. ప్రకృతినై కాకృతిపరిణామదేహంబు, తన్నుఁ గా మూఢుండు దలఁచుఁ గానఁ
దమపభోగ్యము లైనధనగృహాదులయందుఁ, దనకు భోగ్యము లనుతలఁపు పుట్టి
భోగ్యత్వబుద్ధిచే భోగింపఁ గామించు, భోగవిఘ్నములపైఁ బొడము గినుపు
భోగంబు చవిచోఁకఁ బొడము లోభము లోభ, మున నొం డెఱుంగమి మోహ మొదవు
గీ. భోగలోభగర్వముల మదం బుదయించు, భోగసిద్ధికొఱకుఁ బోక పెనఁగఁ
గలుగు మత్సరంబు గాన దేహాత్మాది, జనిత మీదురంతసంసరణము. 119

ఉ. పుట్టుగుచెట్లకు న్మొలవఁ బోసినవిత్తులు శాంతిముస్తకుల్
ముట్టియతోడిజీవములు మోహపుటిర్లకునుం గుహూనిశల్

కట్టనియిం డ్లఘుంబులనఁ గట్టడి యాసలసంప్రసూతికిన్
గుట్టులతోఁడిగర్భిణులు కోరిక లెవ్వరి నోంపకుండు నే? 120

ఉ. లజ్జనుఁ బాపు శీలముఁ గులంబు వడి న్విడిపించు సూనృతం
బుజ్జనసేయుఁ జేయ మొగమోటమిఁ దూలుచుఁ బాతకంబులన్
మజ్జన మార్చు నార్చు నభిమానము గోఁతల కియ్యకొల్పు నీ
ముజ్జగ మైనఁ ద్రిప్పుఁ దుది ముట్టదు దా ధనకాంక్ష యేరికిన్. 121

చ. అడుగనియండజాదులకు నాఁకలి దీరకయున్నె? దీనుఁ డై
యడిగెడుచోట నెంతఘనుఁ డైనను హీనుఁడె కాఁడె? హీనుఁ డై
యడిగెడునాఁడు తృప్తిపరుఁ డౌనె? యతృప్తుఁడు సౌఖ్య మొందు నే!
యడుగుట యెన్నిజన్మముల కాఱడి నెవ్వగ వో తలంపఁగన్. 122

శా. పాత్రాపాత్రవివేకరిక్తులు శుభప్రారంభముక్తు ల్పరీ
పోత్రీప్రాయులు తత్త్వసాధనకథాబోధానపాయుల్ శ్రవో
నేత్రఘ్రాణకజిహ్వకాపరమనోనిత్యానుకూలు ల్సదా
మాత్రద్వారసుఖాతిలోలు రహహా! మోక్షం బపేక్షింతురే?. 123

క. మలమూత్రరక్తపిత్తా, దులు వేర్వే రైన రోసి దుర్మదుఁ డిహిహీ!
మలమూత్రరక్తపిత్తా, దులప్రోవగు దేహ మింపుతోఁ గామించున్. 124

శా. చన్ను ల్కాఁక పసిండికుండ లఁట వక్షశ్చర్మదుర్మాంసముల్
కన్ను ల్క్రొవ్విరిదమ్మిఱేకు లఁట వెల్లద్దూషికాగోళముల్
వెన్ను ల్సోగయనంటియాకు లఁట సంపీతాస్థిపుంజంబు లీ
యన్నుల్సౌఖ్యము గాఁ దలంచుజను లాహా! యెంత మూఢాత్ములో ! 125

క. అందాఁక గురువు దైవము, నందాఁక న తగవు ధర్మ మంతస్స్పృహం
బందాఁక నెల్లగుణములు, నెందాకం గినుపు వొడమ దెట్టినరునకున్. 126

ఆ. కినుపు దొఱఁగలేనిమనుజుండు సత్కర్మ, మాచరించు టెల్ల ననఘచరిత!
యింట నున్నపిల్లి నెడలింపకుండియు, యనుఁగుఁజిలుకఁ బెనుచునట్లు కాదె? 127

ఉ. ఏకడఁ జొచ్చునో సుకృత? మెచ్చటడాఁగునొ తృప్తి? యెప్పుడో
పోకడ శాంతి? కెం దణఁగిపోవునొ సౌఖ్యము? మాన మేమి యౌ
నో? కృప యెట్లు మాయమగునో? యశ మేగహనంబు దూఱునో?
లోకమునం దెఱుంగ మొకలోభ మెదిర్చినమాత్రఁ జిత్ర మై. 128

చ. ఇడుమను ధర్మశాస్త్రకథ లిన్నియుఁ మిథ్యలు కూటిమాత్రమున్
గుడుచుట దుర్వ్యయంబు కొడుకుం బగవాఁ డడుగంగఁ జూచు నేఁ



గడపటఁ బ్రాణ మన్న సుఖగౌరవ మన్నను దైవ మన్న నే
ద్గడయు ధనంబ తత్త్వ మనఁగా విను మర్మము పొమ్ము లోభికిన్. 129

తే. చంద్రసూర్యాగ్నిరుచులచే సడలిపోని, యట్టిమోహాంపుటిర్లచే నంధు లగుచు
సౌఖ్యమార్గంబు గావక సకలజనులుఁ, గూలుదురు మాతృగర్భాంధకూపశతుల. 130

క. మును గలిగియు రూపఱినం, గనియును విషయముల మఱియుఁ గాంక్షించు నిహా!
యనుభవముమీఁద నెఱుఁగని, మనుజాధము మోహ మొయలమాటల విడు నే? 131

తే. మరలకుండుట యెఱిఁగియు మఱువలేరు, విడక పోరామి యెఱిఁగియు విడువలేరు
కానిపని యౌట యెఱిఁగియు మానఁ జాల, రద్భుతము గాదె మోహాంధు లైననరులు?

ఉ. మేరువుఁ బూరిగాఁ దలఁచు మి న్నఱచేతన మూయఁ బైకొనున్
నీరధిఁ బుక్కిలింతు నను నిర్జరనాథుఁడ నేన పొమ్మనున్
ధారుణి పెల్లగింతు ననుఁ దా నొకమానవకీట మైన నె
వ్వారలు మాన్ప లే రిది ధ్రువంబు మదం బనుసన్నిపాతమున్. 133

చ. గురువులకంటెఁ జుల్కనయుఁ గూరిరతకంటె హితంబు దుర్జనో
త్కరములకంటెఁ జుట్టలు వృథాకలహంబులకంటెఁ గృత్యముల్
దురితముకంటె మేలు పరదూషణవృత్తముకంటె వేడ్కయున్
ధరఁ దమకంబుకంటె మఱి ధన్యత గల్గదు మర్త్యకోటికిన్. 134

క. ఇచ్చెద నను సర్వస్వముఁ, జొచ్చెద నను మర్త్యుఁ డెదిరి సొద యైనఁ దుదిన్
జచ్చెద నను వెడపనికై, మచ్చరమునకంటెఁ గీడు మఱియుం గలదే?. 135

క. అనుభోక్త ద న్నెఱుంగం, డనుభవకారయితె వార్త యైనను నెఱుఁగం
డనుభావ్యతత్త్వ మెఱుఁగం, డనుభవమే కాని బద్ధుఁ డంధుఁడ కాఁడే?. 136

చ. విడువఁడు సౌఖ్యము న్మఱచి వేమఱు నంకుశబాధ నెమ్మిఁ గో
రెడు నగపడ్డ సింధురమురీతి ఫలోత్కటబంధనంబు మా
నెడుదెఱ వేర్పరించుకొన నేరక యింద్రియపంచకంబుచే
నుడుగనికోర్కిఁ దీర్చుకొను చుండుట మేలుగఁ జూచు జీవుఁడున్. 137

మ. ప్రతిదేహప్రళయంబు నందనతనూబంధానుసంబంధుఁ డై
ప్రతినైమిత్తికమున్ జతుర్ముఖశరీరస్తబ్ధుఁ డై ప్రాకృత
ప్రతికల్పాంతమునం బరాత్మతను నిర్మగ్నాత్ముఁ డై యాలయ
త్రితయంబందు నరుండు వీడఁ డచిదాప్తిం గ్రమ్మఱం బుట్టుచున్. 138

తే. ఇట్టిసంసారబంధంబు హేయ మగుటఁ, గనియు వినియు విరక్తుండు గాక మఱియుఁ
గోరి పొందు నరుండు తత్కారణం బ, నాదికర్మప్రవాహంబు మేదినీశ ! 139

చ. ఫలరసవాసనాప్రదవిభాగవశంబునఁ గర్మశక్తికిన్
గల చిరుభంగి యందుఁ బ్రతికర్మవిధానఫలానుభూతులన్
బొలియఁ బురోంశ మున్నపెరప్రోవు ఘటించుదురంతవాసనా
బలమున నుత్తరోత్తర మపారనిరంతరకర్మబంధమున్. 140

## మోక్షావతరణము.

వ. అట్లగుట సంసారచక్రంబు కర్మమూలం బగుటయుఁ దత్కర్మంబు దురంతం బగుటయుఁ దప్పదు. ఐనను సుకృతదుష్కృతరూపం బైనయాకర్మంబు భగవదానుకూల్యప్రవృత్తిప్రాతికూల్యప్రవృత్తిరూపం బగుట ననుగ్రహనిగ్రహంబులచే సుఖదుఃఖప్రదుం డయినయీశ్వరునకుం బ్రాధాన్యం బంగీకరింపలే కుండుటయు కాదు, తానునుం దత్సంకల్పాయత్తసత్తాప్రవృత్తికంబు. ఈయర్థంబు సృజ్యసంహార్యకర్మనిరపేక్షుయుగవత్సృష్టిసంహారాదులయందుఁ బ్రసిద్ధంబు. అట్లు గావున నిరంకుశస్వతంత్రుండయినయీశ్వరుండు వైషమ్యనైర్ఘృణ్యంబులకు లోనుగాక తత్తత్కర్మానుగుణంబుగా స్వర్గనిరయంబు లొసంగునట్ల యచ్యుతస్వానుకూలప్రవృత్తిరూపం బైనయనాదిమోక్షబీజంబు గలచేతనునకు మోక్షం బొసంగు. తత్క్రమంబు సావధానుండ వై వినుము. విశేషంబుల నెల్లజీవులం దత్తత్కర్మానుగుణంబుగా సంసరింపంజేయుచు లీలాప్రవృత్తుం డయ్యునీశ్వరుండు సమయప్రతిపక్షువీక్షాపరుం డై యొక్కకాలంబున నొక్కచో నొక్కరునకు ఘుణాక్షరన్యాయంబున నొక్కయాదృచ్ఛికస్వసేవాచరణంబు గలుగం గటాక్షించి యందుం దచ్చేతనాభిప్రాయంబు లేకుండిన స్వాభిప్రాయంబునన యది నెపంబుగా నతని నుద్ధరింప సన్నద్ధుం డయి విశేషప్రయత్నంబునకుం జొచ్చు నట్లగుటం జేసి. 141

క. తాదృగ్విధోక్తలఘుతర, యాదృచ్ఛికసుకృతికుం డనంతరదేహ
ప్రాదుర్భవంబునప్పుడ, శ్రీదయితేక్షణసుధాభిషేకముఁ గాంచున్. 142

తే. ఎల్లపురుషుండు తనజనియించునపుడ, యజకటాక్షితుఁ డై రాజసాత్మకుండు
హరకటాక్షితుఁ డై తామసాత్మకుండు, హరికటాక్షితుఁ డై సత్త్వపరుఁడు నగును.

వ. ప్రత్యుపకారాదిహేతునిరపేక్షంబుగాఁ గేవలకృపైకమూలం బగుట నదియ భగవంతునకు నిర్హేతుకకృపాకటాక్షంబు. 144

ఆ. కాన నిట్టిజాయమానకటాక్షంబు, గలుగఁ గలుగు సత్త్వగౌరవంబు
సత్త్వగుణమువలన సదసద్వివేకి యై, హితపదంబు దనకు నెఱుఁగ నేర్చు. 145

క. సదసద్వివేక మొదవిన, మదముక్తసదృష్టిబాహ్యమత మగుచుఁ ద్రయీ
పదసేవితాభిముఖ మై, వదలదు సత్సంగమంబు వసుధాధీశా! 146



క. సాత్త్వికశాస్త్రప్రవణుఁడు, సాత్త్వికసత్సంగమంబు సడలక భగవ
త్తత్త్వకథాశ్రవణంబున, సత్వరతవిముక్తి నొందు సంసారమునన్. 147

తే. భ్రాంతి వాసిన మున్న తద్భ్రాంతికతన, తనయొనర్చినవిక్రియల్ దలఁచి పోలె
దేహ మాత్మనువిభ్రాంతి దెలిసి నరుఁడు, ప్రాగహంకృతి కాత్మలోఁ బరితపించు.

ఆ. తనువుఁ దన్న గాఁగఁ దలఁచుట తనుభోగ్య, విషయ మాత్మభోగ్యవిషయ మనుట
యిరుదెఱంగుభ్రాంతి యిదియ కదా! యవి, ద్యామహీజబీజ మనఘచరిత! 149

క. తనుఁ దనువు గామి యెఱిఁగినఁ, దనుభోగ్యములందు భోగ్యతామోహంబున్
దినదినమున సడలి క్రమం, బున విషయవిరక్తిఁ గాంచుఁ బురుషుం డనఘా! 150

క. కూరిమి విఱిగినసతిపై, నేరమి దోఁచుగతి విషయనిస్పృహమతి యై
కోరిక లుడిగినవానికి, నూరక విశ్వంబుమీఁద నొల్లమి పుట్టున్. 151

క. ప్రవితతవైరాగ్యమహా, దవదహనశిఖాముఖాతితప్తుఁడు తనకున్
భవసింధుతరణమునకున్, బ్లవము సదాచార్యవర్యపద మని చేరున్. 152

వ. చేరి గురుని దర్శించి పూర్వోక్తసదుపాయస్వీకరణంబున భగవద్భక్తుం డై తదనుగ్రహాతిరేకంబున ముక్తుం డగు నట్లు గావున నీశ్వరునకు వైషమ్యాదిపరిహారార్థంబుగా నింతయుం బ్రపంచింపంబడియె నింతియ కాని సర్వసారం బైనరహస్యం బొక్కటి యాకర్ణింపుము. 153

తే. గణనచో ధనికునిచేతఁ గనకకోటి, నొండెఁ గాకణికాకోటి నొండెఁ జెందు
గవ్వయునుబోలె మోక్షకక్ష్యమున నొండె, బంధమున నొండెఁ బడుఁ బ్రాణి భగవదిచ్ఛ.

వ. ఈయర్థంబు 'నినిషాదోనినిష్ఠా' శ్రుతిసిద్ధం బని చెప్పి విరమించిన సర్వసందేహనివృత్తం బైనచిత్తంబు పరమనిశ్చయానందమగ్నం బై నృపకులతిలకుండు కులగురునకు సాష్టాంగం బెరఁగి లేచి కృతాంజలి యై. 155

తే. ఉక్తసాధనమున మోక్ష మొదవునంత, కోర్వ వాత్సల్యనిధి పురుషోత్తముండు
నయనగోచర మగుసాధనంబు నాకు, నర్థి నానతి యిచ్చి కృతార్థుఁ జేయు. 156

## వసిష్ఠుండు మాంధాంత కష్టాక్షరీమంత్రరత్నము నుపదేశించుట.

వ. అనిన నతనిభగవత్ప్రావణ్యంబునకుం దనయుపదేశసాఫల్యంబునకు నలరి యట్లేని తపంబునం గాని శీఘ్రంబున నిట్టికోర్కి సిద్ధింప దగుటం దపంబు సేయు మని వ్యక్తలక్షణంబున నతని భగవత్ప్రపన్నునిం గావించి జప్యం బైనమంత్రంబునుం దదర్థరహస్యంబునుం దదనుష్ఠానప్రకారంబును దదుచితనియమంబులు నుపదేశించి దీవించి ఋషులుం దానును బూజితుం డై వీడ్కొని చనినయనంతరంబ రాజర్షివరుండును తమసాసరయూమధ్యంబునం గృతతపోధనుం డై యుక్తనిష్ఠం దపం బొనరింపం దొణంగె. 157

## ఆశ్వాసాంతము.

ఉ. తార్కికవామనోన్నతలతామధుశోశ నిరీశసాంఖ్యయో
గార్కయపూర్వనిర్వహితృహంసఘనాఘన నిర్గుణోక్తిమ
న్మర్కటనారికేళఫల మామకసాత్యవతేయ వాఙ్మయో
దర్కసుధార్ణవోదయవిధాయకపార్వణశర్వరీవరా. 158

క. ప్రచ్ఛన్నబౌద్ధదుస్సహ, హృచ్ఛర లక్ష్మణమునీంద్రహృదయాదర్శ
స్వచ్ఛతరప్రతిఫలిత, స్వచ్ఛరణస్వస్వరూపసహజాకృతికా. 159

స్రగ్విణి. నిత్యధర్మాత్మకా నిత్యధర్మాస్పదా, నిత్యచిద్రూపకా నిత్యరూపోజ్జ్వలా
నిత్యబోధాశ్రయా నిత్యచిన్మాత్రకా, నిత్యనిర్వేదకా నిత్యభేదాంచితా. 160

గద్య. ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహసేవకోపసేవక నరసింహనామధేయ ప్రణీతం బైనకవికర్ణరసాయనం బనుకావ్యంబున వసిష్ఠాగమనంబును, రాజప్రశ్న ప్రతివచనంబులును, అందుఁ గర్మస్వరూపబ్రహ్మస్వరూపంబులును, వేదవేదాంత పురాణస్వరూపనిరూపణంబును, భక్తిప్రపత్తిరూపసాధననిరూపణంబును, సంసార నిరూపణంబును, మోక్షావతరణంబును నన్నది పంచమాశ్వాసము.

---



# షష్ఠాశ్వాసము.




రంగధరాధిప శృం
గారరసాధీశభావ గరుడగమన సం
స్మేరముఖాంబుజమధురా
కారాలంకృత నమజ్జగజ్జనహృదయా. 1

### మాంధాత తపంబు సేయుట

వ. ఇట్లమ్మహీవరశ్రేష్ఠుండు నిష్ఠురతపోనిష్ఠుం డై. 2

చ. పరువడిఁ గందమూలఫలపర్ణజలంబులఁ గొన్నికొన్ని వ
త్సరములు వోవఁ గాఁ బిదప సర్వము మాని నిజాంతరంబునన్
హరి భజియించి శేషపవనాశనభర్తయుఁబోలె నాతఁడున్
గరువలిఁ గ్రోలఁ జొచ్చెఁ ద్రిజగంబులు విస్మయ మొంద నయ్యెడన్. 3

### గ్రీష్మర్తువర్ణనము.

క. అతనిసమగ్రం బగుతీ, వ్రతపోగ్ని జగంబు నిండ వడిఁ బర్విసనం
గతి దుస్సహోష్ణసంప, ద్వితతం బై యంతలోన వేసవి వచ్చెన్. 4

ఆ. శాశ్వతప్రజంతుతతుల విశ్వంభర, గర్భమున భరింపఁ గరుణఁ దలఁచి
తెలిపి యిచ్చె ననఁగఁ దీవ్రాతపాహతి, నేల నెల్ల గాఁడి నెఱియ లొదవె. 5

సీ. ఏకార్ణవంబులో నిర వైనవటపత్ర, శయనంబు మదిఁ గోరె శార్ఙ్గపాణి
యష్టమూర్తులలోన నంబురూపము నాత్మఁ, గాంక్షించె హరిణాంకఖండమౌళి
ప్రథమాంబుజఘూర్ణిభావస్థితియ వేఁడి, యభిలషించెఁ బయోరుహాసనుండు
వేడ్క గా కుండియు విలయోదకోదర, స్థితి యపేక్షించె ధాత్రీవధూటి
గీ. హేమరజతాచలాదిమహీధరములు, హిమగిరిత్వంబు మఱుఁ నూహించుకొనియె
సకలలోకానివార్యదుస్సహమహోష్ణ, భీష్మగతి యైనయమ్మహాగ్రీష్మవేళ. 6

క. ఆమనిరాజ్యం బెడలుట, గాముఁడు నెల వేది యున్నఁ గ్రమ్మఱ గ్రీష్మం
బామ క్షతహరతోరణ, భామాసుచమండలముఁ బట్టము గట్టెన్. 7

సీ. సరసీపునఃపునస్సలిలఖేలనముల, సరసగైరికపటాచ్ఛాదనముల
సహిమాంబుఘనసారచందనచర్చలఁ, దారహారావళీధారణముల
యంత్రధారాగృహాభ్యంతరక్రీడల, శశికాంతశయ్యాంతసంవసతుల
సంతతకరతాళవృంతవీజనముల, చిరసాంద్రచంద్రికాసేవనముల
గీ. స్వాదుఖర్జూరనారికేళాదివివిధ, సారపానకరససుధాస్వాదనముల
హితసమీహితగతులఁ జయించి రపుడు, దంపతు లమోఘనైదాఘతాపభరము. ౮

ఉ. అట్టినిదాఘవేళ నిబిడాగ్నులు నల్గడలందుఁ బర్వఁగాఁ
గట్టిగ నేల యంగుళ మొకండ ఘటించి ఖరాంశుమూర్తిపైఁ
బెట్టినమాడ్కి-తో హ్రద మపీఠికయాం దమృతాబ్ధిమందిరుణ్
బట్టము గట్టి దుస్సహతపం బొనరించె జగంబు బెగ్గిలన్. 9

## వర్షర్తువర్ణనము.

ఉ. దీపిత మయ్యె నంతట నదీనవయౌవన మంబుజాననా
కోపకవాటనిర్ఘటనకుంచిక చాతకనిర్గలవ్రతో
ద్యాపన మబ్జినీవికసనాస్తమయంబు మయూరనర్తనా
టోపవిధోపదేశకనటుండు పయోదసమాగమం బిలన్. 10

ఉ. చాతకభాగ్యరేఖ జలజాతపరిచ్యుతి పక్వకందళీ
సూతిచికిత్సకాంగన ప్రసూనశరాసనరాజ్యలక్ష్మి ప్ర
ద్యోతనచంద్రమఃపటువిధుంతుదభీషక సర్వజీవజీ
వాతువు గాన నయ్యె నవవారిధరోదయవేళ యంతటన్. 11

మ. విరహిస్వాంతమనోజపావకశిఖావిర్భూతధూమంబులం
బరకాసారగతాసితోత్పలకలాపంబుల్ జగన్మండపో
పరినీలాచ్ఛవితానచేలములు దృష్యద్గ్రీష్మనిర్వాపణో
ద్ధురవర్షాగమరాజభద్రకరు లుద్ఘోషించె నూత్నాభ్రముల్. 12

ఉ. వచ్చె ఘనాఘనంబు లివె వల్లభు లేలొకొ రా రటంచు వి
ద్యుచ్చలనోద్యతద్యుతుల కుల్కుచుఁ ద్రోవలు నిక్కి చూచి వా
పుచ్చక నెవ్వగ న్వగపు పుట్టఁగఁ బాంధసతు ల్మిగుడ్చుచే
న్వెచ్చనియూర్పుల న్విరిసె విన్నపయిం బ్రథమాంబువాహముల్. 13

క. నీరం బప్పుడు నూతులఁ, బూరించె నటంచు నేల పొగడఁగఁ? నాక్రో
శ్కారుతతి బాష్పవర్షము, పూరించెం బాంథకర్ణపుటకూపములన్. 14

సీ. కేళీనటద్గేహకేకికేకారవో, న్మేషంబు చెవులఁ దేనియలు చిలుక
నభినవార్జితగర్జితారవోల్లసనంబు, లితియుఁగౌఁగిటిబిగి నినుమడింప



ధారాళనవనవోద్దామసౌదామని, ప్రభవించుటలుకలఁ బాయఁ ద్రోవ
మణిగవాక్షనిరీక్ష్యమాణవాసనధను, ర్విభవముల్ చూడ్కులవిం దొనర్పఁ
గీ. జంద్రకాంతావళీకనిష్యందమాన, నీరధారాపరంపరానిష్ప్రియత్న
యవనికారమ్యకనకహర్మ్యములయందుఁ, జెందు దంపతిసులము వార్షికసుఖంబు. 15

మ. శ్లథవేణీభర మై మహోష్ణబహునిశ్వాసానిలంబు ల్వియ
త్పథముం గ్రాఁపఁగ మోము లెత్తి తము నుద్యద్దైన్యలై చూడఁగాఁ
బథికస్త్రీనయనాబ్జకోణవిగళద్బాష్పాంబుబిందుచ్ఛటల్
పృథమాంభగకణికాసిపాతము లగుం బ్రావృట్పయోదాళికిన్. 16

తే. ఒదరి విరహుల నలికింప నోపెఁ గాని, యిరులకలిమి బయల్లంద యేగడునభి
సారికలశంక గొలుపంగఁ జాల వయ్యె, నూర్జితము లైనఘనకాలగర్జితములు. 17

చ. చలిఁ బడి యున్న పేరలుక శయ్యపయిన్ మొగ మీనికాంత లా
తోలుకరివేళకామజయదుందుభిఘోషమువోనిగర్జకుం
గళవళ మంది బిట్టు తముఁ గౌఁగిటఁ జేర్పఁగఁ బ్రాణవల్లభుల్
దెలియఁగ నేర రాత్మలఁ బదీయవిశుద్ధవిదగ్ధభావముల్. 18

క. ఇక్కువ చేయుంబగలును, నొక్కటిగ మొయిళ్లు పర్వి యుండినయపు డా
క్రోక్కారుకలిమి యే మన, నిక్కన నందుకొనవచ్చు నింగిఁ దలంపన్. 19

ఉ. క్రూరతటిత్కృపాణవతి రూఢబలాకకపాలమాలికా
హారిణి నిర్నివారణవిహారిణి కాళిక కాళికాగతిన్
దారుణలీలమై భువనదాహకుఁ డైననిదాఘదైత్యు నం
భోరుహమిత్రు పేరితలఁబుచ్చుక మ్రింగె విచిత్రవైఖరిన్. 20

క. పిరిగొనుతోలుకరి మొగుళుల, భరితాంధంకరణమునకు బాసట యయ్యెన్
బురివిచ్చి యాడు నెమళుల, నిరస్తతాపింఛపింఛనిర్భరదీప్తుల్. 21

క. నిర్భరగతిఁ గరకాసం, దర్భంబులు రాలె నంత ధరపై జలదా
విర్భావమగ్నహంసీ, గర్భప్రవదండపిండఖండము లనఁగన్. 22

క. కుంభీనసములు ద్రేలిన, గుంభనమునఁ గుంభిహస్తగురుతరధారా
రంభమున రేయుఁబగలున్, గుంభద్రోణములు వట్టి కురిసె న్వానల్. 23

వ. ఇట్టివర్షాగమంబున. 24

తే. జలధరంబులు గుదిసె నాసారవృష్టి, బయటఁ బద్మాసనస్థుఁ డై పల్లటిలని
యత్తపోధనవర్యుపై నతని కనియ, చిరతపోరాజ్యపట్టాభిషేక మయ్యె. 25

## హేమంతర్తువర్ణనము.

ఉ. అంతఁ గ్రమంబుతోడ శరదంతమునం బరిముక్తమై జలం
బంతయుఁ జెల్లుటం జలుక నై తెలు పైనమొయిళ్లు గాడ్పుచే

నెంతయు ధూళి యై విరిసి యీగతిఁ దూలె నొకో యనంగ హే
మంతమహోదయంబున హిమంబు తమంబుగ ముంచె లోకమున్. 26

క. కలయ జగ మెల్ల ముంచిన, బలు పొగనమ్మంచులోన భావింపఁబడున్
వెలుగుల ఱేఁ డొకవేళ, న్వలిపపుఁదెరలోనిదర్పణంబును బోలెన్. 27

క. దీపితముక్తాహారముఁ, బాఁపినదోషంబు తలఁపువాఁడినఁ బశ్చా
త్తాపమున నొక్కొ సతులకుఁ, బాపటముత్తియము లయ్యెఁ బ్రాలేయంబుల్. 28

క. వలువ దొలంగుట కులుకు చుఁ, బులకలు పుంఖానుపుంఖముగ భీతి మదిం
దలకొనఁ ద్రిలోకి వడవడఁ, జలియించెన్ శిశిరనూత్నసంగమవేళన్. 29

క. చెప్ప నశక్యం బగుచలి, యుప్పతిలం బాలవృద్ధయువజనములకుం
దప్పక శరణము లయ్యెం, గుప్పసములు ముర్మురములు గుచకుంభములున్. 30

ఆ. అట్టిశీతవేళయందుఁ గుత్తుకబంటి, నీటఁ దపము చేసె నిష్ఠ నతఁడు
నిజతపోగ్నివలన నిఖిలలోకము శీత, భావ మెఱుఁగ కాత్మఁ బరితపింప. 31

## నారదుఁడు మాంధాతృతపశ్చరణము నింద్రుని కెఱిఁగించుట.

తే. ఇట్లు దప మాచరింప మహేంద్రుఁ డున్న
కొలువునకు నేగి కశ్యపుఁ గూటితపసి
యతఁడు గావించుపూజన మంది కలదు
చింతనం బొండు వలయు నేకాంత మనిన. 32

క. ఏకత మని వినిపింపఁగ, నేకతమో? యనుచు సంశయించుచు వేవే
పాకారికొలువు వీడ్కొని, యేకాంతమునందు నతని నే? మని యడుగన్. 33

క. ఓయమరేశ్వర! యిట ము, న్నేయుగములఁ గనియు వినియు నెఱుఁగము వినుమో
హో! యిదె మాంధాతృమహీ, నాయకుఁ డుగ్రముగఁ దప మొనర్పఁగఁ గంటిన్.

తే. అతులయోగసమాధిచే న త్తపస్వి, నిశ్చలుం డని వేఱ వర్ణింప నేల
యతనిఁ గనుఁగొన్నయంత నత్యద్భుతముగ, నిశ్చలుం డెంతవాఁ డైన నిర్జరేంద్ర! 35

తే. తలఁపులోపలికోర్కి తీవలు ఫలింప, మొదలఁ దగఁ బల్లవించినమురువుచూపు
సంతతస్నాననియమైకశాలి యతని, పాటలాంశుజటాచ్ఛటాప్రాంచలములు. 36

ఉ. హెచ్చుతపోగ్ని యప్పు డపు డీనెడుపిల్లలువోలె నల్గడం
జిచ్చు లెలర్ప నుంగుటముచేతన నిల్చి ఖరాంశుమూర్తిపై
వెచ్చనివేళఁ బ్రత్యహము విచ్చి తనర్చుట గాని మోడ్పమిన్
నిచ్చయ మమ్మహామహుని నేత్రము లబ్జము లౌట వాసవా!. 37

ఉ. కర్తవు గాన నిక్కముగఁ గన్నతెఱం గెఱిఁగింతు నీకు సా
ర్వర్తుకపుష్పసంపదల రంజిలుతద్వనవాటి నందన



స్ఫూర్తి వహించు నిట్లు బలసూదన తావకలక్ష్మి తత్తప
స్ఫూర్తికి మెచ్చి తాన చనఁ బూని పదం బిడి యున్నదో సుమీ!. 38

తే. అసమసింహాసనస్థుఁ డై యఖిలరాజ్య
వైభవంబులు గైకొంచు వఱలువాఁడు
నియతిమై గాలి గ్రోలెడు నేఁడు వహహ!
యధిప! యతఁడు మహాభోగియగుట నిజము. 39

ఆ. కోర్కి వ్రేఁకమునను గులశైలమునుఁ బోలె, నిశ్చలత నతండు నిలిచెఁ గాక
భృశతపంబునలనఁ గృశుఁ డతం డొకమంద, పవనుచేతఁ నెగసి పాఱఁ డెట్లు! 40

ఉ. శిష్టగున త్తపస్విజనశేఖరుఁ డుగ్రతపంబుచేఁ బద
భ్రష్టునిఁ జేయఁగాఁ దలఁచి బ్రహ్మహరాదులలోన నొక్కయు
త్కృష్టునిమీఁదఁ దాను జగతిం గలవైరము గొంట యెల్ల వి
స్పష్టము గాన లేదు మృగజాతివిరోధము తద్వనంబునన్. 41

క. ఏల పలుమాట? లనిమిష పాలక! యెల్లింట నేఁట ఫలియించుఁ దదు
త్తాలతపఃకల్పకమున, రాలెడువడపిందె నీదురాజ్యం బనఁగన్. 42

తే. ఖచరవర! చెప్పితిమి నీకుఁ గన్నతెఱఁగు, చిత్తగించి ప్రతిక్రియ సేయు మిపుడ
యనుచు వీడ్కొని నారదుం డరుగుటయును, డెందమునఁ జాలఁగలఁగి పురందరుండు.

## ఇంద్రుఁడు మాంధాతృతపంబుఁ జెరుప నచ్చరలం బంపుట.

క. మంత్రుల దిక్పాలుర నయ, తంత్రజ్ఞులఁ బిలిచి కూడి తానున్ వారున్
మంత్రపరు లై తదీయని, యంత్రంబునఁ బిలువఁ బనిచె నపు డచ్చరలన్. 44

సీ. విధివత్సమాపితవివిధయజ్ఞఫలంబు, లంకువ యైనయేణాంకముఖులు
పటుసంగరాంగణప్రాణదానంబులు, రోవెల యైనమెఱుంగుఁబోండ్లు
నిరుపమతమతపఃపరమపుణ్యంబులు, కట్టడ యైనశృంగారవతులు
కల్పోక్తతీవ్రనైకవ్రతాచరణముల్, మూల్యంబు లైనయంబుజవదనలు

గీ. పట్టుఁగొమ్మలు రమణీయభావములకు, జన్మభూములు తారుణ్యసంపదలకుఁ
బ్రాప్యదేశంబు లతులాభిరూప్యములకు, వచ్చి రచ్చర లనిమిషస్వామికడకు. 45

ఉ. పంకరుహాయతాక్షులు త్రపావినయంబుల నొప్పపాటునం
బొంకము చూపుచూపుగమిఁ బూజ యొనర్చుచు బాహుమూలదీ
ప్త్యంకురహేమనిష్కనిచయంబు లుపాయన మిచ్చి కంకణ
క్రేంకృతు లుల్లసిల్లఁగ మొగిడ్చిరి చేతులు దేవభర్తకున్. 46

ఆ. జంభరిపుకొలువు రంభాదిసతులచేతఁ, బంచసాయకసాయకప్రాయ మయ్యె
శార్ఙిఁ గనుఁగొన దిక్పాలవరులమనము, పంచసాయకసాయకప్రాయ మయ్యె. 47

క. ఉల్లము వే ఱైనవారు, ద్వల్లభుఁ గని రంభ యపుడు దప్పక రామా
పల్లవకరముఖవీణా, వేల్లితతానప్రతానవినిమయఘణితిన్. 48

ఉ. దేవ! సురాధినాథ! భవదీయమనోబ్జమునందు వింతగా
నీవిధిఁ జింతిలంగఁ గత మెయ్యది? నేఁడు తపోనిమిత్త మెం
దేవెడవార్తగల్గెనొ యథేనిఁ దపోధనశుద్ధచిత్తము
క్తావలి గ్రువ్వఁ గా గుణము లౌట యెఱుంగవె మత్కటాక్షముల్?. 49

సీ. పంచాగ్నిశిఖలచేఁ బరితపింపనివారి, విరహాగ్నిశిఖలచే వేఁచి విడుతు
వర్షాంబుధారలవడిఁ గలంగనివారి, మోహదృగ్ధారల ముంచి కలఁతు
మంచుచిల్కుటకు రోమాంచ మొందనివారి, ననువు పుట్టింతు లేనవ్వు చిలికి
సతతోపవాసులై చవులు డించినవారిఁ, దవులింతు నధరామృతంబుచవులఁ
గీ. గాదు లక్ష్యంబు నాకు లోకత్రయంబు, పలుక నేటికి బడుగుతాపసులకథలు?
నన్నుఁజూడక నాపేరు విన్నమాత్రఁ, బల్లవింపవె రాతిరూపంబులైన. 50

తే. కార్య మెఱిఁగినఁ దీర్చియ కాక నీదు, సన్నిధికి వత్తుమే మేము జంభమథన!
యింక నైనను బంపు మమ్మింతనుండి, మృగ్య మగుఁ గాని జగతి వైరాగ్యపదము. 51

చ. అన విని సంతసించి త్రిదశాగ్రణి లోనికలంకు దేఱి యా
నన మెగయించి మించి చిఱునవ్వు దొలంకెడుసాదరావలో
కనములఁ జూచుచుం బలికెఁ గామిను లిందఱు మీ రమోఘసా
ధనములు గల్గ నాకుఁ గలదా మదిలో నణువంత వంతయున్?. 52

క. పోలించి చూడ నఖిలో, త్తాలం బగునాకవాసదైవతలక్ష్మీ
లీలాసౌధము నిలిపిన, మూలస్తంభములు గారె? ముద్దియలారా! 53

తే. అద్రిపక్షాభిహతిమాత్ర కళని గాని, యహహా! ప్రతిపక్షపక్షాభిహతికి నెల్ల
సంతతము మాకు నమ్మినసాధనంబు, చలితభవదీయవీక్షణాంచలము గాదె?. 54

ఉ. ఆరసిచూడ వేదములయట్లు మనంబునఁ దోఁచి యున్నశృం
గారరసాధిదేవతలఁ గంజవిలోచనలార! మిమ్ముఁ బెం
పార సృజించెఁ గాక తనయంతన యేని గణింప నెట్టు లం
భోరుహసూతి మీభువనమోహనరూపవిలాససంపదల్?. 55

ఉ. గట్టిగ నెట్టిచోట ధృతికంకటముల్ విదళింప నేర్చు మీ
యట్టియమోఘసాధనములందుటఁ గాక జగత్త్రయీజయం
బెట్టు ఘటించు మన్మథుని? కింతయు నిక్కువ మిట్లు గానిచోఁ
బట్టినఁ గందుపువ్వు లొకబాణములే యలశంబరారికిన్. 56



ఆ. ఇట్టిమిముఁగుఱించి హీనకార్యం బైన, మాకుఁ బ్రళయు మనుచు మగువలార!
భయ మొనర్చెఁ గానఁ బనిచెద నొక్కకా, ర్యమున కరుగవలయు నదియు వినుఁడు.

వ. మహీమండలంబున నయోధ్యాప్రాంతంబునం దమసాసరయూమధ్యంబున మాంధాతృమహీవరాగ్రణి యుగ్రతపం బొనరించుచు నున్నవాఁడు. అతనినిష్ఠకు నంతరాయంబు ఘటియించి రండు పొం డని సంభావించి గంధర్వులం గాపుగాఁ జన నియమించి వీడ్కొలిపిన. 58

తే. ప్రమదమునఁ బొంగి పాణిపద్మములు మొగిచి, యేగుదెంచుసుపర్వపర్వేందుముఖుల
విభునికంటె నపూర్వభూవిహరణేచ్ఛ, లపుడు పురికొల్పె విజయప్రయాణమునకు. 59

క. సురరమణీజనవిద్యు, త్స్ఫురణావిర్భావమునకు సూచక మగుచున్
మొరసెం దత్ప్రస్థానిక, మురజధ్వనిగర్జ లఖిలమోహనభంగిన్. 60

తే. స్తనితగతశంఖమర్దళధ్వానమునకు, నుబ్బి పురివిచ్చి యాడుమయూరశిశువు
కడప దిగకుండి యానవిఘ్నము ఘటించెఁ, బయనమై వచ్చునొకమరుత్పద్మముఖికి. 61

ఉ. వల్లభుహస్త మూఁది సురవారవిలాసిని యొార్తు వచ్చి శో
భిల్లువిమాన మెక్కి మణిభిత్తిపయిం దననీడ దోఁచుటం
బల్లవధూర్త మున్నుగ సపత్ని నయించితె యంచుఁ గిన్పవం
బల్లవితాక్షియై దిగియె భావమునం బరితాప మెక్కఁగన్. 62

క. కొలికిఁ దగుల్పమి నొక్కతె, మొలనూలు పదాబ్జములకు మొరయుచు జాఱన్
ఫలియింపదు పయనం బిది, వల దనుచుం గాళ్లఁ బెనఁగువైఖరి దోఁపన్. 63

క. ఉర్వీస్థలిపై వేడ్క న, పూర్వవిహారములు సలుపఁ బోయెడుతమి లోఁ
బర్వఁగ శకునము దలఁపక, గర్వంబున వెడలి రమరకాంతాజనముల్. 64

తే. అబ్జభవుపట్టి కంతరాయంబు గొలుప, వెడలి రచ్చర లవ్వేళ వేల్పుఁబ్రోలు
ఘనతదీయతపస్సమాకర్షణమున, నైంద్రవిభవాధిదేవత లరుగుమాడ్కి. 65

తే. వాసవునివీటివారవిలాసవతులు, తీవ్రభానునిఁ గదియ నేతెంచి రంత
నతనిఁ జొరఁగోరి యమవసయందుదాఁకఁ, గ్రమ్మి చనుదెంచుబహుచంద్రకళలుపోలె.

క. సరికడచి వచ్చునపు డ, చ్చరపిండు వెలింగె మున్ను సంపూర్ణసుధా
కరమండలమును బోలెన్, ఖరకరబింబమున నేఁడు గలిగెద రనఁగన్. 67

తే. పాసి చనుటకు నోర్వ కచ్చరలు నిలుప, వేఁడి పట్టంగ నిగిడించువిధము దోఁప
భానుకరసంచయము తద్విమానరత్న, కాంతిసంయుక్తిదీర్ఘమై కాన నయ్యె. 68

సీ. బలిదాతృదానసంభవకీర్తిలేఖిక, మురదైత్యభిత్పదాంబుజమధూళి
విధికమండలుపయోనిధిసుధారసధార, జగదండఖండకచ్ఛత్రయష్టి
మదనభేదనశిరోమందారమాలిక, సగరసంజీవనౌషధివతల్లి
కనకాద్రిదండసంకలితకేతనశాటి, హరినభోంతరహారలతిక

గీ. జంభశాసనపురమణిసాలచక్ర, మండలీకృతనిజభోగకుండలీశ
ముచ్యమానవినూత్ననిర్మోకయష్టి, యచ్చరల కంతఁ జూపట్టె నభ్రగంగ. 69

చ. కనకమయాంబుజప్రసవగంధము లాఱియుఁ బిందుపంక్తిచే
ననయము దొప్పఁదోఁగియును నభ్రసరిత్ప్రవహంబు లప్సరాం
గనలముఖాబ్జసౌరభము ఘర్మజలంబులఁ గ్రోలెఁ గ్రొత్తలై
ఘనతరలాభముం గలుగఁ గైకొనరే ధర నెంతతృప్తులున్!. 70

తే. కూడి జలదేవతలు మమ్ముఁ గూడవచ్చి, రెంతచక్కనివా రంచు నెపుడు వెఱఁగు
దనుక మిన్నేటఁ దమనీడఁ దార చూచి, ముచ్చటలఁ బొంది రప్సరోముగ్ధ లపుడు.

చ. త్రిదశతరంగిణిం గడచి తీవ్రతమై దిగి వచ్చి దేవతా
సుదతులయూర్పుఁదావిచవిచోఁకున వెంటన వచ్చెఁ దేంట్లు త
ద్వదనసనాభివర్గము నవశ్యతఁ బంపఁగఁ బంపు పూని య
న్నదికమలాధిదేవతల నచ్చిన నెయ్యురు వచ్చిరో యనన్. 72

ఉ. వచ్చువిమానపంక్తులజవంబున జల్లున మున్ను ఫాయ గా
విచ్చినవారివాహములు వెండియు వెంటన రాఁ దొణంగె న
య్యచ్చరపిండుఁ జూచి తమ రప్పుడు వాయుట నాత్మకీయవి
ద్యుచ్ఛయశంకమై తగిలి తోడనె కుయ్యిడుమాడ్కి మ్రోయుచున్. 73

ఉ. మందసమీరణక్రియల మార్గపరిశ్రమశాంతిగాఁ బయో
బిందువిముక్తి నింపుమదిఁ బెంపుచు నీడలు సేయఁ దోయభృ
ద్బృందమునందు మెల్లనిగతిం జనఁగా నియమించి రప్డు సం
క్రందనవారకామినులు కామగమైనవిమానసంఘమున్. 74

చ. పొదిగొనుమాడ్కి ల న్మెఱచి పోనిమెఱుంగులు గా నిగుడ్చుచుం
జెవరనిభూషణప్రభల జిష్ణుధనుశ్శతకోటిఁ బన్నుచుం
ద్రిదశపురీవిలాసినులు దెల్లమిగా జనియింపఁ జేసి రం
బుదముల కెల్ల న ట్లొకయపూర్వమనోజ్ఞవిలాససంపదల్. 75

తే. అద్రిశృంగము లనుశంక నధిగమింపఁ, గోరియునుబోలె బలుమాఱు వారిధరము
లాత్మపవనంబుచేత నయ్యమరసతుల, పయ్యెదలఁ దూల్చి కుచములు బయలుపఱిచె.

చ. తపమునకుం గుశాసనము దానపువిత్తు ఫలించుపాదు ని
క్కపుసుఖసిద్ధి గోరి వెదకం దగునాకర మబ్జజాదివి
ష్టపముల కెల్ల సంబళి మొసంగెడుపాలెము మర్త్యమంత వే
లుపువెలమచ్చెకంట్లకును లోచనగోచర మయ్యె దవ్వులన్. 77

వ. తదనంతరంబ 78



సీ. సంభవించె నపూర్వషట్పదీగీతులు, లలితమంజీరఝుళంఝుళములు
ప్రాపించె నభినవపరభృతారవములు, కాకలీవ్యాహారకలకలములు
బుగులుకొనె నవీనపుష్పసౌరభములు, గుంభితాస్యామోదఘుమఘుమములు
కలిగెఁ దద్ధ్వనికి నుజ్జ్వలపల్లవద్యుతుల్, శయకుశేశయవికాసచకచకలు
తే. భూవరాన్వయతిలకతపోనివాస, మగుట నొదవినభాగ్యోదయమునఁ బోలె
నపుడు సరయూనదీతీరవిపినమునకు, నమరపురవారలలనాసమాగమమున. 79

వ. ఇట్లు తపోవనప్రాంతంబున విడిది గా విడిసి. 80

## మాంధాతృతపోవనంబున రంభాదులు శృంగారక్రీడ లొనర్చుట.

మ. కర మాశ్చర్యము గాఁగ నచ్చరలు శృంగారోజ్జ్వలాకారులై
సరసక్రీడలఁ జొచ్చి రానృపతపస్సంస్థాన ముచ్చైచ్చరట
చ్చరణాంభోరుహనూపురధ్వనుల నాశ్చర్యానుమోదంబులై
హరిణీసంఘము దర్భగర్భితముఖవ్యావృత్తి నాలింపఁగన్. 81

సీ. పరిమళం బంటక పరువంపుమొగ్గల, కెలయించుతనుగాలిపాలపమునకుఁ
దమలోన జాతివైరము డించి దూర్వముల్, మెట్టనిమృగజాతి మెలఁకువలకుఁ
బక్వసార్వర్తుకఫలపుష్పములు గల్గు, తరువులనీడలు దరలమికిని
బగలు రే మొగుడనితొగలఁ దమ్ములఁ గ్రాలు, కొలఁకులు గడ లెత్తి కలఁగమికిని
తే. వెఱఁగు దనుకంగ నిజతపోవిభవ మాత్మ, మెచ్చి పొగడుచుఁ జనుదెంచునచ్చరలకుఁ
జిత్తవీథుల జనియింపఁ జేసె శంక, నపుడు గనుపట్టె యువనాశ్వనృపతిపట్టి. 82

ఉ. చెంతల నంతరాయ మనుచీఁకటి పైకొననీక తేజ మా
క్రాంతదిగంతమై వెలయ గాడుపు సోఁకనిదీపమట్ల వి
శ్రాంతసమాధిసంగతి నచంచలుఁ డైనతపస్వియందుఁ ద
త్కాంతలయత్నముల్ విఫలకార్యములై విలసించె నయ్యెడన్. 83

చ. ఒకయెడ గెత్తి జంగ యిడ నూరురుచుల్ తలచూపఁ దీవ యం
దుకొన నిగుడ్చుట న్వికచదోర్లతమూలము చూడ్కిచూఱగా
నకనక కొను సాఁగి నతనాభి బయల్పడ నీవి జాఱ మీఁ
దికి మొగ మెత్తి యొక్కసుదతీమణి చేరువఁ గోసెఁ గ్రొవ్విరుల్. 84

చ. పదములకెంపునన్ బయలు పల్లవితంబుగ రాకపోకలన్
వదనముతీవఁ జందురునివైఖరి చూపఁగ దూఁగఁదూఁగఁ బ
య్యెద పలుమాఱు గాలి సెగయం జనుగుబ్బలు తొంగిచూడఁగాఁ
ద్రిదశవధూటి వేఱొకతె తీవల నుయ్యాల లూఁగె వేడుకన్. 85

చ. కోలఁదిగ నీడ్చి యీడ్చి కొనగోళ్ళ మెఱుంగు దుఱంగలింపఁ గా
వలపల దాపల న్నిగిడి వాలికచూపులు తీఁగె సాఁగ గు
బ్బలయిరు గ్రేవల న్నఖరపంక్తి బయల్పడఁ జేతు లార్చుచున్
వెలఁది యొకర్తె కట్టెనుర వేనలి చిక్కడలించె సోలుచున్. 86

ఉ. పట్టినహస్తకాంతి మును పల్లవితం బగువీణె పాటచేఁ
బుట్టుచిగుళ్ల రెట్టి యగుపొల్పు వహింప మొగంబుతావికిం
జుట్టినతేంట్లకున్ శ్రుతులు చూప సుధారసధార పాలికం
బట్టి మృదుస్వరం బెసఁగఁ బాడె నొకర్తు మనోజ్ఞభంగులన్. 87

క. ఈరీతి వివిధమధురా, కారంబులఁ దమవిలాసగరిమలు నెఱపన్
మేరుగిరిలీల మలయుచు, మీరణగతులసనఁ బోలె మెదలక యున్నన్. 88

సీ. కుసుమపల్లవభాసికుంజపుంజంబులు, రత్నచిత్రితమందిరంబు లయ్యె
నుత్తాలధరణీరుహోత్కరస్థలములు, నవమణిస్తంభమండపము లయ్యెఁ
బావనస్నానార్థబహుపల్వలంబులు, కృతకకేళీసరోవితతు లయ్యె
విహరమాణానేకవిధశకుంతంబులు, తరుణపారావతద్వయము లయ్యెఁ
తే. దీప్రనియమానుకూలప్రదేశ మైన, యర్కకులమౌళి నివసించునాశ్రమంబు
హారిరతిఖేలనోచితహర్మ్య మయ్యె, మఘవదిందీవరాక్షులమాయవలన. 89

వ. అనంతరంబ సమయసముచితసన్మార్గధూపలేపస్రగ్బలిప్రకరవర్ణనోపశోభితం బై తపస్వి రంగంబు విలాసినీలాస్యరంగం బగుచు లోకవిలోచనోత్సవంబు నాపాదింప ననురూపరూపానవద్యవాద్యధ్వనులతోడ నవినూత్నవిచిత్రయవనికాభోగంబు నభోభాగంబు నలంకరించె. నృత్తవిద్యాచాతుర్యధుర్యుం డగునాచార్యుండు కట్టెదుర మధురగంభీరస్ఫుటాక్షరంబు గాఁ బుష్పాంజలిక్షేపణంబుతోఁ బ్రస్తుతోచితదండలాస్యప్రస్తావంబు చూపి యవనికాపనయపూర్వకంబుగా షోడశాష్టచతుర్ద్వయద్వయైకక్రమసంఖ్యాకంబు లగుమృదంగకాహళకాంస్యతాళహుడుక్కాకరడావాద్యవిశేషంబులయందు నేకైకమేళాపరవాదనోపరిపరిస్ఫురితంబుల గుఱిగవణిలాగుమోడి బంధవతికుండల్యాదివాదనభేదంబుల వివిధమధురగంభీరఘోషంబు లఖిలచేతనశ్రవణేంద్రియమోహకంబు లయ్యె. ఉపరత మురజకరడాహుడుక్కాదినాదంబులు నతిచతురవాంశికోపదీయమానతానోపగీయమానవీణాతిపేశలకలక్వాణప్రాణాయమానంబులం బ్రోజ్జ్వలాలప్తిపూర్వకంబులు నై కాకువాదిదోషరహితకలకంఠీకంఠగీయమానగేయంబు లనుపమేయంబు లై నిఖిలచేతనాచేతనద్రావకంబు లయ్యె. మలయపవనచపలశిలీముఖముఖరస్థలనలినీకులవిలాసాపహాసకంబు లయి యనురూపాధికనూపురఝుళంఝుళశింజితమంజులంబులు గావించి విచిత్రరతిప్రవృత్తంబు లగునేపథ్యాంతరితపాత్రంబులఁ గించిల్లక్ష్యమాణపదపల్లవాంచలంబులు దివ్యజనహృదయోన్మాదకంబు లయ్యె. గవుసెన దివిసినం గనుపట్టువిచిత్రచిత్రరూపంబులరూపంబున యవనికాభోగంబు నపనయింప నిశ్శబ్దభూషణంబును నిర్వ్యాకృతినియతసకలాంగకంబు నగునిజనైశ్చల్యంబు నిర్భరం బై దైవాఱ పారవశ్యచ్ఛలంబున పశ్యజ్జనంబులపయిం బడం బిరిగొను ప్రవాళదండికాద్వయీమండితపుష్పాంజలివిలసిత లగునర్తకీపరంపర లఖిలచేతనచేతోవలోకనగ్రాహంబు లై యావిర్భవించె. ద్రష్టృజనకౌతుకావేశోదయసమర్పితకర్పూరధూపోపమానఘనగకల్పితాతిసూక్ష్మయవనికాప్యపాయంబున లఘుమేఘావృతి దొలంగి మెఱుం గెక్కు శారదనక్షత్రంబులచందంబున నిర్నిమేషనిరీక్షణపాత్రంబు లై పాత్రంబు లనురూపనేపథ్యస్ఫురితంబులు సమపాదస్థానకస్థితంబులుం గీతానుగుణాకంపితశిరస్కంబులు నగుచు విలాసగతిం బుష్పాంజలిక్షేపణం బొనరించి నిఖిలలోకవిలోకనోపాస్యంబు లైనదండలాస్యంబులకు నుపక్రమించి రప్పుడు శిరోవక్షఃకరపార్శ్వకటిపదాభిధానంబుల నేత్రభ్రూనాసాహనుకపోలాధరనామధేయంబులం గ్రీవాబాహుతుండోరుజానుజంఘానామంబులం గల్గునంగోపాంగప్రత్యంగంబుల తాళలయానుకరణవిశిష్టచేష్టావిశేషంబులయందుఁ బ్రత్యేకంబ యథోక్తంబు లగుత్రయోదశవిధశిరఃప్రయోగంబులు పంచప్రకారవక్షోవిలసనంబులు చతుష్షష్టిభేదప్రశస్తహస్తాభినయంబులు నంగుళిక్రమవర్తనోపచితచతుర్విధహస్తాభినయాంతరంబులుం బంచపార్శ్వవిభ్రమంబులుం బంచవిధకటినటనంబులు నవసంఖ్యాకరచరణవిన్యాసంబులుం జతుర్భంగికచరణవిన్యాసాంతరంబులునుం బంచప్రకారవక్షోవిలసనంబులును షట్త్రింశద్దృష్టివిశేషంబులు నుపాంగభేదోక్తచతుర్విధముఖరాగయోగంబులు నష్టధాబహుస్ఫురణంబులఁ బంచప్రకారోరుసంచలనంబులును సప్తవిధజానువిలాసంబులును బంచవిధజంఘాప్రవర్తనంబులును వెండియు దండలాసకాంగోక్తకంబులగుత్రింశత్స్థానకంబులు త్రింశచ్చారిభేదంబులు భ్రమరిసప్తకంబునుం గరణవింశతియు నంగహారదశకంబును మఱియు ముఖరసముఖసౌష్ఠవలలితభావకౌతుక్యనుమానప్రమాణఝుంకారవాసురేఖతాం గానంగడాలఢిల్లాయీనవణికిత్తుతరహారోల్లాస వేవతననిలయపయపాటనుసంధిస్థాపనచొక్కినామంబులం గలుగులాస్యాంగచతుర్వింశతివిశేషంబు లాదిగాఁ గలుగునసంఖ్యేయాభినవాభినయంబులు యథాలక్షణంబులు యథాక్రమములు యథారసంబులుం గా నృత్యప్రవర్తనంబున నభినయించుచుఁ బాత్రగుణవ్యక్తిప్రయుక్తంబులు శిల్పవైచిత్రీసమాలోచనసూచకంబులుం బరస్పరసామ్యలక్ష్మీప్రదర్శకంబులు బహుపాత్రోపయోగప్రయోజనంబులుం గ్రియామాత్సర్యమాధురీధురీణంబులును సభ్యనేత్రచమత్కారకారకంబులు నై సమవిషమభేదద్విధాకారంబు లగువివిధవిచిత్రబంధప్రచారంబుల విలసింపం జొచ్చి రంత నూర్వశియుం బూర్వచిత్తియు మేనకయు సహజన్యయుం బ్రమ్లోచయు నను మ్లోచయుఁ బుంజికస్థ

లయు ఘృతస్థలయు విశ్వాచియు ఘృతాచియు మనోరమయు రంభయుఁ దిలోత్తమయుఁ జంద్రరేఖయుం బంచచూడయు మిశ్రితయు మిశ్రకేశియు మొదలుగాఁ గలిగినచతుర్దశవంశావతీర్ణంబులు షోడశకోటిసంఖ్యాకంబులు తుల్యరూపవయోవిభ్రమంబు లై చరింపఁ బ్రపంచమనోవంచకంబు లగుదివ్యాప్సరోజనంబులు శంబరారికిం దోడుచూపుచుఁ దదీయమూలబలంబు చందంబునం బర్జన్యునకుఁ దోడుచూపుశంపాపరంపలవిధంబున వసంతునకు నెన్నిక యిచ్చుపుష్పలతికలవిలసనంబునం గ్రమంబున జతురష్టషోడశద్వాత్రింశచ్చతుష్షష్ట్యాద్యుత్తరోత్తరగణనావృద్ధివిశేషంబులం బంక్తిబంధబంధురగతి నద్భుతాద్భుతంబుగా నావిర్భవించుచు దండయుగ్మంబుల నంజలిపుటంబులు ఘటియించుచుఁ బరస్పరసాంముఖ్యంబునం బొలుచుచు నితరేతరస్థితస్థలవినిమయంబు చూపుచు నిరంతరనూపురఝుళంఝుళశింజితమంజులంబుగా సవ్యాపసవ్యపార్శ్వంబులం గ్రమప్రసృతపార్ష్ణిప్రచారంబులు గొలుపుచు వాద్యతాళయతిమానంబు లాకర్ణించుచుఁ దదనుగతంబు గా నర్తనోత్సుక్యజచిత్తవికారానుకారం బగుశరీరపారవశ్యంబు నెఱపుచు నాకులనర్తనంబులం బ్రవర్తించుచు మండలప్రచారంబుల సంచరించుచు వాద్యానుకృతంబులు గాదండతాళంబు లిచ్చుచు నాభిముఖ్యపరావృత్తముఖంబుల దండతాడనంబులు గావించుచు వాద్యతాళానుకూలంబుగా నితరేతరదండానువిద్ధస్థానకంబులు సంఘటించుచు హస్తచలనవలనవర్తకీవర్తనంబుల నర్తించుచు లయత్రయసమన్వితంబుగా వివిధబంధబంధురప్రచారంబుల విహరించుచుం గేవలయతిమానంబున నృత్తబంధప్రవర్తనంబుల వినసించుచు నృత్తప్రయోగబంధప్రయోగంబులు రెంటియందు నాదిమధ్యనిర్వాహంబులం గ్రమంబున మృదుమధ్యద్రుతగతిభ్రమరీవిశేషంబులం బరిభ్రమించుచుఁ బ్రతిగతిసమాపనంబున నతికోమలంబుగా స్థానకోపక్రమంబు నెఱపుచు నుపక్రాంతభావంబుల రసోత్తమంబుగాఁ గళాసించుచుఁ బ్రవృత్తైకమార్గంబు నందందయమందరసోదయవశంబున నూత్ననూత్నంబుగా ననుక్తవిచిత్రాంతరమార్గాంతరంబులం బ్రపంచించుచు ఋజుచతుష్కచక్రాకారగతిత్రయీప్రారబ్ధంబులు పరస్పరవ్యతిలంఘనమార్గరూపంబులు నై సారిచంద్రకళాబంధుసారమురడిహంస లీలారథాంగాభరణనారాయణవల్లభ చతుర్ముఖరంగలక్ష్మీరంగమనోహరాదివివిధమధురానవధికబంధప్రచారంబుల నటియింపం జొచ్చిరి. ఇవ్విధంబున సౌందర్యంబులకు సాఫల్యంబును దారుణ్యంబులకుఁ గృతార్థతయు లావణ్యంబులకు నుత్తేజనంబును విభ్రమంబులకు నుపాదానంబును నేపథ్యంబులకు విషయంబును నై నర్తకీవిలోకనజనితం బైనశృంగారంబునుం దదీయవివిధాపూర్వనృత్తబంధవిషయం బైనయాశ్చర్యంబును దదన్యలాసికాంతరవిషయం బైనహాస్యంబును దదితరవిషయం బైనబీభత్సంబును దదీయపయోధరభరభుగ్నావలగ్న శంకితభంగీవిషయం బైనభయానకంబును రసాతిరేకసద్యస్సమీహిత



తత్పరిరంభదౌర్లభ్యవిషయం బైనకరుణయుఁ దదవలోకనవిరోధినిరసనవిషయంబు లైనవీరరౌద్రంబులును ఉపద్రష్టలయందుఁ బరిస్ఫుష్టంబులు గావించురాసక్రీడావిశేషం బైనయాదండికాన్నృత్తంబు యతిమానమానితం బగుట సుకవికవితయుంబోలె, భ్రమరీవిహారమనోహరం బగుట వసంతాగమంబునుం బోలె, ప్రకటితకరణపాటవం బగుట యౌవనోదయంబునుంబోలె, బహువిధబంధబంధురం బగుట నిధువనక్రీడయుంబోలె, నిశ్చలీకృతనభశ్చరవిమానంబును నిర్ముక్తదూర్వాచర్వణమృగీసంతానంబును పల్లవితవస్థాణుకులంబునుం బరిస్రావితపరిసరనగోపలంబునుం గా విశ్వసమ్మోహనం బగుచుఁ బ్రవర్తింపం గొంతకాలంబున. 90

ఉ. యోగసమాధి చాలి నృపయోగికులాగ్రణి యంత దివ్యకాం
తాగమనప్రయోజనము నాత్మ నెఱింగి బలారికల్పితో
ద్యోగముఁ గూర్చి నవ్వోలయ నొయ్యన శాంతిసుధానిధాన మై
తీఁగలు వాఱుపార్శ్వగతదృష్టిఁ దగం గలయంగఁ జూచినన్. 91

## మాంధాతకు నప్సరసలు శిష్య లగుట.

సీ. రంభ కారంభసంరంభంబు గడివోయె, నూర్వశిగర్వంబు ఖర్వ మయ్యె
మేనక తలఁపులోఁ బూనిక దిగఁ ద్రోచెఁ, దలఁగెఁ దిలోత్తమ తత్తఱంబు
నీచ మై తోఁచె ఘృతాచి యాచరణంబు, ఘోష మ్ముడిగె మంజుఘోషపలుకు
ప్రమ్లోచనకుఁ బర్వెఁ బ్రమ్లానభావంబు, తమియేది కడలకుఁ దారెఁ దార
గీ. కదుపుఁ బాసినహరిణియై కలఁగెహరిణి,మఱియుఁదక్కిన వేల్పుఁ గొమ్మెఱుఁగుఁబోండ్లు
కనదహంకారములకు ధిక్కారమైన, నృపతపోధనుచూడ్కి పై నిగుడునపుడు. 92

క. ఆటలపు డెల్లవారికి, నాటల పట్టయినయప్సరోంగనలయెడం
బాటలు నప్పుడు పరువుం, బాటలు నై పోయె నృపతిభాస్కరు నెదుటన్. 93

వ. మఱియు నయ్యచ్చరలు మచ్చరంబులకచ్చు వదలి పంతంబులపొంతువులు గూడకభావంబులచేవలు డిగి చక్కఁదనంబులయుక్కు దక్కి చూపులయే పెడలి నవ్వులక్రొవ్వు లఱి మాయలచాయ లుడిగి పరుసంబులు సోఁకినలోహంబులు సువర్ణభావంబు భజియించినచందంబునం దపఃప్రభావసంపన్నుఁ డగునన్నరేంద్రచంద్రునిదృష్టిపాతంబున నత్యాశ్చర్యంబుగాఁ జిత్తంబులు విషయనివృత్తంబులు వైరాగ్యతప్తంబులు నపవర్గమార్గాయత్తంబులు నై యతం డనిపినం జనక తదీయపరిచర్యాతాత్పర్యపర్యాయంబున. 94

సీ. విటకచాకృష్టికి విసువునొక్కలతాంగి, వేలిమికట్టియల్ విఱిచి తెచ్చు
నధిపుమై ముద్రింప నలయు వేఱొకరామ, సుదగోళ్లఁ గుసుమముల్ చిదిమి తెచ్చుఁ
బతియున్నయెడ కేఁగ బడలుబాలిక యోర్తు, పరవనంబుల కేఁగి పండ్లు దెచ్చు
నెయ్యురు పన్నీట నింప లావఱునొక్క, నెలఁత తీవల కెల్ల నీరు నించు

ననుపుఁబల్లవులకు నర్ఘ్యోపచారముల్, సేయు సేవ నూఁదుచిగురుఁబోండ్లు
చిత్ర మైనతపసిశిష్యు లై పరిచర్య, చూపు చుండి రాత్మశుద్ధి గలిగి. 95

క. చిరకాల మిట్లు వారిం, బరిచర్యలు గొని తపస్వి పర్విసకృప మై
మరలం బనిచిన నంతయుఁ, బురందరుం డెఱిఁగి యాత్మఁ బొడమినభీతిన్. 96

## ఇంద్రుఁడు మాంధాతపై మేఘములనంప బృహస్పతితో నాలోచించుట.

తే. దిగధిపాలుర నెల్లఁ దోడ్తేరఁ బనిచి, వారు దాను రహస్యవిచారపరత
నుండి వెఱతోడి భయమున నుదిలకొనుచుఁ, బలికె గీష్పతిఁ జూచి యాబలవిభేది. 97

చ. నరసురదైత్యజాతిజు లొనర్పరె మున్ను దపంబు ధాత్రిపై!
మరునకు లోను గానిధృతిమంతుఁడు గల్గినఁ గల్గుఁ గాక! శం
బరరిపుబంటుగాఁ గొనుతపస్వియుఁ గల్గునె? చూచునంత న
చ్చర లఁట శిష్యు లైరి పెఱసంయమియుం గలఁడే యి టెన్నఁగన్. 98

ఉ. ఖండసుధాకరాలికలు గాఢవిరక్తిఁ దపస్విశిష్యు లై
యుండిరి పూఁపు దప్పుటకు నల్లము రోసి రతీశుఁ డిక్షుకో
దండముఁ బుష్పబాణములదండముఁ బాఱఁగ వైచి చేతులం
దఁడమునుం గమండలువుఁ దాలిచి మస్కరి గాక యుండునే? 99

తే. కార్య మెయ్యది మనకు నక్కడిఁదితపసి, కంతరాయంబు వుట్టెడునంత గాఁగ
వర్ష మొదవింపఁ బుష్కలావర్తకములఁ బంపుదమె? యన్న విని నవ్వి పలికెగురుఁడు.

## బృహస్పతి యింద్రునకు మాంధాత వశ్యుఁడు గాఁ డని చెప్పుట.

ఉ. కా దమరేశ! కార్య మది కన్గొన బ్రహ్మకు నైన మన్మథో
న్మాదము గొల్పవచ్చరలమానస మింతటిలో విరక్తికిం
బాదుగఁ జూడ నేర్చినతపస్విశిఖామణి మింటఁ బన్నునం
భోదకులోదయంబు వలవోకయ నవ్వున బాఱ నూఁదఁడే. 101

ఉ. అద్రులు మీఁదఁ బడ్డ భర మాటఁ దలంపరు శూలహస్త యై
భద్ర యదల్చి పైకొనిన భ్రాంతి వహింపరు మేర దప్పి సా
ముద్రతరంగముల్ దిశలు ముంచినఁ జింతిల రన్న వారిదో
పద్రవవృత్తికిం గలఁగఁ బాఱుదురే హరిభక్తినిశ్చలుల్?. 102

సీ. దూషింప నొల్లరు దుష్టాత్మకుల నైనఁ, బ్రతి సేయ నొల్లరు పగతు కైన
నభిలషింపఁగ నొల్ల రాత్మదేహం బైన, వగవంగ నొల్లరు వొగిలి యైనఁ
బట్టంగ నొల్లరు ప్రాణసంకట మైన, నాడించుకొన నొల్ల రలసి యైన
వాదింప నొల్లరు వశ మైనపని కైన, మఱుపెట్ట నొల్లరు మర్మ మైన



హరిపరాయణు లైనమహాత్మజనులు, గాన హరిభక్తినిశ్చలుం డైనయతని
వలనఁ గలుగదు భయ మనువార్త యైన, మనక కా దెల్లచో జీవమాత్రమునకు. 102

వ. అదియునుం గాక. 103

సీ. ఎవ్వనిమహిమాబ్ధి కేకశీకరరేణు,పరమాణువులు పరబ్రహ్మముఖ్యు
లెవ్వనియలవోక కిచ్ఛలోఁదలఁపు లీ,విశ్వజన్మస్థితివిలయవిధము
లెవ్వనికృత్యంబు లిష్టశిష్టావనా,నుగ్రహదుష్టవినిగ్రహమ్ము
లెవ్వనినామంబు లెట్టివారల కేనిఁ, జిరభవబంధవిచ్ఛేదనంబు

గీ. లమ్మహామహుఁ డాదినారాయణుండు, దన కొనర్చినతప్పని దా సహించుఁ
గాని తనభక్తజనులకుఁ గౌర్య మెపుడు, దలఁచుటయు నోర్వఁ డిది నిశ్చితంబుసూవె!

ఉ. కావున నాగ్రహం బుడిగి కంజవిలోచనుఁ గృష్ణుఁ గానఁ గాఁ
బోవుట కార్య మవ్విభుఁడు పూర్ణకృపామతి మిమ్ము నంబఱం
బ్రోవఁగ నత్తపోనియతి పూనిక మాన్పఁగ శక్తుఁ డన్నన
ద్దేవకులాధిపప్రముఖదిక్పతు లందఱు భీతచిత్తు లై. 105

వ. అట్లుండియు సదుపాయంబు గా నైకమత్యంబు నంగీకరించి యందఱు నప్పుడ కదలి
యుదగ్దిశాభిముఖు లై చని చని. 106

## ఇంద్రుఁడు బృహస్పతియనుజ్ఞచే వైకుంఠమున కేగుట.

మహాస్రగ్ధర. కని రంతర్మగ్నభూభృత్కబళనచటులగ్రాహసంచారఘాటీ
జనితస్పర్ధాళువీచీసముదయలహరీసంభ్రమదోర్భోగిపూత్కా
రనిరంతోత్పాతితక్షీరవితతఘనధారాసహస్రస్వభావా
ఖనదీస్థైర్యరోపగూహాహోద్గతసుఖసుముఖాకారలబ్ధిం బయోబ్ధిన్. 107

క. కని యప్పయఃపయోనిధి, యనుభావంబునకు నద్భుతాహ్లాదమునన్
మునిఁగినమనములతోఁ గను, కనియఁగఁ గనుఁగొనుచు మాళికంపము లొలయన్.

తే. నిర్మల మగుమహాత్ముల నెమ్మనముల, యోగబలమున వెడదోఁచునురగశాయి
యున్నవాఁ డిందుఁ గాఁపురం బన్న నీప,యోంబునిధినిర్మలత యెన్న నలవి యగునె?

చ. ఉదరగతాఖిలుం డగుమహోత్పలనాభుఁడు లో వసించుచోఁ
బొదలుపయఃప్రపూరములఁ బొడ్మెడుతత్పరివాహరేఖ లై
యొదవి యజాండభాండబహిరూర్ధ్వముల న్నటనంబు చూపునీ
యుదధికులాధినాథుమధురోజ్జ్వలసాంద్రయశోవిలాసముల్. 110

తే. బ్రహ్మరుద్రాదివివిధరూపములచేతఁ, బరమపురుషుండుఁబోలె నిప్పాలకడలి
మధుఘృతోదధిలవణాదినుయతఁ దాన, పెక్కుమూర్తుల విలసించు నొక్కఁ డయ్యె.

చ. కరుణయ కాక నన్ను నరికట్టఁగ నీ వోకలక్ష్మి యెట్లు? లం
బర మఖిలంబు మ్రింగి యుడుపఙ్క్తులఁ గ్రాసెదఁ జూడు మన్నయ
ప్పరుసున నిప్పయోంబునిధి పల్మఱుఁ జెల్లెలికట్టమీఁదఁ బె
ల్లరుదుగఁ బ్రోవుకొల్పెడు మహామలకోపమమౌక్తికావలిన్. 112

చ. వెడఁదలు గాఁగవించుచుఁ బ్రవేశతటంబుల నొగ్గి క్రోలి నో
ళ్లడవఁగ వీఁపుచిప్ప లెగయం బడి పింజలు వాఱ మింటిపై
వెడలునదీప్రవాహములవెంట నె వెల్వడఁ గాంచు నిమ్మహో
జడనిధిలోనిశాబకఝషంబులు మ్రింగినగర్భశైలముల్. 113

ఉ. హేల దలిర్ప మి న్నొరసి హెచ్చుమహోర్మహరీవిజృంభణా
భీలతఁ జూచి ముంచు నని బెగ్గిలి వెల్వడి పోవుబాడబ
జ్వాలల కిప్పయోంబుధి యొసంగుకృపాభయహస్తపఙ్క్తులం
బోలెడుఁ దీరవిద్రుమసమూహశిరఃపతమౌక్తిమాలికల్. 114

చ. ఎడపక యిచ్చుదాతలకు నివ్వలఁ గల్గుచు నుండు నిక్క మి
క్కడలిపయఃప్రపూరము లగణ్యము లైనఘనాఘనంబు లె
ప్పుడుఁ దనియంగఁ గ్రోలికొని పోయి నిరంతరవృష్టి చూపుటం
బొడమినరేఖ లీయుదధిపుంగవుచందె గమించి కూడెడున్. 115

తే. విశ్వవిశ్వంభరకు హారవిలసనంబు, దోఁపఁ జేయుచు నున్నది దుగ్ధవార్ధి
యున్నవాఁ డిందు నిందీవరోజ్జ్వలుండు, నాయకస్ఫూర్తి నాదినారాయణుండు. 116

వ. అని యనేకభంగులం గొనియాడుచుం జని యప్పయఃపయోనిధానంబునకు నంతరం
గంబునుంబోనిశ్వేతద్వీపంబు లోచనగోచరం బగుటయుఁ బ్రహర్షితాంతఃకరణు
లగుచుం గరకమలంబులు మొగిచి నభోవతరణం బొనరించి బహుసహస్రయోజన
విశాలరమణీయం బైనయమ్మహాద్వీపంబునం జూపట్టువివిధవిశేషంబు లొండొరులకుం
జూపి చెప్పికొనుచుం గనువారు ముందట. 117

## శ్రీవైకుంఠవర్ణనము.

మ. నముచిద్వేషిముఖామరు ల్గనిరి తందాయస్వభూనీలకం
ఠము నభ్రంకషసాలచక్రనవరత్నశ్రీకృతాశావకం
ఠము దౌవారికరుద్ధసిద్ధమునిపూర్ణస్వాపకంఠంబు నా
త్మనువఃకల్పితనిర్భరాద్భుతభయోత్కంఠంబు వైకుంఠమున్. 118

క. కని యంతంతట వినయా, వనతశిరస్కు లయి చేర వచ్చి దిశాపా
లనజనితాహంకృతి విడి, వనజోదరపారతంత్ర్యవశగాత్మకు లై. 119

సీ. చక్రభూధరశలస్వాములపెంపునఁ, గనుపట్టుసాలచక్రములపొడవు
నూర్ధ్వాండఖండమునుండునుంభము లయి, రంజిల్లుబహుగోపురములమురువు



నైకటికంబుమహేంద్రలోకములోని, రమ్యహర్మ్యపరంపరలబెడంగు
నింగి యింతసి తెల్పి నిజకింకిణీధ్వనిఁ, జాలెడుకేతనచ్ఛటలసొబగుఁ

గీ. బురరమాధృతిఘనసారభూష లనఁగ, నమరునుపకంఠమణితోరణములచెలువుఁ
జూడ్కిఁగమి నుల్లములతోన చుట్టి తివియ, నాననము లెత్తి కనుఁగొంచు నరిగి మఱియు.

సీ. ప్రసవరసం బాని పద్మినీస్థలములఁ, బ్రణవ మావర్తించుబంభరముల
మధురోపవనముల మంత్రరాజము గొల్చు, శారికాశుకపికశాబకములఁ
దాపత్రయంబు డిందఁగఁ జిదానందశైత్యము వెదచల్లుమందానిలముల
సాలోక్యసామీప్యసారూప్యసాయుజ్య, భంగుల విలసించుభాగవతుల

గీ. సంస్తుతించుచు మెచ్చుచు సంతసిలుచుఁ, గాంచి మ్రొక్కుచు రాజమార్గమున నేగి
ఖచరకులముఖ్యు లల్లంత గాంచి రెదుట, మధుమహాసురవిధ్వంసిమందిరంబు. 121

వ. కాంచి కదియ నేతెంచి భయాద్భుతావహమస్తకవక్షస్స్థలబాహుచరణాభిరామమూ
ర్తులుం గరాళదంష్ట్రాకరాళాస్యులు వివిధాయుధహస్తులు విచిత్రభూషణాంబర
గంధమాల్యాభిశోభితులు ననుపమానజ్ఞానశక్త్యాదిగుణసంపన్నులు నప్రతిమాష్టవిధై
శ్వర్యధుర్యులు నయుతలక్షకోటిశతకోట్యాదివర్గంబులు నసంఖ్యేయులు నగు
విష్ణుకింకరులును, పూర్వద్వారంబునఁ జండప్రచండాదులును, దక్షిణద్వారంబున
భద్రసుభద్రాఖ్యులుం గుముదకుముదాక్షముఖ్యులును, పశ్చిమద్వారంబున జయ
విజయప్రముఖులును, ఉత్తరద్వారంబున ధాతృవిధాతృప్రభృతులును రక్షింప,
మఱియుం జతుర్భుజులును శంఖచక్రధరులునుఁ బీతాంబరపరికల్పితులునుం
గాలమేఘసంకాశమనోజ్ఞశరీరులును గణసహస్రపరివృతులు నగువైకుంఠవైమా
నికు లనేకులు పరితఃపరిరక్షకులునుం గా, హరహిరణ్యగర్భసనకాదివందనీయంబును
తదీయవాఙ్మానసాగోచరామేయప్రభావైశ్వర్యస్వాభావికంబును సేవాగతపాలితా
నేకసురాసురసిద్ధయోగిపరంపరాసంకులప్రాంగణంబును నగునమ్మహామందిరంబునం
బ్రాంజలు లగుచు నిలిచి, అవసరం బెఱింగి లోపలికి విజ్ఞాపనంబు చేసి పనిచినపిదప
నాహూతు లై పురుహూతముఖ్యులు హర్షోత్కర్షంబునం బ్రవేశించి, అంత
రాంతరదివ్యావరణశతసహస్రంబులు దివ్యోద్యానశతసహస్రంబులుం గడచి నడచి,
అనంతరం బాయనంతవిశాలరమణీయం బైనయంతర్దివ్యాయతనాంతరంబు దఱిసి
చని, అందుఁ గ్రీడాశైలశతసహస్రోపశోభితంబులుం గోకిలశారికామయూరకీరాది
శకుంతకులకోమలకలకూజితసమాకులంబులుం బరితఃపతితపవమానపాదపస్థనానాగంధ
వర్ణదివ్యప్రసవసమగ్రంబులుం గ్వచిత్క్వచిదంతస్థపుష్పరత్నాదినిర్మిత దివ్యలీలా
మండపశతసహస్రాలంకృతంబు నగుపారిజాతాదిదివ్యకల్పకారామశతసహస్రంబుల
చేతను, మణిముక్తాప్రవాళకృతసోపానపరంపరావిరాజితంబులు దివ్యామలామృత

రసోదకపూరపూరితంబులు నతిరమణీయదర్శనరాజహంసాదిదివ్యాండజకులాతిమనోహరమధురస్వరవాచాలంబులు నంతస్థముక్తామయదివ్యక్రీడాస్థానోపశోభితంబులు నగు దివ్యసౌగంధికదీర్ఘికాశతసహస్రంబులచేతను, మఱియునుం బ్రవిష్టజనంబులకు నిరస్తాతిశయానందైకరసానంత్యంబున సకలకరణసమున్మాదంబులు ననవరతానుభూయమానంబు లయ్యు నభూతపూర్వంబులచందంబున నవనవాశ్చర్యావహంబులు నై నారాయణదివ్యలీలాసాధారణంబులుం బద్మవనాలయాదివ్యలీలాసాధారణంబులును నగు వివిధమధురక్రీడాదేశశతసహస్రంబులచేతను పరివృతంబై, దివ్యరత్నమయంబును దివ్యరత్నస్తంభశతసహస్రశోభితంబును దివ్యనానారత్నకృతస్థలీవిచిత్రంబును దివ్యాలంకారాలంకృతంబును బ్రతిప్రదేశకృతదివ్యపుష్పపర్యంకవిలసితంబును నిత్యవికచనానాప్రసవాసవవాసనాస్వాదమత్తభృంగావళీసముద్గీయమాన దివ్యగాంధర్వపూరితంబును జందనాగరుకర్పూరదివ్యపుష్పావగాహితమందానిలాసేవ్యమానంబు నగుదివ్యస్థానమండపంబునందు మధ్యప్రదేశంబున, విశ్వప్రపంచసామ్రాజ్యభారకుఁ డగువిష్వక్సేనుండును, వెండియు స్వభావనిరస్తసమస్తసాంసారికస్వభావులును భగవత్పరిచర్యైకభోగపరాయణులు నసంఖ్యేయులు నగువైనతేయాదినిత్యసిద్ధపరిజనంబులును, యథాయోగ్యంబుగం బరివేష్టించి సేవింప, గుణశీలరూపవిలాసాద్యనురూపలక్ష్మీసమేతంబుగాఁ బుష్పసంచయవిచిత్రితమహాదివ్యయోగపర్యంకంబుపై ననంతభోగిభోగాసనంబున. 122

## శ్రీమన్నారాయణదివ్యమంగళవిగ్రహావర్ణనము.

సీ. ఆత్మప్రదానాహమహమికావయవంబు, సౌందర్యసర్వవశంవదంబు
దశదిశాముఖగంధితారుణ్యకౌమార, మఖిలలోకైకస్వయంసుఖంబు
పశ్యజ్జనేక్షణప్రవణామృతౌఘంబు, నైజదోరంతరాంతగపురంబు
సిద్ధయోగివ్రాతచేతఃప్రపశ్యంబు, వందారుదోషసర్వంసహంబు
తే. కరతలోచ్చయఫలనక్రకల్పకంబు, సర్వతోముఖసౌహార్దసంప్లవంబు
నగువిచిత్రమహామహం బౌపనిషద, మమరలోచనగోచరం బయ్యె నపుడు. 123

తే. ఆదిపూరుషప్రత్యవయవములందు, వితతలావణ్యమగ్నమై వెడలలేని
ఖచరతతిచూడ్కి నితరాంగకములు దార, ప్రవణగుణములచేఁ జుట్టి తిగిచికొనియె.

మ. సరసాంభోదము గాఁ దలంతురు రమాసౌదామినీరేఖచే
వరనీలాగము గాఁ దలంతురు మహావక్షస్తటీశోభచేఁ
బరమాంభోనిధి గాఁ దలంతురు చతుర్బాహూర్మిసంఘంబుచేఁ
బురుహూతప్రముఖామరాధిపతు లంభోజాక్షు వీక్షించుచోన్. 125



తే. పరమసుకుమారవిగ్రహస్పర్శనమునఁ, బూరుషోత్తముదివ్యవిభూషణములు
పులకితము లైన వని రుచిస్ఫూర్తివలన, విస్మయంబున మునిఁగి రవ్విబుధవరులు. 126

ఉ. పానువుఁ బాముభోగరుచిఁ బర్వెడువెన్నెలవెల్లిచేత స
స్నానము గాంచి యంతికరమాతనుకాంతినవాతపంబుచేఁ
గానుక లంది వేల్పులకుఁ గ్రమ్మఁగఁ జేసె మహాద్భుతంబు నా
సూనకులాస్త్రతంద్రినుసోయగపుంజిగిచిమ్మచీఁకటుల్. 127

తే. చిదచిదధిరాజభావైకచిహ్న మైన, కైటభారాతిరత్నకిరీటమునకు
సాహసాక్రమణక్రీడ సలుపఁ బోయి, ఖచరతతిచూడ్కి రశ్ములఁ గట్టువడియె. 128

క. చరణవినతాస్మదాదులఁ, గరుణ విలోకించునపుడ కాని యవనతిం
బొరయనియది యిది పో మ్మని, సురవరు లసురారిమౌళిఁ జూచిరి వేడ్కన్. 129

క. వరమకుటరత్నకిరణ, స్ఫురణప్రతిఘట్టనమున భుగ్నాగ్రము లై
మరలి తనుద్యుతు లనుమతి, నెరపె సుపర్వులకు విభునిటలాలకముల్. 130

ఉ. అచ్చుగఁ బోరిపోరి సగ మై జయ మేది రమాధిపాస్యముం
జొచ్చినచంద్రు గాఁ దలఁచి చూచిరి ఫాలము నోడి తారునుం
జొచ్చినపంకజంబు లని చూచిరి నేత్రయుగంబు భీతిమైఁ
జొచ్చినదర్పణంబు లని చూచిరి చెక్కుల దేవతావరుల్. 131

క. లోలవిలోచనసతతో, ద్వేలకృపాపూరమృదులవీచుల యని ర
వ్వేలుపుఁ బ్రోడలు శేషశ, యాళునిఁగజివంకబొమలయాకృతిఁ గనుచోన్. 132

క. సురుచిరలావణ్యామృత, సర సగువక్త్రమునఁ జపలచక్షుశ్శఫర
స్ఫురణమున నొలయుతరఁగలఁ, బురుణించిరి సురలు విభుని భ్రూవిభ్రమముల్. 133

తే. తెగున లంఘించి తలచుట్టుఁ దిరిగినవియొ! నిక్కముగ వీను లవధిగా నిలిచినవియొ!
తెలియరా దని మతుల సందియము నొంది, రమరు లవ్విభుదీర్ఘనేత్రములు చూచి.

క. కేవలకరుణావిషయం, బీవిశ్వము గాన విషయ మెఱుఁగమి నికటీ
భావము నొందనివిష్ణు, భ్రూవిల్లులు చూచి ముదముఁ బొందిరి దివ్యుల్. 135

క. తిలకోర్ధ్వపుండ్రకల్పక, విలసన్నవమూలకాండవిభ్రమ మన నా
జలరుహలోచనునాసిక, బలభిత్ప్రభృతులకుఁ జూడ్కి పండువు చేసెన్. 136

క. సితదశనకుందకలిత, స్మితలతికాపల్లవంబుచెలువున నరుణ
ద్యుతిమధుర మైనకమలా, పతియధరముఁ బ్రీతిఁ దేల్చెఁ బశ్యజ్జనమున్. 137

తే. కమలనాభకపోలరంగములయందు, మకరకుండలమణివిభామందహాస
నవవధూవరపరిణయోత్సవమునపుడు, క్రతుభుజులచూడ్కి పెండ్లిపేరంటము సేసె.

తే. కర్ణకుండలప్రతిబింబగర్భవతులు, గాన సుస్మితపాండూయమానముఖము
లగుట వీనికిఁ దగు నని హరికపోల, రేఖలకుఁ బ్రీతిఁ బొందిరి లేఖవరులు. 139

తే. కదిసి యంతరప్రదేశంబు గాచి యున్న, సనకముఖ్యమహాకవిసంస్తవముల
మొదలిశ్రీకారములశంక నొదవఁ జేసె, దేవదేవునివీను లాదివ్యతతికి. 139

క. ఆకృతిసామ్యము గల దని, కాకున్న నయించు దీని ఘనవిస్వన మెం
దాకరముచిందమున కని, శ్రీకాంతుగళంబు నూహ చేసిరి ఖచరుల్. 140

క. సరసశ్రీభూనీలా, సరళభుజాగ్రహణనియతసంస్థానవుసం
స్ఫురణ మని తోఁచెఁ జూపఱ, కరు దై రేఖాత్రయంబు హరికంఠమునన్. 141

క. సురకరికటమదరేఖా, దరవరణీయద్రులతలఁ దలపించె నభ
శ్చరులకు శార్ఙ్గజ్యాకిణ, పరిచిహ్నితవిష్ణుదీర్ఘబాహార్గళముల్. 142

చ. ప్రణయకృతోపధానవిధిఁ బ్రాప్తము లై నరమాకళావతీ
మణిమయకర్ణకుండలవిమర్దనముద్ర లయత్నసిద్ధభూ
షణములు గాన నమ్రజనసంభరణంబులయందు బద్ధకం
కణములు గా నెఱింగె మురఘస్మరుబాహువులన్ సురావళుల్. 143

తే. దీర్ఘదీర్ఘంబు లగురమాధిపునిబాహు, లతలఁ దిరిగి పరిశ్రాంతిగతము లైన
వేల్పుఁబ్రోడలచూడ్కులు విశ్వవిభుని, వెడఁదనిద్దంపుటురమున విశ్రమించె. 144

మ. సురరక్షార్థకవాట మైనహరివక్షోవీథి రక్షోభటో
త్కరశస్త్రాస్త్రనిపాతరేఖల నలంకారంబు గా నెన్ని త
త్పరభావప్రథమానచిహ్నములు గా భావించి రీక్షాపరుల్
సిరినిం గౌస్తుభరత్నహారతులసీశ్రీవత్సచిహ్నంబులన్. 145

తే. తాఁ గృశత్వంబు నొంది సౌందర్యమునకుఁ, బూర్ణభావంబు గొల్పెడుపుండరీక
నయనుమధ్యంబు పశ్యజ్జనంబు పొగడెఁ, బరమపదపోషకులు పేదవడియుఁ దగరె!

క. ఉదరస్థితలోకత్రయ, పదజనిపరిదృశ్యమానపార్థక్యం బై
త్రిదశాధిపదృష్టివశం, బద మయ్యె మురారిత్రివళివలనం బచటన్. 147

ఉ. మువ్వురు దేవతల్ సములు మువ్వురు నేకమ వేఱతత్వ మీ
మువ్వురకంటె మీర దను ముగ్ధుల నాత్మవికారరేఖచే
నవ్వవిధీశహేతుహరినాభిపయోజముచే నెఱింగినా
రవ్విభుదృష్ట్యధీనము తదన్యసమస్తము నౌట వేలుపుల్. 148

తే. బహుమహల్లహరీవిజృంభణమువలనఁ, ద్రిజగదంతర్ధి యగురమాధిపమహాబ్ధి
మధ్యభాగంబునందు నున్నజ్జదవని, పద్మ మని తోఁచెఁ దన్నాభిపద్మ మపుడు. 149

క. తనచెలువున గెలిచి జయం, బున నొరొ శ్రీభూమికరభములచే సంవా
హనరూపసేవ గొనియెడు, నని విభునిమృదూరుయుగళి నరసిరి దివ్యుల్. 150



క. మధుకైటభకుటిలాసుర, రుధిరార్ద్రము లైననాఁటిరూపము దెలిపెన్
మధుసూదనుతొడలు కాంచీ, మధురారుణమణిమరీచిమహితము లగుచున్. 151

క. అభ్రశ్యామలహరికటి, విభ్రాజత్కనకశాటి వీక్షకులకు న
య్యభ్రంకషకనకనగో, దభ్రద్యుతివిభ్రమంబు దలఁపం జేసెన్. 152

క. శతమఖముఖులకు నిరలం, కృతి యయ్యును నింపు గొలిపె కృష్ణునిజంఘా
ద్వితయ మది యట్లు వృత్తో, న్నతులకు మఱి వేఱ భూషణంబులు గలవే ?. 153

సీ. వీనిచెల్వము వార్త విన్నభయంబున, బ్రీహిగర్భంబులు విరియకున్నె ?
కౌను రెల్ల వీనిచేఁ గోల్పడ్డకాహళు, లీశులకడ మొఱ లిడక యున్నె ?
యెదిరి వీనికి నిర్వహింపనికాళాంజు, లూరులతమ్ములు నో రొగ్గకున్నె ?
యొప్పిదంబున వీని కోడినశరధులు, హృదయశల్యవ్యథ నెరియకున్నె ?
గీ. సోయగముచేత బటు వైనసొబగుచేతఁ, బోల్ప నొండొంటిఁ దమలోనఁ బోలుఁ గాక
వీని కుపమాన ముండునే వేఱ ? యనుచు, విభునిజంఘలఁ బొగడి రవ్విబుధవరులు.

తే. ఆదిపూరుషదివ్యనానాఖిలాంగ, పథపథిక మైనదేవతాపతులచూడ్కి
చేరుగడ యైనతత్పదాంభోరుహములఁ, జెంది చరితార్థభావంబు నొందె నపుడు. 155

సీ. పరమనిత్యైకాంతభక్తసర్వస్వంబు, జలజాలయాహస్తసౌఖ్యసాక్షి
ప్రాభాతికాంబుజప్రస్పర్ధమానార్థి, శింజానవేదమంజీరకంబు
దీనరక్షావిధాదీక్షాకృతక్షణ, మాపవర్గికనిరస్తైకపదవి
సంతతశ్రుతిశిఖాసంమృగ్యమాణంబు, శాంతసంయమిజనస్వాంతసుఖము
గీ. కరతలోచ్చయసకలార్థికల్పకంబు, సకలచేతనమూర్ధవాస్తవ్యకంబు
వేలుపులచూడ్కి నొడిచి దక్కోలుగొనియెఁ, బరమపురుషునిశ్రీపాదపద్మయుగము.

ఆ. లీల నంగుళీప్రణాళీముఖంబులఁ, బ్రణతజనుల కమృతరసము గురియు
నదియ కాఁ దలంచి రమరులు నఖరుచి, స్ఫురిత మైనవిష్ణుచరణయుగము. 157

చ. పరుసన కల్పకప్రథమపల్లవముల్ మలినంబు శోణసం
స్ఫురదరవిందరాగరుచిపుంజము సంకుచితంబు శారదాం
బురుహములంబు దీనిగుణముల్ ప్రకటించినచోట నంచుఁ ద
చ్చరణతలద్వయంబునకు జాతమహాద్భుతు లైరి దిక్పతుల్. 158

సీ. విశ్రాణనాభ్యాసవిధికిఁ గల్పనగంబు, వికసనావేశంబు విననగఁ దమ్మి
శ్రితతాపహృతి నేర్చుమతి నాతపత్రంబు, త్రిజగజ్జయక్రియ దెలుపఁ బడగ
చిత్రశౌర్యంబు నేర్చికొనంగ వజ్రంబు, నవనతాలంకృతి కరిదరంబు
లతులలావణ్యసుబాద్ధిఁ గాన ఝషంబు, నైశ్వర్య మెఱిఁగింప నంకుశంబు
గీ. నాశ్రయించి యున్న నగు నిక్క మిది యని, యుల్లములు దలిర్పనూహ చేసి
రమరవరులు విభునియంఘ్రితలంబులఁ, జెన్నుమిగులుకుశలచిహ్నములను. 159

చ. హరుఁడు శిరంబుపై నిడి సమాదరణంబు ఘటించినప్పుడుం
బొరసినకందు కార్శ్యమును బోదొకొ చంద్రున! కీముకారిస
చ్చరణము లాశ్రయించునఖచంద్రులు పూర్ణులు నిష్కళంకులున్
హరిసరియాశ్రయంబు గలదా యని దివ్యులు మెచ్చి రాత్మలన్. 160

వ. ఇవ్విధంబున నఖిలచేతనచేతోవలోకనలోభనీయసర్వాంగసుందరుండును, నిత్యనిరవద్యనిసర్గదివ్యాద్భుతాచింత్యతారుణ్యలావణ్యమాధుర్యగాంభీర్యస్థైర్యధైర్యాద్యనంతకల్యాణగుణరత్నరత్నాకరుండును, ఆత్మానురూపసుకుమారసుఖస్పర్శసుగంధబంధురదివ్యభూషణభూషితుండును, దివ్యమూర్తిధరపాంచజన్యసుదర్శనకౌమోదకీనందకశార్ఙ్గాదిదివ్యాయుధసేవ్యమానుండును నై, నిజోత్సంగసంగరమాసమాహితాత్మపరస్పరనిరీక్షణమధురసార్ద్రప్రణయనవ్యతరదివ్యరసానుభవంబునం గాలంబు నంతిర్భవింపం జేయుచు, మధురగంభీరభావగర్భితమందహాసవిలాసవికాసితదివ్యవదనారవిందశోభానుభావభావితం బగుచు నిగుడునిజదివ్యామలకోమలావలోకనలీలాలసవాగమృతస్యందంబున నఖిలజనహృదయాంతరంబులు నాపూరితంబులు గావింప, సకలకార్యకారణైకకారణు నశేషచిదచిదంతరాత్ముఁ బరమాత్ము నఖిలేశ్వరేశ్వరు ననీశ్వరు నఖిలైకసాక్షి నఖిలవాఙ్మానసాగోచరామేయప్రభావు నిఖిలహేయప్రత్యనీకుం గల్యాణగుణైకతానస్వరూపుం బురాణపురుషుం బురుషోత్తముం బుండరీకాక్షు సమస్తచేతనైకాభిగమ్యు సర్వప్రకారైకనిరతిశయభోగ్యు నాశ్రితవత్సలు నాపత్సఖు ననాథనాథుం గృపాలీలాపరాయణు శ్రీమన్నారాయణుం గాంచి, మహేంద్రాదిబృందారకు లాపాదచూడంబు నాచూడపాదంబునుం గాఁ దదఖిలావయవంబుల వెల్లివిరియునమందసౌందర్యసముత్తేజసద్యోలావణ్యామృతరసపూరంబు నాత్మీయనిశ్చలదృష్టినాళంబుల వెక్కసంబుగం గ్రోలుచు నిరస్తసమస్తాంతస్తాపులు నిస్సీమపరమానందజలధినిమజ్జమానాంతరంగులుం బ్రకృష్టసంతోషబాష్పధారాప్రాలంబచుంబితోరస్కులుం బ్రహృష్టరోమాంచకంచుకితసర్వాంగులు నగుచు నత్యంతసాధ్వసవినయావనతసర్వాంగంబులతోఁ దదీయదివ్యపదపీఠోపాంతప్రదేశంబుల నంతంతం బునఃపునస్సాష్టాంగదండప్రణామంబు లాచరించి లేచి ఫాలకీలితాంజలిబంధంబులతో గద్గదకంఠంబులతో నిట్లని వినుతించిరి. 161

## దేవేంద్రాదులు శ్రీమన్నారాయణుని స్తుతించుట.

భుజంగప్రయాతము.

నమస్తే సమస్తైకనంతవ్యమూర్తే, నమస్తే సమస్తవ్యనాద్యంతకీర్తే
నమస్తే ప్రశస్తోల్బణజ్ఞానమూర్తే, నమస్తే నిరస్తాంఘ్రినమ్రాఖిలార్తే. 162



వ. అని వెండియు. 163

క. నేమమున నఖిలచిదచి, త్స్తోమంబున కాత్మ వగుచుఁ దోఁపించుటచే
నేమై పరులై సర్వము, వై మెరసెద వీ వొకండ వంబుజనాభా! 164

క. కారణముకంటెఁ గార్యము, వేరై కలుగమికిఁ గాదె వేదాంతంబుల్
నారాయణ యీవిశ్వము, కారణ మగుని న్నొకండ కా వచియించున్. 165

క. దిక్కుగఁ బుట్టెద ననునీ, యొక్కమనోరథము మొదల నొగిఁ దెలిపి కదా!
యొక్కటి దెలిసినఁ దెలియుం, దక్కటిసర్వంబునను బ్రధానపుఁబలుకుల్. 166

క. దేవతల వీని మూఁటిని, జీవుఁడ నగునేన చొచ్చి చేసెద రూపా
ఖ్యావివరణ మనునీతోలు, భావము గనఁబడిన నినుఁ బ్రపంచము దెలియున్. 167

క. ఆరూఢవేదశిఖలం, దానై బ్రహ్మాత్మసత్పదప్రముఖంబుల్
కారణము దెలుపఁ జాలక, నారాయణ! నీవిశేషనామము గోరున్. 168

తే. ఈశభవదాత్మకతచేత నెల్లజగము, నొకఁడ యని కాదె భవదాత్మకముగఁ గంట
కించనుల 'నేహ నానాస్తి కించ' నాది, వాక్యములు విశ్వవైవిధ్యవారకములు. 169

క. పరమును నపరంబును మఱి, పరమై యపరంబు దెలుపఁ బడుననుశంకన్
బరమేశ! నీకు నధికము, సరియును లే దని విశేషశాస్త్రము దెలుపున్. 170

చ. తివుటఁ బయోధు లేడు గణుతించినచోటఁ దదూర్మి ఫేనబిం
దువులు సమంబు గానిగతి తోయరుహేక్షణ విశ్వ మింతయున్
భవదయుతాయుతాంశశతభాగకళాస్థిత మెట్లు నీసమం
బవు నని కాదె నీకు నిగమాగ్రము లెన్నెడు నద్వితీయతన్. 171

క. నేసి మఱి తాన క్రమ్మఱ, గ్రాసము గొనునేతపురువుగతి నీకలుగం
జేసినయీవిశ్వమును ర, మాసఖ! మ్రింగుదువు నీవ మరలన్ లీలన్. 172

ఆ. హార్దపద్మవీథి నాహంతవాస్తదా, దృష్టగుణవిధానజుష్టమైన
యకాపనిషద మైనయలదహరాకాశ, మీవ యగుటఁ గాంతు రీశ! బుధులు. 173

సీ. బోధాశ్రయత్వంబు బోధమాత్రత్వంబు, రూపించుశ్రుతులవిరోధ ముడిపి
యద్వితీయత్వంబు నంతరాత్మత్వంబుఁ, జాటుప్రాబల్యకులజగడ ముడిపి
గుణనిధానత్వంబు గుణవిహీనత్వంబుఁ, గలిగించుచదువులకలహ ముడిపి
దేహసాహిత్యంబు దేహరాహిత్యంబు, వచియించునొడువులవైర మణఁచి
గీ. సాత్త్వికస్మృతితత్త్వంబు సంవదింప, నైకమత్యంబు గాంచు యథార్థవిదులు
తత్త్వమున నిన్నుఁ గనుఁగొని తావకాంఘ్రి, పద్మముల నేల వినుతురు పద్మనయన!

క. పరతత్త్వసమన్వేషణ, పరులై వెరవు గలవారు పదిలంబుగనీ
చరణములచొప్పు వదలక, తిరిగి తిరోహితుని నిన్ను దెలియుదు రీశా! 175

క. ఊహింప సకలచిదచి, ద్దేహివి నీ వగుట లెస్స దెలిసినమీఁదన్
సోఽహ మనరాదొ! మఱి దా, సోహ మనఁగరాదొ! బుధుల కంబుజనాభా!. 176

సీ. రూపింపఁబడునీస్వరూప మిట్టిది గదా, జ్ఞానంబు నీకుఁ బ్రధానగుణము
పరమేశ! నీజగత్ప్రకృతిభావం బెద్ది, యది శక్తి నీకు రెండవగుణంబు
పేర్మితో స్వాతంత్ర్యబృంహితకర్తృత్వ, మైశ్వర్య మనఁగ మూఁడవగుణంబు
సకలప్రపంచంబు సతతంబుఁ జేయుచో, నలయుమి బలము నాలవగుణంబు
గీ. జగదుపాదాన మయ్యు నిశ్చలత వికృతి, నందమి యు వీర్య మనఁగ నేనవగుణంబు
కార్యకరణంబు నెడ సహకారి నొకటి, నభిలషింపమి తేజ మాఱవగుణంబు. 177

చ. గుణములు నీకనంతములు కోకనదోదర! యాదిభారతీ
గణితము లందులోఁ బ్రథమగణ్యము లై చెలువారు నెవ్వి త
ద్గుణములు దార యన్యగుణకోటి సమస్తముఁ గుక్షిఁ దాల్చు ద
ర్గుణగణదూర! నీవు నిజకుక్షిఁ బ్రపంచము దాల్చుకైవడిన్. 178

తే. అల్పసంకల్పలీల నయ్యఖిలమునకు, సృష్టిరక్షాలయక్రియల్ సేయు దీవు
సహజతేజోబలైశ్వర్యశక్తివీర్య, గుణము లవి యెట్టియవియొ ముకుంద! నీకు. 179

క. నీమహిమాబ్ధికణస్థిత, మై మెఱయుఁ బ్రపంచ మిది యనంతం బనినన్
నీమహిమానంతత్వము, కైముతికన్యాయ మనుట గాదె! ముకుందా!. 180

క. దనుజాంతక! కౌతస్కుత, జన మనవరతానుభూతి శాస్త్రంబులచేఁ
గని గ్రుడ్డియు విని జెవుడును, జనవరి నీమాయ కిఁక నసాధ్యము గలదే?. 181

ఉ. ఎవ్వరు మాట మ న్మెఱుఁగనీదు యథాకథితస్వరూప మై
యెవ్వఁడ వౌట నిన్నెఱుఁగ నీ దనుభావ్యతఁ దోఁచి యైనఁ దా
నెవ్వరి దౌటఁ ద న్నెఱుఁగనీదు ధ్రువం బగు వెల్లిదొట్టు నీ
ద్రెవ్వనిమాయలో మునిఁగి తేలెడుమీలము గామె? యీశ్వరా!. 182

చ. క్షణమునఁ జేయుచేఁత యజకల్పశతాయుతభుక్తిఁ బో దను
క్షణమును బుణ్యపాపములు సంతత మై యొనరించుచొప్పు త
త్క్షణ మగునిమ్మహాభయదసంసృతికిన్ భవదంఘ్రిపంకజ
ప్రణతి యొకండు దక్క మఱి పారము గల్గునె! భక్తవత్సలా!. 183

క. అని మఱియుఁ బెక్కుదెఱఁగుల, వినుతింపఁ గృపార్ద్రదృష్టి వీక్షించి ఘనా
ఘనగంభీరస్వనమున, దనుజకులధ్వంసి దేవతాణతి కనియెన్. 184

క. క్షేమంబే మీ కిందఱ?, కేమిటి కరుదేరవలసె ని? ట్లనుడు సుర
స్తోమానుమతి బృహస్పతి, తామరసోదరునియెదుటఁ దాఁ బ్రాంజలి యై. 185

క. దేవ! సకలైకసాక్షివి, నీవెఱుఁగని దొకటి కలదె? నిక్కం బిపు డే



మై విన్నవింప విను టిది, మావలనం గలుగునట్టిమన్ననఁ గాదే?. 186

క. మాంధాతృమహీపతి దృఢ, సంధామతి నుగ్రతపము సలుపఁగఁ దత్తే
జోంధీభూతం బై ని, ర్బంధంబునఁ బొందినది ప్రపంచం బెల్లన్. 187

ఆ. ఇంద్రపదము నొండె నితరపదం బొండె, నతని కెద్ది యిష్ట మది యొసంగి
భువన ముద్ధరింప నవధరింపుము దేవ!, యిదియె మనవి మాకు నిప్పు డనిన. 188

వ. దరహసితలసితవదనారవిందుం డగుచు మత్పదభక్తుం డైనయతనివలన నొరుల కెవ్వరికిం గీడు పొంద దట్లగుట నిశ్శంక మరలి చనుం డిదె యతనితపంబు నివారింపుదు నని కృపావలోకనంబునం బరితృప్తులం జేసి యనిపినం గృతార్థు లై మహేంద్రాదిబృందారకముఖ్యు లానందంబున నానందకపాణి కంతంతం బునఃపునఃప్రణామంబు లాచరించి వెడలి నిజనివాసంబులకుం జని యనంతరంబ. 189

సీ. దివ్యవిగ్రహకాంతిదిగ్వ్యధూవితతికి, హరినీలవల్లరుః లభినయింపఁ
బేరురంబునయందు బెడఁ గైనకౌస్తుభం, బెల్లచోఁ గలయ నీరెండ గాయఁ
బింజించి కట్టినబిగువుపచ్చనిపట్టు, తొలుకారుమెఱుఁగులఁ దుఱఁగలింప
నిడుదహస్తములఁ బూనినశంఖచక్రంబు, లినచంద్రదీప్తుల నీనికొనఁగ
గీ. శిరసుమకుటంబు నింగిఁ జిత్తరువు గొలుప, గల్లములఁ గుండలద్యుతి వెల్లి గొనఁగఁ
గలికితెలిసోగకన్నులఁ గరుణ చిలుక, జనవరునిమ్రోల శౌరి సాక్షాత్కరించె. 190

వ. ఇట్లు గరుడవాహనరూఢుం డై యారూఢదివ్యమునిసేవ్యమానుం డై యఖిలభువనావనదక్షుం డై పుండరీకాక్షుండు ప్రత్యక్షం బగుటయు. 191

శా. హర్షాశ్చర్యభయంబు లుప్పతిల సాష్టాంగంబు గా మ్రొక్కి యు
త్కర్షింపంగఁ దరంబు గానియొకయంతస్సౌఖ్యమున్ బొంది పై
వర్షింపం బ్రమదాశ్రుపూరము కరద్వంద్వంబు నొక్కింత గా
శీర్షంబుం గదియించి సాంద్రపులకశ్రేణీపరీతాంగుఁ డై. 192

## మాంధాత శ్రీమన్నారాయణుని స్తుతించుట.

దండకము. శ్రీవల్లభా! గల్లభాగద్వయీదర్పణాత్యర్పణాలోక! లోకత్రయత్రాణలీలాకళాదక్ష! దక్షాత్మజాభర్తృచూళీపరిష్కారమందారమాలాభవత్పాదనిర్యత్పయోధార! ధారాసహస్రాంశుదీప్తప్రభాభారమారీకృతారాతిదైతేయనాథావరోధాం జనధ్వాంత సంతాన! సంతానభూజప్రభాపాదపార్థిప్రజాభీష్టవస్తుప్రదానప్రశస్తా! సమస్తాత్మభావానుభావంబు నీవంబుజాతాక్ష! కైకొన్న పైకొన్న నీమాయ నేమా యథామానముం గానఁగా లేక నానానుసంధానసంధానుబంధానుబంధాంధకారంబుచే నిన్నెఱుంగం దెఱుంగం దరంబా? భువిం జిత్తగర్తంబునం గర్తృతాహంకృతిన్ జీవబీజంబు సంకల్పరూపాంకురం బొచు నుద్దామకామాదికాండప్రకాండంబు లడ్డంబుగాఁ బుత్రమి

త్రాదిపత్త్రంబులం జొంపమై సంపదల్ మవ్వపుంగ్రొవ్విరుల్ గాఁ బునర్జన్మకృద్బీజ
సంయోజనామాత్రపాత్త్రంబుగాఁ గర్మమర్మంబునం బఱఁడ నొండొంటి కొంతైనయా
మేను లన్మానులం దట్ట మైనట్టినిస్సారసంసారఘోరాటవీవాటిక న్నిర్గమింపంగ మార్గం
బు లే కెమ్మెయిం ద్రిమ్మరం గండ్లు ముండ్లుం గొనన్ నొప్పిచే నెవ్వగం గూలుచుం
దూలుచుం దద్వ్యపాయం బుపాయంబునం జెందు టానందమై తోఁచు నందంద మై
నింద్రియద్వంద్వసంప్రాప్తిచేఁ దప్తులమైనమా నేరముల్ దూరముల్ చేసియాశీవిషాధీశ
శయ్యా!మదీయాపదల్ పాపవే! పాపవే గోదయం బింక మమ్మింక నాలింపఁ బాలింపఁ
గా దిక్కుదక్కెవ్వరే! నవ్వరే చీఁకునుం జీఁకుఁజేయూఁతగాఁ జేఁత! కీదృశ్యవిశ్వం
బునందత్పరిభావంబు భావంబునం దాన కానంగ లేఁ డొక్కరుం డొక్కరు న్మత్తునిం
జేయఁగా శక్తుఁ డే! యుక్తిసంధిత్స మాత్సర్యబద్ధైకబుద్ధి న్వికల్పించి కించిత్పరిజ్ఞానముం
గానఁగా లేనిదుర్వారదుర్వాదులంగా దనం జాలి లీలాకలోత్సేకత న్నైకతాపాద్యమా
నుండ వై యెన్న నుద్యోగి వై నీతవిద్యాగతిన్ లోకమున్ దూరితాలోకముం జేసి
చీకాకుగాఁ గాకు సేయంగ నేపోకలం బోక యేకాకు లై యాకు లైశ్వర్యకార్యంబు
వర్జించి పంచేంద్రియాదిప్రపంచంబు నిర్జించి మోహంబులం గోసి దేహంబులన్ బూర్ణ
గేహంబులన్ రోసి శీతాతపాభీరు లై జీర్ణపర్ణానిలాహారు లై ఘోరతీవ్రప్రభాచార
చాతుర్యధుర్యు ల్మహాయోగివర్యు ల్సదాగాధసంబోధసంబాధనిర్బాధహృద్వీథులన్
నిన్ను శోధించియున్ గట్టిగాఁ బట్ట లే రన్న మమ్మెన్నఁ గా నేల? యేలా వృథా గాధ
లింకన్?భవాంధాంధుమూలంబులం గూలి యుక్కేది దిక్కేదియున్ లేనిమాధు ల్నిరూ
ఢానుకంపాగుణావిద్ధులం జేసి నీ వుద్ధరింపంగఁ దా రెంతయున్ నీపదారాధనాసాధనా
సక్తు లై భక్తిసంయుక్తు లై ముక్తు లై శుద్ధ మిద్ధంబు వేదప్రసిద్ధం బసూయం బమానం
బమేయం బజేయం బవాచ్యం బమోచ్యం బనాశం బనీకాశ మేసౌఖ్య మాసౌఖ్యముం
గాంతు రబ్జాలయాకాంత! యేక్రంతలన్ వ్రంతలన్ రంతలం జెందలే న్నుందలే నింక
నేఁ గింకరత్వంబు తత్త్వంబు గాఁ జూచెదన్ దాస్య మాశాస్యముంగా నపేక్షించెదన్
భృత్యకృత్యంబు నిత్యంబు గాఁ గోరెదన్ సేవకత్వంబు సత్త్వంబు గా నెంచెదన్ దావ
కీయార్హనిర్హేతుకారుణ్యగణ్యైకవీక్షం గటాక్షింపవే! శిష్టరక్షాపరా! దుష్టశిక్షాకరా!
ధర్మసంస్థాపకా! శర్మసందీపకా! భక్తకర్మచ్ఛిదా! ముక్తిమర్మప్రదా!. 193

సీ. తృష్ణాపరుం డైన తెరువరి తియ్యని,మున్నీటిసలిలంబు లెన్ని గ్రోలు
నిఱుపేద యగువాఁడు నిర్జరగిరిఁ జేరి, జాతరూపం బెంత సంగ్రహించు
గణనాపరుం డైనగణికుండు సమకొని, రిక్కల నెన్నింటి లెక్కవెట్టు
లంఘనోన్ముఖుఁ డైనజంఘాలుఁ డొక్కరుం, డిమ్మహీవలయంబు నెంత గడచు
గీ. నట్టిదయ పో యనంతకల్యాణగుణస, మృద్ధుఁ డగునిన్ను ననుబోఁటి యెంత పొగడు
నెంతమాత్రముఁ బొగడుట కేది యెఱుక?,యెఱుక నేఁ డిఁకఁ గలుగు నే?యీశ్వరేశ!



చ. తొలుదెస వెల్వమానికపుఁదొరపుఁగాంతికి మేలుబంతి క్రొ
మ్మొలక మెయిళ్లవన్నియలమొల్ల మికిం దగుపుట్టినిల్లు గుం
పులుఁగొనుతోరపుంబసిమిబూమియచూపువిడంబనంబు నీ
బలితపుమేనిచాయ కనుఁబండువు నా కొనరించె నచ్యుతా!. 195
చ. అసుజలవర్గముం జలరుహంబులు నీశ్వర! తారు శారదో
ల్లసనముఁ బూని యైన నవిలంఘ్యతమగ్రకృతమీలనంబు రా
జసవృతికల్మియందలి ప్రసాదము నొందక యుండునట్టినీ
యసమపదాబ్జయుగ్మ మలరారెడు మామకమానసంబునన్. 196
చ. సురనదికం టెఁ దార తొలుచూలుసుమీ యని యెల్లవారికిం
జిరతరధాళధళ్యమునఁ జెప్పక చెప్పెడుభంగిఁ బొల్చునీ
చరణబిసప్రసూననఖచంద్రమరీచులు పర్వి నామదిం
దొరలుతమంబు వో నడిచెఁ దోయరుహోత్పలబంధులోచనా!. 197
చ. సిరియును ధాత్రియున్ శయకుశేశయయుగ్మముఁ బ్రవీణ లై
సరసత నొత్తుచోఁ బొదలి సంకులముత్పలకాంకురావళుల్
బెరసినయప్పు డీమెఱుఁగుఁ బిక్కలు నిక్కము నిక్కము దాల్పకుండునే
యురగశయాన! పాదకమలోచితకంటకనాళభావమున్?. 198
ఉ. అందము లైననీతొడలయాకృతిశోభ వహింప లేనియా
నిందకుఁ జాలమిన్ నిలువునీ అగుటెంత యనంటికంబముల్!
నందితభక్తలోకయతులం బగునీభవమూరుసామ్యముం
బొందఁ దలంచుధూర్తమతిఁ బొందె నధోగతి హస్తిహస్తముల్. 199
ఉ. కన్నులపండు వై ధగధగంజిగిరంగు దుఱంగలింపఁగాఁ
జెన్ను వహించునీపసిఁడిచేల వహించిన నీలవర్ణ! నీ
యున్నతిఁ జూడ మీఁదినగ మెల్ల ఘనాఘనపంక్తి పర్వి పై
గొన్న మెఱుంగుబంగరువుకొండగతిం దిలకించె నెంతయున్. 200
ఉ. లోకము లెన్ని యన్నియును లోఁగొనియుం దనలేమిఁ జూపునీ
యాకృశమధ్యభాగ మిపు డీక్షణలక్ష్యము గా దటంచు నే
నోకమలేశ! లే దనుట యుక్తము గా దల బ్రహ్మఁ గన్ననా
ళీకముతోడి పొక్కిలికి లేమి ఘటిల్లెడునట్లు గావునన్. 201
చ. పొలుపుగ మధ్యదేశమునఁ బూనినకౌస్తుభ మెఱ్ఱచాయలన్
ధళధళితద్యుతుల్ గొలుప దైత్యవిమర్దన! నీయురంబు ని
ర్మలరుచి గూడఁ బోల్చె నడుమం బ్రతిబింబితబాలభానుమం
డలము వెలుంగఁ బొల్చుయమునానది గన్నహ్రదంబు కైవడిన్. 202

చ. దళితము హేంద్రనీలరుచిదాయకవిగ్రహ! నీగభీరతా
జలనిధిభావముం దెలుపఁ జాలినలక్షణలక్షితంబు లై
యలవడెఁ గంకణాంకితము లై సముదంచితశంఖచక్రసం
కలితము లై యభంగపరిఘాసమతుంగభుజాతరంగముల్. 203

చ. తనసుషమావిశేషములఁ దప్పక శంఖములం జయించుటం
దనికినకీర్తిరేఖలవిధంబున నుజ్జ్వలకాంతిఁ బొల్చునీ
యనుపమతారహారలతికాపరికల్పితవేల్లనంబుచేఁ
గనుఁగొన నొప్పు నీ కిపుడు కంధరకంధరవర్ణబంధురా!. 204

చ. వెడవెడ క్రొత్తక్రొత్తమొగి విచ్చినకెందలిరాకుఁ గెంపు చూ
పెడుజిగి గల్గునీయధరబింబమరీచులు దొంగలింప నీ
బెడఁగు వహించునెమ్మొగము పేరిటిపున్నమచందమామకున్
సడలనిదట్టపుంబొడుపుఁ జాయ ఘటించెడు నంబుజోదరా!. 205

చ. తిలకితదంతకాంతు లనుతీవమెఱుంగులు సుస్వరాఖ్యగ
ర్జలు గలనీవచోమృతరసంబులు పైఁ గురియంగ నామదిం
గలభవతాప మెల్ల విడి గ్రమ్మవె యంగకదంబకంబులం
బులకనవాంకురంబు లివి పొం దగురీతి గదా! గదాధరా!. 206

ఉ. ముద్దులు గుల్కునీభువనమోహనకుండలరత్నదీధితు
ల్గద్దఱిలాగు మై ధళధళం బొలుపారెడుభంగిఁ జూడఁ గాఁ
దద్దయుఁ జెన్ను మీఱెడుఁబదప్రణతావనకేళిలోల! నీ
నిద్దపుఁజెక్కుటద్దముల నిల్వక జాఱుచుఁ బ్రాఁకుకై వడిన్. 207

ఉ. క్రొవ్వున మచ్చరించి తుద గూడక వే శరణార్థిబుద్ధితో
నివ్వటిలంగ నీమొగము నెమ్మదిఁ జొచ్చి వెలుంగుమవ్వపుం
గ్రొవ్విరితెల్లదామర లొకో! యనఁ గాఁ దగి చక్రహస్త! తే
నవ్వ దొలంకునీదునయనంబులు నామదిఁ జూఱలాడెడిన్. 208

ఉ. నాసిక పేరిమవ్వపుటనంటికిఁ బైబొమ లాకు లయ్యె న
ల్లాసము చూపులేఁతమొవులాగు నెయిం దిలకంబు గల్గెడుం
బ్రాసవగంధ మింక నని బంభరడింభకపఙ్క్తి చేరున
ట్లై సకలేశ! నీదునిటలాలకజాలక మింపు గొల్పెడిన్. 209

చ. అభయవితీర్ణిధుర్య! కరుణామృతవర్షము చూపుమేఘస
న్నిభుఁ డగునీకు నీవివిధనిర్మలరత్నకిరీటభూషణ
ప్రభలు ఘటించు చున్నయవి భక్తమయూరమహోత్సవంబు గా
నభినవపాకశాసనశరాసనసృష్టికళాకలాపముల్. 210



ఉ. ఉల్లము చల్ల నయ్యె మొద లూడె మనోరథముల్ జగంబుపై
నొల్లమి పుట్టె చేరుగడ నొందితి నీశుభదివ్యవిగ్రహా
భ్యుల్లసనావలోకనసుఖోదధిలోపల నోలలాడుచుం
బొల్లిటివాఁడఁ గానిగతిఁ దోయరుహేక్షణ! సంతసించెదన్. 211

చ. తెలియనిధూర్తవర్తనులు తెంపరు లై తమయుక్తిభంగులన్
బలుకుట గాక నిక్కముగ భక్తివశుం డగునిన్నుఁ జూడఁ గాఁ
గలుగుటకంటె నొండొకసుఖంబును గల్గునె? కల్ల నిమ్ము! నా
తలఁపున కింపు గా దిదియ తప్పక కల్గ ననుగ్రహింపవే!. 212

క. అని భక్తిపరతఁ గ్రమ్మఱ, వినతుం డగునృపునిఁ జూచి విశ్వైకగురుం
డనుకంపమై ఘనాఘన, ఘనగర్జాస్వరవిధావికస్వరఫణితిన్. 213

## ⊸ శ్రీమన్నారాయణుండు మాంధాత ననుగ్రహించుట. ⊷

తే. కువలయేశ్వరచంద్ర! నీకోరినట్లు, మోక్షఘంటాపథం బైనమునివరైక
దుర్లభాస్మత్పదాంబుజోద్భూతభక్తి, గలుగు నీ కింక నాయనుగ్రహమువలన. 214

వ. అస్మదీయమాయావిమోహితం బైనజగజ్జనంబు యథార్థంబున నన్నెఱుంగను మత్పద
ప్రాప్తిరూపమోక్షంబు గొనను నెఱుంగదు. నీకు మదీయమాయాజయంబును మత్పద
ప్రాప్తిసాధనం బైన మదీయపదభక్తియు నొసంగితి నెప్పటిగతి రాజ్యపరిపాలనంబు
సేయుచు మద్భక్తియోగనిష్ఠుండ వై యుండు మని కృపావలోకనసుధాధారల నభిషి
క్తునిం జేసి భగవంతుం డంతర్ధానంబు నొందినం గృతార్థుం డై. 215

శా. చేసెం బ్రాజ్యము గాఁగ రాజ్యము నృపశ్రేష్ఠుండు ధీనిష్ఠుఁ డై
త్రాసాపాదితదోషదూరఘణరత్నద్రత్నగర్భాసము
ద్భాసిస్వీయభుజాభుజంగమనిపీతక్రూరపీరారికాం
తాసోల్లాసవిలాసహాసనికరోదంచత్పయగపూరుఁ డై. 216

క. కవితావిచక్షణత గల, కవి కంఠవిభూషణముగఁ గైకొనవలయుం
గవివరనృసింహవిరచిత, కవికర్ణరసాయన మనుకావ్యము దీనిన్. 217

## ⊸ ఆశ్వాసాంతము. ⊷

శా. ప్రస్తుత్యప్రవిఫుల్లహల్లకరుచిస్పర్ధాళుహస్తాభయ
ప్రస్తారప్రతిభారితానతనమఃపర్యాయనాదోద్యమ
ప్రస్తావోద్గుణకప్రతీకవిలసత్ఫాల స్థలాద్రిస్ఫుట
త్కస్తూరీతిలకోపలక్షితదళత్కల్హారవారత్రపా. 218

క. ఆదిమశఠకోపాది, ద్వాదశనిజసూరివిరచితద్రావిళగ్రం
థాదృతసతతశ్రవణా, స్వాదకళాముక్తముక్తసామవిభేదా. 219

మాలినీ. శతశతరవితేజా సర్వరాజాధిరాజా
నతజనసురభూజా నాభిదీవ్యత్పయోజా
సతతమహితభూమా సత్యసంపూర్ణకామా
దితిసుతకులభీమా దేవతాసార్వభౌమా. 220

గద్య. ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహసేవకోపసేవకనరసింహనామధేయ ప్రణీతం బైనకవికర్ణరసాయనం బనుకావ్యంబునందుఁ దపశ్చరణంబును, గ్రీష్మవర్షా శిశిరర్తువర్ణనంబులును, అప్సరస్సమాగమప్రకారంబును, నృత్తప్రపంచంబును, సముద్రవర్ణనంబును, వైకుంఠవర్ణనంబును, భగవద్దివ్యమండపవిగ్రహవర్ణనంబును, స్తోత్రంబును నన్నది సర్వంబును షష్ఠాశ్వాసము.

కవికర్ణరసాయనము సంపూర్ణము.



చెన్నపురి : వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రితము—1916.

